# ఆంధ్రసచిత్రవారపత్రిక

13-19, డిసెంబర్, '85
రు. 2-50

అర్థవీడులో
శిథిలంకానున్న
చెన్నకేశవ
ఆలయం

మనుష్యుల్లో
వైరస్‌లు
కలిగించే
వ్యాధులు!




## ముఖచిత్రం

8, 14 నవంబర్ ఆంధ్ర సచిత్ర వారపత్రిక అందాల నటి శ్రీదేవి ముఖచిత్రం సర్వాంగ సుందరముగా వుండి మా హృదయాన్ని రంజింప చేసింది.

జి. రమణి మోహన్, కడప

## ఆకర్షణీయం

అందాలతార "శ్రీదేవి" ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక 'దీపావళి' సంచిక ప్రతిపేజీ, పేజీకొక ప్రత్యేకతను సంతరించుకొని, ఎంతో ఆకర్షణీయంగా క్రొత్త వెలుగును తీసుకొచ్చింది.

'దీపావళి' పండుగ సందర్భంగా పాఠకులకు ప్రముఖ నటీమణులు జయప్రద, జయసుధ మరియు శ్రీదేవి అందించిన వ్యాసాలు హాస్యంగా వున్నాయి. వారికి మా అభినందనలు.

కె. వెంకటరామ అక్కయ్య, కంకిపాడు

* * *

శ్రీదేవి ముఖచిత్రంతో వెలువడిన సంచిక, మంచి ఆకర్షణీయంగా ఉంది. ఈ సంచికలోని కవితలు, కార్టూన్లు నాకెంతో నచ్చాయి.

ఎస్.ఎమ్. గౌరిశంకర్, కొరుకొండ

## తెలుగు సంస్కృతి

అందాల నటి శ్రీదేవి ముఖచిత్రంతో వెలువడిన దీపావళి సంచిక 8-14 విషయ వైవిధ్యంతో సర్వాంగ సుందరంగా ఉంది, బహుమతి పొందిన కథలు బాగున్నాయి. "మహామనిషి బూర్గుల" యదుకులాంబుధి చంద్రుడు శ్రీకృష్ణుడు" అగస్త్యేశ్వరాలయంల గురించి అందించిన విధానం తెలుగువాడి సంస్కృతిపట్ల అభిమానాన్ని తెలియజేస్తున్నది.

పెద్ది రమేష్, నిలిమా, నసిమా,
ఇంకా మిత్రబృందం– ఇల్లెందు

## బాగుంది

"మలుపు" పెద్దకథ బాగుంది. ఈ కథలో ఉదయమాటలు ఆణిముత్యములవలె వున్నవి. గతాన్ని మరచి నాతోరా అనిపిలిచినా వెళ్ళని వుదయ నిర్ణయం బాగుంది.

డి. రోహిణి, తిరుపతి

(74వపేజీ చూడండి)







ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు : (1938-1972)

13-19, డిసెంబరు, 1985
శ్రీ క్రోధన నామ సం. మార్గశిర. శు. విదియ
సంపుటము 78 : సంచిక 14
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2-50 |
| పోస్టులో 6 నెలల చందా | రు. 71-50 |
| పోస్టులో 12 నెలల చందా | రు. 143-00 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధినగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక

## న్యూఢిల్లీ లేఖ



**డా. జయదుబాషి**

# పేద దేశాల స్థాయికి దిగిన భారతదేశం!

కల్పనలని సృష్టించడం అన్నది ఒక కళ. కానీ భారతదేశంలో అది దాదాపు ఒక పరిశ్రమలా తయారయింది. సమాచార మంత్రిత్వశాఖ కల్పనలని సృష్టించడానికి, కొద్దిపాటి వ్యక్తులని గొప్పగా చిత్రించడానికే ప్రధానంగా ఉద్దేశించబడినట్లు కనిపిస్తున్నది. మీరు టి. వి. తప్ప మరేదీ చూడకపోతే మన యువ ప్రధానమంత్రి ఇటీవలి తమ విదేశ పర్యటన ద్వారా ప్రపంచ చరిత్రని సృష్టించారని, ప్రపంచంలోని సగం దేశాల అధ్యక్షులు, ప్రధానమంత్రులు ఆయన బస చేసిన హోటల్ గది ముందు బారులు తీరి ఆయన దర్శనం కోసం వేచి ఉన్నారని అనుకుంటే అది మీ తప్పు కాదు. అయితే మనదేశంలో అరుదుగా కనిపించే వాటితో సహా మీరు విదేశీ వార్తాపత్రికలు చదివితే మాత్రం వాటిలో ఆయనని గురించి ఎక్కడ రాసి ఉందో వెతకటానికి చాలా శ్రమపడాల్సి ఉంటుంది. కల్పనలని సృష్టించడం అంటే ఇలాగే ఉంటుంది.

మన గురించి జాగ్రత్త పడగల్గ స్థితిలోనే మనం ఉన్నామని జియా బాంబు ప్రస్తావన వచ్చినప్పుడు రాజీవ్‌గాంధీ ఈ మధ్యనే అభయం ఇచ్చారు. పాకిస్తాన్ శాస్త్రజ్ఞుల కన్నా మన శాస్త్రవేత్తలు మరింత నైపుణ్యం కలవారు కావటమే దానికి కారణంగా చెప్పారు. ఇది కట్టు కథలు చెప్పే మనవాళ్ళు సృష్టించిన మరో కల్పన. మిగతా వారి కన్నా వీళ్ళు ఏవిధంగా అధికులో నాకు తెలియదు. మన శాస్త్రజ్ఞులు, సాంకేతిక నిపుణులలో ప్రత్యేకత అంటూ ఏమీ లేదు. ప్రపంచంలోని సాంకేతిక శక్తిలో మనది మూడవ స్థానం అన్నది వాస్తవమే కావచ్చు కానీ అది అంతవరకే. మన అణుశక్తి విభాగం వారినే తీసుకోండి. మనకి ఉన్న అణుశక్తి కేంద్రాలలో ఒక్కటి కూడా సరిగా పని చెయ్యడం లేదు. రాజస్తాన్ కర్మాగారం లాంటివి గత కొన్నేళ్ళుగా మూతపడి ఉన్నాయి. భారీ ఎత్తున అణు ఉత్పాదక లక్ష్యాలని నిర్ణయించడం గత కొన్ని సంవత్సరాలుగా మనలో చాలా మందికి తెలుసు. విక్రమ్ సారాభాయ్ హయాంలో కూడా అలాంటి ప్రకటనలు వెలువడ్డాయి. అయితే గత పదేళ్ళుగా మన అణు ఉత్పాదక శక్తిలో ఏమాత్రం పెరుగుదల లేదనే చెప్పవలసి ఉంటుంది. ఇది పూర్తిగా మన శాస్త్రజ్ఞుల తప్పు కాకపోవచ్చు. ప్రచార శాఖలోని వారి కల్పనల స్థాయిని వాస్తవంలో వారు అందుకోలేరు.

ప్రపంచంలో మనదేశం ఎక్కడ ఉన్నదన్న దానిని గురించి కూడా కల్పనలు ఉన్నాయి. భారతదేశం ప్రపంచంలో పదవ పెద్ద పారిశ్రామిక దేశంగా ఉండేదని గత కొన్నేళ్ళుగా చెబుతున్నారు. దానికి కారణం నెహ్రూలు చేసిన కృషేనని చెప్పారు. మనం అభివృద్ధి రీత్యా మంచి ప్రగతి సాధించామన్న దాంట్లో సందేహం లేదు. కానీ అలా అభివృద్ధి చెందిన దేశం మన ఒక్కటే కాదు. నిజానికి మిగతా ప్రపంచం 1950 నించీ 1980 వరకు గల ముప్పయి సంవత్సరాలలో ఏమి సాధించిందో చూస్తే మనదేశం ఎంత వెనుక పడి ఉందో తెలుస్తుంది. అది మొత్తం జాతీయ ఉత్పత్తి (జాతీయ ఆదాయం) లేదా వ్యవసాయం లేదా పరిశ్రమలు లేదా విదేశీ వాణిజ్యం కానీయండి మనకన్నా ప్రపంచం ఎంతో ముందుకి వెళ్ళిపోయింది. మనకన్నా ముందుకి దూసుకు వెళ్ళిన దేశాలలో చైనా కూడా ఉన్నది.

అయిక్యరాజ్య సమితిలో ఆర్థిక శాస్త్రవేత్తగా కొన్ని సంవత్సరాలు పని చేసిన సురేంద్ర పటేల్ సేకరించిన వివరాలన్నిటినీ ఇక్కడ ఇచ్చి మీకు విసుగు పుట్టేలా చెయ్యను. కానీ ముఖ్యమైన విషయాలని మాత్రం చెప్తాను. ప్రపంచ వాణిజ్యంలో భారతదేశం వాటా 1950 లో 2 శాతం అయితే అది 1980 కి 0.5 శాతానికి తగ్గిపోయింది. అంటే ముప్పయి సంవత్సరాలలో అది నాలుగో వంతుకి దిగజారిపోయిందన్న మాట. ఇక జాతీయ ఆదాయానికి వస్తే 1950 లో 2 శాతం ఉన్న మన వాటా 1980 కి 1.4 శాతానికి తగ్గిపోయింది. పారిశ్రామిక ఉత్పత్తిలో మనం ప్రపంచంలో 10వ స్థానంలో ఉండవలసిన వాళ్ళం. కానీ పటేల్ అదెంత మాత్రం నిజం కాదని అంటారు. ప్రపంచంలో ఎన్నో ఇతర దేశాలు ముందుకి వెళ్ళిపోయాయి. భారతదేశం 27వదిగా ఉంది. తలసరి లెక్కల ఆధారంగా చూస్తే భారతదేశం స్థానం 50 కాదు 100కి దరిదాపుగా ఉంటుంది. అంటే మనది అతి పేదదేశాలలో ఒకటిగా ఉన్నదన్నమాట.

ఈ అంకెలన్నిటినీ నేను సరిచూసాను. కానీ వాటిలో తప్పు ఏదీ లేదు. మనం ప్రపంచంలో ఏ స్థానంలో ఉన్నా, మన విదేశీ వాణిజ్యం తగ్గిపోతున్నా వ్యక్తిగతంగా నాకేమీ బాధలేదు. ఒక ఖండంతో పోలిస్తే మనది అంత పెద్దదేశం ఏమీ కాదు. ఖండాల ఆర్థిక వ్యవస్థలు స్వయం సమృద్ధి కన్నా ఎక్కువగానే ఉంటూ ఉంటాయి. నా దగ్గర ఋజువు చెయ్యడానికి లెక్కలు లేకపోయినా అమెరికా సంయుక్త రాష్ట్రాలు కూడా మనలాగే ఉన్నాయని నా నమ్మకం. ప్రపంచ వాణిజ్యంలో దాని వాటా క్రమంగా తగ్గుతున్నదే కానీ పెరగటం లేదు. మీరు ఏదో ఒక పెద్ద రంగంలో, ప్రస్తుతం జపాన్ లాగా, ఒకప్పుడు బ్రిటన్ లాగా, మొట్టమొదటి స్థానంలో ఉండటం అన్నది చాలా అవసరం. జపాన్ ఎన్నిటిలోనో మొదటిదిగా ఉన్నది. ఉదాహరణకి కార్లు, ఉక్కు ఉత్పత్తిలో దానిదే అగ్రస్థానం. ఎప్పుడైతే ఒక దేశం ఏదో ఒక దానిలో తనకి ఉన్న



# న్యూఢిల్లీ లేఖ

మొదటి స్థానాన్ని పోగొట్టుకుంటుందో అప్పుడే దాని పతనం ప్రారంభం అవుతుంది. సోవియట్ రష్యా విషయంలో అదే జరుగుతున్నది. ప్రపంచంతో పోల్చి చూస్తే అది కూడా దిగజారిపోతున్నది. పాశ్చాత్య దేశాలతో సమానంగా అది కూడా శక్తివంతమైన అగ్రరాజ్యంగా తన స్థాయిని నిలుపుకునేందుకు రక్షణ పరికరాల కోసం బాగా కర్చు చేస్తున్నది. అలా చెయ్యటానికి ఆదేశం తన ఇతర కార్యక్రమాలని తగ్గించుకోవాల్సి వస్తున్నది. అందువల్ల అది నిరంతరం వొత్తిడికి, దాని ఫలితంగా ఉద్రిక్తతకి లోనవుతున్నది.

మనం కూడా ఏదో ఒకరకమైన వొత్తిడికి లోనవుతూనే ఉన్నాము. అది ప్రపంచానికి సంబంధించినది కాదు. అంతర్గతమైనది. సోవియట్ రష్యాలోని ప్రభుత్వం నిరంతరం ఏదో ఒక దేశంతో యుద్ధం చేస్తూనే ఉంటుంది. భారత దేశంలో ప్రభుత్వం తన ప్రజలతోనే యుద్ధం చేస్తూ ఉంటుంది. శ్రీమతిగాంధీ హయాంలో కేంద్ర ప్రభుత్వం ఎవరో ఊహా శత్రువు మీదో, మరొకరి పైనో కత్తి ఝుళిపించడంతో తీరిక లేకుండా ఉండేది. రాజీవ్‌గాంధీ కొంత నయం. కానీ ఇది కూడా తాత్కాలికమేమోనని నా సందేహం. అత్యవసర పరిస్థితికి ముందు ఉన్న పరిస్థితులు పునరావృతం అయితే ఈ ఉపశాంతి ఎంతకాలం ఉంటుందన్నది చెప్పటం కష్టం. ఇప్పుడు రాజీవ్ గాంధీని పొగడటంలో తీరిక లేకుండా ఉన్న ఈ కల్పనలని సృష్టించే వాళ్ళే, శ్రీమతి గాంధీ వొత్తిడికి లోనైనప్పుడు చేసినట్లుగానే, అప్పుడు మరొకరకం కల్పనలని సృష్టించడంలో మునిగిపోతారు.

రాబోయే సంవత్సరాలలో భారతదేశం విపరీతమైన వొత్తిడికి గురవుతుంది. అందువల్లనే దాని సామర్థ్యం పరీక్షకి గురవుతుంది. దీనికి కారణం భారతదేశం ప్రథమస్థానంలో ఉన్నదని కాదు కానీ ప్రపంచంలో దానికి మొదటిది గానో, రెండవది గానో లేదా మూడవది గానో నిలబడే అవకాశాలు ఉన్నాయి కాబట్టి. అలాంటి దేశాలు చాలా కొద్దిగా ఉన్నాయి. వాస్తవంగా ఇప్పటికే అగ్రరాజ్యం స్థాయిని ఏదో విధంగా అందుకున్న దేశం చైనా తప్ప మరొకటి లేదు. కానీ తన ఆర్థిక వ్యవస్థని చక్కదిద్దుకునే వరకూ మొదటి స్థానం దరిదాపులకి కూడా భారతదేశం చేరుకోలేదు. ఎన్నో కారణాల వల్ల మన దేశం ఆర్థిక వ్యవస్థని సక్రమమైన మార్గంలోకి తేలేకుండా ఉన్నది. తనకి ఉన్న పారిశ్రామిక, తదితర రంగాల శక్తి ఏమిటో అంచనా వేసి, దానిని వినియోగించి ప్రపంచంలో ఒక స్థాయిని అందుకోవటం ఎలా అన్నది ప్రస్తుతం దేశం ఎదుర్కొంటున్న ప్రధాన సమస్య. అందుకే కర్తవ్యోన్ముఖంగా పురోగమిస్తున్న ఈ వాస్తవ ప్రపంచంలో కల్పనలు సృష్టించే వారికి చోటు లేదు. □

# ఎల్లప్పుడూ ఆంప్రోనే!

పిల్లలకు
ఆంప్రొ అంటే ప్రాణం...
అందుకే ఎప్పుడూ
తయారుగా ఉంచుతాను!
అందులో ఎంతో రుచి,
బలమూకల బిస్కట్లు!

కాస్త ఆగండి...
ఒక్క బిస్కట్టును తినండి.




## ఆంప్రో గ్లూకోజ్ బిస్కట్లు
## ఆంప్రో తో మీకు నాణ్యత ఖాయం.

సీరియల్

# కాంచన సౌధం

రాసినావారు సువర్ణకన్నన్

(గత సంచిక తరువాయి)

"చెప్పు!" అసహనంగా అన్నాడతను.

"నాకు ప్రస్తుతం ఇన్‌కం ఏమీ లేదు. డబ్బుకి చాలా ఇబ్బంది పడుతున్నాను!"

"ఏం? దాసు ఇవ్వడం లేదా? పెళ్ళికూడా చేసుకోబోతున్నాడన్నావ్?" వ్యంగ్యంగా అన్నాడు విశ్వం.

"అతనికుంటే కదా నాకివ్వడానికి!" వెకిలిగా నవ్వింది రమ.

"ఊఁ! చెప్పు! ..."

"అందుకే... మీరు నాక్కాస్త డబ్బివ్వాలి!" తాపీగా అంది.

"ఏమిటి?" ఉలిక్కిపడ్డాడు విశ్వం.

"అవును! నాకు పదివేలు కావాలి!... అది మీరివ్వాలి ..."

"నీకు మతిపోయిందా?" కోపంగా అన్నాడతను.

"ఏం? ... మీకలా కనిపిస్తున్నానా?"

"లేకపోతే ఏమిటి? ... నీకు ఉద్యోగమే ఇవ్వడం ఇష్టంలేని నేను ... ఇప్పుడు నువ్వడిగితే పదివేల రూపాయలు తెచ్చి నీ దోసిట్లో పోస్తాననే అనుకున్నావా? అసలు ఎలా అడగగలిగావ్?"

"ఇస్తారని తెలుసు కాబట్టి!" ఒత్తి అంది రమ.

"ఇస్తానని తెలుసా?" మరింత తెల్లబోయాడు విశ్వం.

"అవును! కచ్చితంగా ఇస్తారు!"

కళ్ళు చిట్లించాడు విశ్వం.

"వేళాకోళానికిది సమయంకాదు!. అదీగాక మనిద్దరి మధ్యా ... వేళాకోళాలాడుకొనేంత చనువులేదు! ... దయచేసి వెళ్ళిపో!..." కఠినంగా అన్నాడు.

"అలాగే. వెళ్తాను! ... రేపు సాయంత్రం ఆరు గంటలకి డబ్బు సిద్ధం చేసి వుంచండి! ... వచ్చి తీసికెళ్తాను!"

"నీకు నిజంగానే మతిపోయింది!" చటుక్కున లేస్తూ అన్నాడు విశ్వం.

"లేదు! ... నా మతి బ్రహ్మాండంగా ఉంది.... కానీ .. మీ మతే - పోతుందేమో... అని నాకు అనుమానంగా ఉంది." తనూ లేస్తూ అంది రమ.

"షటప్. అండ్ గెటవుట్!" అరిచాడతను.

"ష్! అరవకండి! బావుండదు. అసలే అర్ధరాత్రి! ... ఒంటరిగా ఉన్నాం! ... నా చరిత్ర మీకు తెలుసుగా? ..." వెకిలిగా నవ్వింది.

నిస్సహాయంగా చూశాడతను.

"మరి ... వెళ్ళనా? డబ్బు సిద్ధం చేస్తారుగా?"

"నీకు డబ్బివ్వాల్సిన అవసరం నాకులేదు.!"

"ఇదిగో డాక్టరు బాబూ! మీ ఎదుటకే రావడానికి భయపడే నేను! అర్ధరాత్రి! ఒంటరిగా వచ్చి ... డబ్బుకోసం ఇంత డిమేండ్ చేస్తున్నానంటే ... ఏదో తగినంత కారణం వుంటుందని ఊహించలేరూ?"

"ఏవిఁటా కారణం?"

"అలా అడగండి చెప్తాను! మొన్న ఆ మధ్య ఓ రాత్రి ... ఇక్కడ ఓ సుందర దృశ్యం చూశాను!"

"ఏమిటి?"

"మరేంలేదు ... మీ వరండాలోనూ, మీ గదిలోనూ నెత్తురు మడుగులు, వాటిని తుడిచి మీరు కంగారుగా తగలెట్టటం, ఆపై చీపురు తీసుకుని కడగడం! ఓహ్! ... నా దగ్గర కెమేరా లేదుగానీ ... వుంటే చక్కని ఫోటో తీసేదాన్ని!"

బిగుసుకుపోయాడు విశ్వం.

ఒళ్ళంతా చమటలు పట్టింది.

"ఏవిఁటికంగారుగా ఉందా? ముందు కూర్చోండి! ఫెయింట్ అయిపోయి పడిపోతారేమో!" ఓరగా చూస్తూ అంది రమ.

విశ్వం తేరుకుని -

"షటప్!" అరిచాడు.

"అలాగే!. ఇంక మాట్లాడను! ... మరి నేనొస్తాను ... డబ్బు సంగతి మర్చిపోకండి! ... అది తీసుకుని నేనూ, దాసూ ఎక్కడికైనా వెళ్ళిపోయి అక్కడే పెళ్ళి చేసుకుంటాం!" నాలుగడుగులు వేసింది రమ.

"ఆగు!" వెనకనించి అరిచినట్టే అన్నాడు విశ్వం.

ఆమె ఆగి వెనుతిరిగింది.

"నేనెందుకివ్వాలి డబ్బు?"

"మీ రహస్యం నాకు తెలుసు కాబట్టి! పోలీసులకు తెలిస్తే కటకటాల వెనక కూర్చోవాలి కాబట్టి!" విలాసంగా అంది రమ.

"బ్లాక్‌మెయిల్ చేస్తున్నావన్న మాట!"

"దానికి మీరే పేరు పెట్టుకున్నా నాకభ్యంతరంలేదు! నాక్కావల్సింది మాత్రం పదివేల రూపాయలు మాత్రమే! ..."

"ఇవ్వకపోతే?" పళ్ళు బిగువున అన్నాడు విశ్వం.

"చెప్పానుగా. మీరు చేసిన నేరం ప్రభుత్వానికి తెలుస్తుంది. ప్రతి న్యూస్ పేపర్లోనూ మీ ఫోటో తో సహా వుంటుంది.

ఓ మంచి డాక్టరుగా కాదు! ఓ ..."

"ఆపు!" గభాల్న ఆమె నోరు నొక్కేశాడు విశ్వం.

జరిగిన కథ–11: విశ్వం దగ్గర కల్పన ఫోటో, కల్పన దగ్గర విశ్వం ఫోటో ఉండటంతో మమత వాళ్ళని ఆ విషయం నిలదీసి అడుగుతుంది. చౌదరి విశ్వాన్ని శత్రువులా చూస్తున్నాడు. విశ్వం రాయుడి గారింట్లో భోజనం చేస్తున్నాడు. ఎలక్షన్‌లలో రాయుడు నెగ్గాడు. చౌదరి ఓడాడు. మమతకు విశ్వం మీద పగ రెట్టింపయింది. మమతకి టైఫాయిడ్ వస్తే పట్నంలో నర్సింగ్ హోమ్‌లో చేరుస్తాడు చౌదరి. విశ్వం జరిగిన విషయాలన్నీ మనసు విప్పి మాట్లాడాలని మమత దగ్గరకి వెళితే మమత అతనితో మాట్లాడను నిరాకరించింది. కల్పన మంగిని తీసుకుని మమతను చూడటానికి వెళ్ళింది. కల్పనతో మనసువిప్పి మాట్లాడను మమత అంగీకరించింది. కల్పన చెప్పసాగింది. కల్పన కథ విన్న మమత వెంటనే విశ్వాన్ని క్షమాపణ వేడుకోవాలనుకుంటుంది. కల్పన చేత, తండ్రి చేత కబురు పంపినా విశ్వం రాకపోవడంతో అతనికి తనపై చాల కోపం వచ్చిందని ఏడ్చింది మమత . విశ్వం ప్రవర్తన వింతగా తోస్తుంది కల్పన, మమతలకి, ఏదో ముఖ్యమైన విషయం చెప్పాలని విశ్వం దగ్గరకి వస్తుంది నర్సు రమ.

"అయితే ఇస్తారుగా?"

క్షణం మౌనంగా ఉండిపోయాడతను.

విజయగర్వంగా చూసిందామె.

విశ్వంలో మొండి ధైర్యం చోటు చేసుకుంది. ఆవేశం అంచులు దాటింది.

"ఇవ్వను! చాతనైంది చేసుకో!" కర్కశంగా అన్నాడు.

రమ కళ్ళు చిట్లించి చూసింది.

"సరే! కోరి కష్టాలు తెచ్చుకొంటానంటే ఎవరు మాత్రం ఏం చెయ్యగలరు? కాని ... ఒక్కటి బాగా ఆలోచించుకోండి? ఈ వూరికే కాక ఈ చుట్టుపట్ల అందరికీ మీరు దేవుడితో సమానం! ... అలాంటిది ఒక్కసారిగా దానవుడైపోతానంటే ... నాకేం అభ్యంతరం లేదు!" వంకరగా అంది రమ.

"నా ప్రజల సంగతి నాకు బాగా తెలుసు! ఇలాంటి కాకమ్మ కబుర్లు వాళ్ళు వచ్చినా నమ్మరు!"

"నిజంగా మీరు చాలా అమాయకులు డాక్టరు బాబూ!" నవ్వింది రమ.

"గెటవుట్!"

"అలాగే! ... రాబోయే పరిణామాలని ఎదుర్కొనేందుకు సిద్ధంగా ఉండండి" విసురుగా బైటికి నడిచింది రమ.

విశ్వం కళ్ళు కోపంతో ఎర్రబడ్డాయి.

"ఆగు! ...." ఆవేశంగా అరిచాడు.

నిర్లక్ష్యంగా చూసిందామె.

అతని కళ్ళు అగ్నిగోళాల్లా అనిపించాయామెకి. ఆ రూపాన్ని చూసి కాస్త జంకినా అతని స్వభావం గుర్తొచ్చి బింకంగానే నిల్చుంది.

"నీకు నాలుక్కాలాలపాటు బతకాలనుందా?" తాపీగా అన్నాడతను.

లేడి కూనని చంపడానికి సిద్ధంగావున్న సింహంలా వున్నాడతను.

"ఏం? చంపుతారా?" జారిపోతున్న ధైర్యాన్ని కూడదీసుకుంటూ అంది రమ.

"అవసరం అనుకుంటే అంత పని చేస్తాను. అందుకే నువ్వు చూసింది, ఇప్పుడొచ్చింది పూర్తిగా మర్చిపో! డబ్బు సంగతి కల్లో కూడా ఎత్తకు!" తాపీగా అన్నాడు విశ్వం.

"అసంభవం!"

"ఏవిటి?"

"డబ్బు ఇవ్వకపోతే ... నేను మీ రహస్యాన్ని దాచడం!" గంభీరంగా అంది రమ.

"ఓ! ... అలాగా? - అయితే నా మాట జాగ్రత్తగా విను. నా సంగతి నీకు పూర్తిగా తెలియదు! అవసరం అయితే పచ్చి నెత్తురు తాగడానిక్కూడా వెనకాడను! అలాంటిది ... నీ బెదిరింపులకి లొంగుతానా?

ఇన్నాళ్ళూ నాలోని మంచినే చూశావ్! రహస్యం నీ పెదవి దాటి బైటికొచ్చిందా ... నిన్ను చంపి అప్పుడు జైలుకెళ్తాను!" పిడికిళ్ళు బిగించి అన్నాడు విశ్వం.

ఎంత అరుస్తున్నా విశ్వంలో విలన్ ఛాయలు కనిపించలేదేమో! పెద్దగా నవ్వి -

"నువ్వు! నన్ను చంపుతావా?" అంది రమ.

"అవును? ... చంపుతాను. తెగిస్తే నా అంత దుర్మార్గుడు లేడు!" ఆవేశంగా అన్నాడు విశ్వం.

"తెగించాలిగా!" మళ్ళీ నవ్వింది రమ.

"నువ్వీ విషయాల్ని పెదవి దాట రాని! అప్పుడు చూద్దువుగాని. తెగిస్తానో లేదో!"

అలా ఇద్దరి మధ్యా కొంతసేపు ఘర్షణ జరిగింది. చివరికి -

"రేపు సాయంత్రంలోగా డబ్బు నాకు చేరాలి! లేకపోతే ... నేను సరాసరి పోలిస్ స్టేషనుకెడతాను" అంటూ బైటికి నడిచింది రమ.

ప్రతిమలా బిగుసుకుపోయిన విశ్వాన్ని వదిలేసి వీధిలోకొచ్చింది.

ఓసారి పరిసరాల్ని పరికించి చూసింది. పెద్దగా మార్పేంలేదు. ఇందాకట్లాగే



నిశ్శబ్దంగా, నిర్మానుష్యంగా ఉంది.

"అమ్మయ్య! ... సాధించినట్టే! ... రేపు చచ్చినట్టు ఇస్తాడు డబ్బు! ... ఆ డబ్బు తీసుకొని ... తనూ, దాసూ ఎక్కడికైనా వెళ్ళిపోయి హాయిగాపెళ్ళి చేసుకుని జాలీగా బ్రతుకుతారు!"

ఊహా సౌధాలు కట్టుకుంటూ ఇల్లు చేరింది రమ. దాసు ఇంటికేసి చూశాయామె కళ్ళు. ఆ ఇల్లు కూడా మంచి నిద్రలో వున్నట్టు నిశ్శబ్దంగా ఉంది.

తననెవరూ గమనించలేదనుకున్న రమ ఉత్సాహంగా తలుపు తీసుకుని లోపలికి నడిచింది.

అయితే తను బయల్దేరినప్పట్నుంచీ ఇద్దరు వ్యక్తులు ఒకరికి తెలియకుండా ఒకరు తనని వెంబడించి, డాక్టరుకి, తనకి మధ్య జరిగిన సంభాషణ మొత్తం పొంచి విన్నారని మాత్రం ఆమెకి తెలియదు!

ఆమెకే కాదు!. ఎవరికీ తెలియదు!

★ ★ ★ ★ ★

ఉదయం అయిదు గంటలు కావస్తోంది.

వీరడు సాధారణంగా నాలుగ్గంటలకే లేచి ... యజమాని దగ్గరకెళ్ళిపోతాడు. అతనెళ్ళగానే కాఫీ అదీ కాచి ... ఫ్లాస్కులో పోసి డాక్టర్‌కి ఇచ్చొస్తుంది మంగి.

అయితే ఆ రోజు వీరడు అయిదు కావస్తున్నా వెళ్ళడంలేదు. కాస్త కంగారుపడింది మంగి.

"ఏటి మావాఁ!. ఒల్లు గాని ... బాలేదా?" అంది దగ్గరగా వచ్చి.

"ఏం? .ఎందుకడిగావ్ అట్టా!"

"శానా టైమైంది!"... నసిగింది మంగి.

"ఓస్! అంతే గదా!. ఇయ్యేవన్నా సర్కారుద్యోగాలేటి! ... కూస్తటు, ఇటు ఎల్లచ్చు! ..." తేలిగ్గాఅన్నాడు వీరడు.

మంగి మాట్లాడలేదు. దిక్కులు చూస్తూ కూర్చుంది. "వెలుతురొస్తే మళ్ళీ బాబుగోరిక్కాఫీ తీసికెల్టానికుదర్దు! ఎలా?" అన్న ఆలోచనలో పడింది.

"ఏటే ... నేనింట్లో వుంటం నీగ్గాని కష్టంగా వుందేమిటి?" వీరడు అదోలా అన్నాడు.

"ఛీ! అయ్యేం మాటలు మావాఁ! ఊర్కే అడిగానంతే!" కంగారుగా అనేసింది మంగి."

"సర్లే! ... నేనొత్తా!" అంటూ కండువా నిండా కప్పుకుంటూ బైటికి నడిచాడు.

వాడంత దూరం వెళ్ళే దాకా చూసి గబగబా పొయ్యి వెలిగించి పాలు కాచి కాఫీ కలిపింది. బియ్యం డబ్బా వెనక దాచిన ఫ్లాస్క్ తీసి దాన్నిండా పోసింది. నిండా కొంగు కప్పుకుని బైటికి రాబోయింది.

అంతే! ... కొయ్యబారిపోయింది.

ఎదురుగా వీరడు!

"ఏ ... ఏటి మావాఁ?" ఒణికిపోతూ అంది మంగి-

"ఏన్లేదుగానీ. అదేటి?" గంభీరంగా అన్నాడు.

"కా ... కాఫీ."

"ఎవురికి?"

"నాకే ... తాగాలనిపించి ..."

"అలాగా. నాక్కూడా కూస్త పోస్తే తాగిపొయ్యేవాణ్ణి గందా!"

ఇబ్బందిగా చూసింది మంగి.

ఆమెకి భయంతో ఒళ్ళంతా చమటలు పడుతోంది.

"అది సరే! ఆ ఫ్లాస్కేటి?"

"అది ... అదీ ... మంగికి దుఃఖం వచ్చేస్తోంది.

"మంగి!" మెల్లగా అన్నాడు వీరడు.

"ఏటి మావాఁ?" ...

"ఎందుకే ఇన్ని అబద్ధాలు?"

"అబ్బే అదికాదు మావాఁ ...."

"సర్లేగానీ. ముందా కాపీ డాట్రు బాబుకిచ్చి రా!"

"మావాఁ!" బిగుసుకు పోయింది మంగి.

"ఇచ్చిరా మంగి! ... నేనేం అనుకోను! ... నేను పూర్వపు ఈరణ్ణి కాదని నీకూ తెలుసుగా ... ఎందుకు నా దగ్గర దాయటం?" అన్నాడు వీరడు శాంతంగా.

అతనెంత మామూలుగా అనాలని ప్రయత్నించినా ... తన దగ్గర దాచినందుకు ... అతని గొంతులో బాధ కూడా ధ్వనించింది.

"మావాఁ! ..." అంటూ అతని కాళ్ళమీద పడిపోయింది మంగి.

వీరడు ఆమెను లేవదీసి కళ్ళు తుడిచాడు.

"నన్ను సెమించు మావాఁ" అంది మంగి.

"సెమించడానికే వుంది గానీ ... డాట్రు బాబుకి నువ్వు కేరేజీ పంపడం కూడా నేను సూశాను ... కానీ ... నా దగ్గర కూడా ఎందుకు దాచావో మాత్రం అర్థంకాలేదు!" అన్నాడతను.

మంగి విషయం చెప్పింది.

వీరడు ఆలోచనలో పడ్డాడు.

"ఏటంటావ్?" అన్నాడు మెల్లగా.

"నాకూ అయోమయంగా వుంది మావాఁ! అసలీ మధ్య డాక్టరు బాబుగారేంటో ఇచిత్రంగా మాట్లాడుతన్నారు ... ఏదో కంగారడతన్నారు! ..." అంటూ అతని ప్రవర్తన వివరంగా చెప్పింది మంగి.

"అక్కడెవరన్నా కనిపించారా?"

"ఊఁహూఁ!"






# తాజాదనం రోజంతా నిలిచేలా ఉంచండి.

కొత్తది







అసలైన తాజాదనం ! అదే రోజంతా నిలిచి వుండే తాజాదనం !
మీకు సాధారణ సబ్బులు ఇచ్చేలాంటి కొద్ది సేపట్లో మాయమైపోయే తాజాదనం కాదు. శరీర దుర్గంధం పోగొట్టి మిమ్మల్ని రోజంతా హాయిగా వుంచగల తాజాదనం— అదే కొత్త సింథాల్ మాత్రమే ఇవ్వగల వాగ్దానం.

**సింథాల్‌లో ఇప్పుడు మనమోహక కొత్త పరిమళం కలదు. దుర్గంధాన్ని పోగొట్టడానికి సింథాల్‌లో గల ప్రభావవంతమైన శక్తి చర్మ క్రిములను నాశనం చేసి, మిమ్ములను రోజంతా తాజాగా దుర్గంధ రహితంగా వుంచుతుంది.**

CHAITRA-B-G-330 TEL

## కేవలం సింథాల్

మాత్రమే మిమ్మల్ని దినమంతా తాజాగా దుర్గంధరహితంగా ఉంచగలదు.

Godrej ఉత్పాదన

# కాంచనసౌధం

"ఏటో ఆరిబాధ!" ఆలోచిస్తూ అన్నాడు వీరడు.

"ఆర్ని సూత్తుంటే నాకూ దిగులుగానే ఉంది. ఇయ్యాలా రేపూ సూసి నీతో సెప్దామనుకుంటున్నాను"

"సూద్దాం!"

"మాఁవాఁ!"

"ఏటే ?..."

"నా మీదొట్టుసరి!... ఈ ఇసయం ఎవరికీ సెప్పద్దు!" బ్రతిమాలింది మంగి.

పెద్దగా నవ్వాడు వీరడు.

"ఏందీ నవ్వుతావ్?"

"ఎవరికి సెప్పనంటానే శానామందికి సెప్తావ్ నువ్వు!– ఇప్పుడు నన్నెవురికీ సెప్పద్దంటన్నావ్!" మళ్ళీ నవ్వాడతను.

"నేనెవరికి సెప్పేనేటి? నీకూ, ఆ అమ్మాయిగోర్లకేగందా!" చిన్నబుచ్చుకుంటూ అంది మంగి.

"సర్లే! ఇంతకీ ఇదంతా ఏటంటా?"

"అదే రేపు డాక్టరుబాబుగార్నే అడుగుదాం. ఏమైనా ఆరు మనకి దేవుళ్లాటోరు. ఆయన రగశ్యాన్ని దాయడం మనధర్మం!... సరే! వుండు!... ఇదిచ్చొత్తాను! మళ్ళీ తెల్లారిపోతాంది!" అంటూ ఫ్లాస్క్ తీసుకుని తలనిండా కొంగుకప్పుకుని వీధిలోకి నడిచింది మంగి.

వీరడు అలాగే మంచంమీద వాలి ఆలోచనలో పడ్డాడు. అతను కూడా విన్నాడు డాక్టర్ వింత ప్రవర్తన.

"ఏమై వుంటుంది?... ఈ భోజనం ఎవరికి?... అంత దాచాల్సిన అగత్యం ఏం వచ్చింది?" ఇలా వున్నాయతని ఆలోచనలు.

అతనలా వుండగానే ఉరుకులు పరుగులతో వచ్చి పడింది మంగి. ఆమె చేతిలోని ఫ్లాస్క్ అలాగే ఉంది. ఒళ్ళంతా చెమటలు పట్టింది.

గభాల్నలేచి పాలిపోయినట్టున్న మంగిని కుదుపుతూ–

"ఏంటే? ఏం జరిగింది?" ఆదుర్దాగా అన్నాడు వీరడు.

"అక్కడ... అక్కడ...." ఆమెకి మాట రావటంలేదు. ఒణికిపోతోంది.

"ఏటే... ఏ వుందక్కడ?" కంగారుగా అడిగాడు వీరడు.

"మాఁవా!... అక్కడ..." అంటూ ఒణికిపోతూ చెప్పింది మంగి.

అతనుకూడా కొయ్యబారిపోయాడు. గబాల్న అటు పరిగెత్తాడు మంగి వారిస్తున్నా వినకుండా. మంగికూడా అతని వెంట పరిగెత్తింది.

ఊరు మేలుకుంటోంది.

ఒక్క పరుగున ఇద్దరూ హాస్పటల్‌దగ్గరకొచ్చారు. అక్కడ వరండాలో కనిపించిన దృశ్యంచూసి టక్కున ఆగిపోయాడు వీరడు.

మంగి చేతుల్లో ముఖం దాచుకుంది.

వరండాలో ఆయా శవం వెల్లకిలా పడుంది.! బట్టలు అస్తవ్యస్తంగా వున్నాయి.

కళ్ళు తెరచివుండి మొహం వికృతంగా ఉంది!

* * * * * *

ఆయాని డాక్టర్ దారుణంగా హత్యచేశాడన్న వార్త నిమిషాలమీద పాకిపోయిందా ప్రాంతమంతా.

క్షణాలమీద పోలీసులొచ్చారు.

ఫోటోలు !

పరిశోధనలు!












"డాక్టర్‌బాబు హత్య చెయ్యడమేమిటి ?"

కొందరు నమ్మలేదు.

మరి కొందరు–

"ఓహో!... ఇటీవల డాక్టర్ ప్రవర్తనకిదన్నమాట కారణం!" అనుకుని కథలల్లుతున్నారు.

చౌదరికేం తోచలేదు.

కల్పన, మమతా సరేసరి!... ఏడ్చినంత పనిచేశారు. రాయుడుకూడా ఆశ్చర్యపోయాడు.

అన్నింటికన్నా ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే... ఇంతమంది ఇన్నిరకాలుగా అనుకుంటున్నా విశ్వం మాత్రం తనకేం పట్టనట్టు మౌనంగా ఉండిపోవడం?

దాసు శవానిక్కాస్త దూరంగా కూర్చుని ఏడుస్తున్నాడు. అతనికళ్లు మంకెన్న పూల్లా ఉన్నాయి.

పోలీసులు అందర్నీ ప్రశ్నలతో తికమకపెట్టి హడలగొట్టేస్తున్నారు.

డాక్టర్‌తో పాటు మంగిని, వీరణ్ని, కల్పనని, మరి కొంతమందిని ఏవో ప్రశ్నలు అడిగారు.

ఊరి పెద్దలంతా అక్కడే వున్నారు.

శవం దగ్గరగా కూలబడి కుళ్లికుళ్లి ఏడుస్తున్న దాసు ఎక్కువగా ఆకర్షించాడు పోలీసువార్ని.

"మీ పేరేమిటి?" అన్నాడు ఓ ఎస్సై.

"దాసు!" తల ఎత్తకుండానే అన్నాడతను.

"ఈవిడ మీకేమౌతుంది?"

"నా సర్వస్వం!" కళ్లు తుడుచుకుంటూ అన్నాడు దాసు.

అర్థం కానట్టు ముఖం చిట్లించాడు ఎస్సై.

"రమ, నేనూ పెళ్లి చేసుకోవాలనుకున్నాం?– మా ఇద్దరి మనసుల్లోనూ ఈ ఆలోచన వున్నా ధైర్యం చెయ్యలేకపోయాం!"

"ఏం? మీ పెద్దలు అంగీకరించలేదా?"

"ఊహూ! అదికాదు!..." "మరి?"

"రమ విధవ!... బ్రతుకుతెరువుకోసం ఎక్కణ్ణించో ఇంతదూరం వచ్చింది. మా ఇద్దరి మనసులూ కలిశాయి.... కానీ...."

"ఊ! కానీ?"

"మా ఇద్దర్నీ అవమానించి డాక్టర్‌గారు పన్లోంచి తీసేశారు..." అంటూ తాము డాక్టర్ దగ్గర పని చెయ్యడం... అయన కక్షగట్టి తీసెయ్యడం అన్నీ కాస్త మసాలాలు కలిపి మరీ చెప్పాడు దాసు.

ఎస్సై ఆలోచనలో పడ్డాడు.

"ప్రస్తుతం మీ ఇద్దరికీ... శారీరకంగా...."

"ఉంది!" అన్నట్టు తలూపాడు దాసు.

ఎస్సై పెద్దలకేసి చూశాడు.

వాళ్లుకూడా–

"నిజమే!" అన్నట్టు తలలూపారు.

"సరే.... రాత్రి మీరెక్కడున్నారు?" ఎస్సై అడిగాడు

"నిన్న సాయంత్రం పట్నం వెళ్లాను!... ఇంత ఘోరం జరుగుతుందని ఏమాత్రం అనుమానం వచ్చినా వెళ్లేవాణ్ణికాదు!" బాధగా అన్నాడు దాసు.

"పట్నం ఎందుకెళ్లారు?"

"మేం ఏ చిన్న వస్తువు కొనాలన్నా పట్నంవెళ్లి తెచ్చుకోవాల్సిందే!"

"బావుంది... రాత్రి మీరు ఎక్కడ పడుకున్నారు?"

'మా ఫ్రెండ్ ఇంట్లో!"

"అతని పేరు?"

చెప్పాడు దాసు.

రెండు నిమిషాల తర్వాత–

"మీ కెవరిమీదైనా అనుమానం వుందా?" అన్నాడు ఎస్సై ఏదో ఆలోచిస్తూ.

దాసు మాట్లాడలేదు.

"చెప్పండి! ఫరవాలేదు!"

"నేను మీతో పర్సనల్‌గా మాట్లాడాలి!" మెల్లగా అన్నాడు దాసు.

"సరే!" అంటూ డాక్టర్ పర్మిషన్ తీసుకుని హాస్పటల్లోనే ఓ గదిలోకి నడిచాడు ఎస్సై. దాసు అతన్ననుసరించాడు.

"చెప్పండి! ఎవరి మీద మీ అనుమానం?" కుతూహలంగా అడిగాడు.

"నాకు డాక్టర్ విశ్వంమీదే అనుమానం!"

"ఎందుకలా అనుకుంటున్నారు?"

"ఆయనకి చాలాకాలంనించి ఆమె మీద మనసుంది. ఓ రోజు డబ్బుఆశ చూపించి అడిగాడుకూడా. అయితే ఆమె లొంగలేదు సరికదా నానా చివాట్లు పెట్టింది. అసలందుకే ఆమెనీ, ఆమెకి కావల్సినవాణ్ని కాబట్టి నన్ను ఉద్యోగంలోంచి తీసేశారు. ఇంకా కోపం తీరక ఈ రోజు ఇంత ఘాతుకానికి తలపడ్డారు కోపంగా అన్నాడు దాసు.

"కానీ డాక్టర్‌గార్ని గురించి మంచిగా విన్నామే....!" అతని మొహంలోకి పరిశీలనగా చూస్తూ అన్నాడు ఎస్సై.

"నిజమే! ఆ ఒక్క వీక్‌నెస్ తప్ప అయనలో ఇంకే దుర్గుణాలూ లేవు!"

"అంటే... స్త్రీ వ్యసనం బాగా వుందంటారా?"

"అవును!... దానికి చాలా ఆధారాలున్నాయి. ఈ వూళ్లో చాలామంది యువతులతో అతనికి సంబంధం వుంది!... అందులో ముఖ్యురాలు డాక్టర్ కల్పన!" రహస్యంగా అన్నాడు దాసు.

తృళ్లిపడ్డాడు ఎస్సై.

"అవును ఎస్సైగారూ! మీరేకాదు... డాక్టర్ని చూసిన ఎవరూ అతనలాంటి వాడంటే ఓ పట్టాన నమ్మరు! కానీ ఇది నూటికి నూరుపాళ్లు నిజం!" అదోలా నవ్వుతూ అన్నాడు దాసు.

"సరే! మీరెళ్లండి" అంటూ బైటికొచ్చేశాడు ఎస్సై. మరి కొందర్ని కొన్ని ప్రశ్నలు వేశాడు. అయితే కేసు విషయం మాత్రం తేలలేదు.

కొందరిని తమకి తెలియకుండా వూరుదాటి వెళ్లద్దని పంపేశాడు.

(ఇంకా ఉంది)



శిథిలావస్థలో నున్న ఆలయం

# అర్ధవీడులో శిథిలం కానున్న చెన్నకేశవ ఆలయం

ప్రపంచంలోని ప్రఖ్యాతమైన అడవులలో నల్లమల ఒకటి. సతత హరిత వృక్షజాలం, సెలఏళ్ళు, వివిధ జంతుజాలంతో ఇక్కడి ప్రకృతి ఎంతో ప్రశాంతంగ, రమణీయంగ ఉంటుంది. శాస్త్రజ్ఞుల పరిశోధనకు అనేక మూలికలు యిక్కడ లభిస్తున్నాయి.

ఈ ప్రాంతాన్ని ఎన్నో రాజవంశాలు పరిపాలించాయి. కాని శ్రీకృష్ణదేవరాయల పాలనలో దేశం సుభిక్షంగ వర్ధిల్లుటయే కాక, సర్వకళలు సర్వతోముఖంగ విలసిల్లాయి. కనుక దీనిని రాయలసీమాంతర్భాగంగ ప్రజలు భావిస్తారు. ఆ కాలంలో ఎన్నో దేవాలయాలు ఎంతో ధార్మికంగ, కళాన్వితంగ నిర్మించబడ్డాయి.

రాయలసీమలో శిల్పకళా వైభవంతో అలరారే దేవాలయాలు చాల ఉన్నాయి. ఇక్కడ ప్రతి రాతికి, ప్రతి చెట్టుకు, ప్రతి గుట్టకు ఒక చరిత్ర ఉందనిపిస్తుంది. అయితే చాల ఆలయాలు బీటలువారి, శిథిలం కావటానికి సిద్ధంగ ఉన్నాయి. అలాంటి వానిలో అర్ధవీడులోని చెన్నకేశవ ఆలయం ఒకటి.

చుట్టూ కొండలు, అడవుల మధ్య గ్రామానికి ఉత్తరంగ 2 కి. మీ. దూరంలో గల ఈ ఆలయం చాల దయనీయ స్థితిలో ఉంది. లోపలకు వెళ్ళటానికి గాని, చుట్టూ తిరిగి పరిశీలించటానికి గాని ఏమాత్రం మార్గం లేదు. ప్రాంగణమంతా అనేకములైన ముళ్ళ చెట్లతో నిండి, ఎక్కడ ఏ పాము కాటు వేస్తుందో అన్నంత భయంకరంగ తయారయింది.

కాని కొంచెం ధైర్యం చేసి ముందుకు సాగితే, అపురూప శిల్పాలెన్నో దర్శనమౌతాయి. దక్షిణ వైపున గల శివాలయ కుడ్యాలపై ఎద్దు – ఏనుగుల మిశ్రమ శిల్పం, విల్లుపట్టిన పడతి, గణపతి, ప్రమథగణాలు, శివపార్వతులు దర్శనమిస్తారు. ఉత్తర దిశలో గల చెన్నకేశవ ఆలయకుడ్యాలపై మయూర శిల్పం, వేణుగోపాలుడు, గజేంద్రమోక్షం దర్శించవచ్చును. రెండు ఆలయాలకు మధ్య వీరభద్రుడు క్షేత్రపాలకుడుగ ఉన్నాడు.

చెన్నకేశవ ఆలయ రంగమండపంలో ఆలయ స్తంభాలపై రామాయణ, భాగవత, శివపురాణములలోని ప్రధాన సన్నివేశాలు శిల్పాలుగా మల్చబడ్డాయి. గోపాంగనలు శ్రీకృష్ణుని సేవించుట, శివధనుర్భంగము, శ్రీ సీతారామ కల్యాణం, సీతారామలక్ష్మణులు వనవాస సమయమున గంగను దాటుట, శ్రీరామ పట్టాభిషేకం, గోపికలు మజ్జిగ చిలుకుతుండగ శ్రీకృష్ణుడు వెన్న తినుట, గోవర్ధనగిరినెత్తుట, తల్లి యశోద బాలకృష్ణుని రోటికి కట్టి వేయుట, శ్రీకృష్ణుడు మద్ది చెట్లను (నలకూబర, మణిగ్రీవుల శాపవిమోచనం) పడవేయుట, గోపికా వస్త్రాపహరణం, కువలయాపీడవధ, భక్త కన్నప్ప మొదలయిన శిల్పాలెన్నో జీవకళ ఉట్టిపడేట్లు నిర్మించబడ్డాయి.

## నిర్మాణ వివరాలు

చెన్నకేశవ స్వామి ఆలయంలో చోళుల,

శివ ధనుర్భంగము



సీతా రామ లక్ష్మణులను గుహుడు గంగను దాటించుట





బాలకృష్ణుడు వెన్న తినుట



శ్రీకృష్ణుడు గోవర్ధనగిరి నెత్తుట

విజయనగర రాజులు వాస్తు, శిల్పం కానవస్తుంది. కాని నిర్మాణ వివరాలు పూర్తిగ బయల్పడలేదనే చెప్పాలి. ఇక్కడి ప్రజలు చెప్పుకునే వివరాల ఆధారంగ, నిర్మాణాన్ని గూర్చి (ఈ వ్యాసకర్త) కొంత ఊహించటం జరిగింది.

శ్రీకృష్ణదేవరాయలు తన దిగ్విజయ యాత్రలో కటక్‌ను ముట్టడించగ, భయకంపితుడైన ప్రతాపరుద్ర గజపతి సంధి చేసుకొని, తన కుమార్తె వరదరాజమ్మను (అన్నపూర్ణాదేవి) క్రి. శ. 1518 లో రాయలకిచ్చి వైభవోపేతంగ వివాహం జరిపించి, 1000 ఏనుగులు, 1600 గుర్రాలు, ధనకనక వస్తు వాహనాలతో పాటు దాసదాసీ జనం కానుకగ సమర్పించాడు. రాయలు గజపతిని తన సామంతునిగ నియమించి తిరిగి విజయనగరం చేరాడు.

కాని శోభన రాత్రి వేళ గజపతులు కుట్రతో రాయలను అంతమొందించటానికి పూనుకొనగా రాయలు ఆగ్రహించి ప్రళయకాలరుద్రుడైనాడు. ప్రతాపరుద్రగజపతి తప్పించుకొని పారిపోయాడు. శ్రీకృష్ణ దేవరాయలుతో వరదరాజమ్మ తను నిర్దోషినని ఎంత ప్రాధేయపడినా వినకుండ పుట్టింటికి వెళ్ళవలసిందిగ ఆజ్ఞాపించాడు.

వరదరాజమ్మ హంపి నుండి బళ్ళారి, గుంతకల్, నంద్యాల, వేలుగోడుల మీదుగ గుండ్ల బ్రహ్మేశ్వరం చేరి, అక్కడ కొంత కాలం విశ్రాంతి తీసుకొని, పాపినేనిపల్లె మీదుగ అర్ధవీడులోయ చేరి, అటు నుండి మొహిద్దీన్‌పురం దాపులో కల్పేశ్వరుని సేవించి, విరాగినియైన స్థితిలో మహర్షులను సేవించింది. ఆ సమయంలోనే దైవారాధనకుగాను ఈ మందిరాలను నిర్మించి ఉండవచ్చును. ఈ ప్రాంతంలో కరువు కాటకాలను నివారించే నిమిత్తం ఆ సమయంలోనే ఆమె కంభం చెరువు నిర్మించినట్లు చెప్పబడుతుంది.

ఈ ఆలయాలకు ఈశాన్యంగ ప్రసన్నాంజనేయ స్వామి విగ్రహం ఉంది. అక్కడ పీఠానికి గజపతుల రాజచిహ్నమైన 'ధర్మచక్రము', ఇరువైపుల ఏనుగులు మల్చబడి ఉన్నాయి. దీనిని బట్టి కూడ ఈ ఆలయం వరదరాజమ్మ నిర్మించి యుండవచ్చునని పిస్తుంది.

### ఇప్పటి స్థితి.

కొన్ని సంవత్సరాలనాడు నిధుల కోసం దొంగలు మూలవరులను పెకలించారు. ఆ విగ్రహం యిప్పుడు ఎర్రగొండపాలెంలో ఉందని కొందరు అభిప్రాయపడితే, మార్కాపురంలో ఉందని మరికొందరు భావిస్తున్నారు. గర్భగృహానికి ముందుభాగంలో కుడివైపు చెన్నకేశవ విగ్రహము సగము వరకు భూమిలో కూరుకుపోయింది.

ఇక్కడ రెండు పనులు జరగాల్సి ఉన్నాయి. ఒకటి – ఆలయ రూపురేఖలు, ఐతిహాసిక ఆధారాలపై శ్రమించగల పరిశోధకులకు చేతి నిండ పని ఉంది. రెండవది – ఐతిహాసిక, ధార్మిక క్షేత్రాలు మన సంస్కృతికి నిలయాలు. వాటిని కాపాడి, పునరుద్ధరించవలసిన బాధ్యత మనకుంది. ఆలయం శిథిలమయ్యాక, దాని గత వైభవాన్ని, శిథిల శిల్పాలను వేనోళ్ళ కీర్తించే కంటే, ముందుగానే జాగ్రత్త పడి ప్రభుత్వం, ప్రజలు ఆలయాన్ని మరమ్మత్తు చేయిస్తే, మన జాతీయ పెన్నిధిని కాపాడుకున్నవారమౌతాము. తిరుమల-తిరుపతి దేవస్థానం వారు యిలాంటి ధర్మకార్యాలకు సహాయ సహకారాలు అందిస్తారు కూడ!

**ఫోటోలు, వ్యాసం : కెప్టెన్ షేక్‌మౌలాలీ**

ఎద్దు-ఏనుగుల మిశ్రమ శిల్పం
(ఎడమవైపు ఎద్దును, కుడివైపు ఏనుగును చూడవచ్చును)



"బుజ్జి వచ్చిందా!" ఆదుర్దాగా అడిగాను మా ఆవిడను ఆఫీసు నుండి వస్తూనే.

"ఈ రోజు రాలేదండీ" దీనంగా జవాబిచ్చిందావిడ.

ఉసూరంటూ కుర్చీలో కూలబడ్డాను.

ఎటుపోయిందో, ఏమిటో పిచ్చి ముండ! ఎవరైనా ఎత్తుకెళ్ళిపోయారో! ఏమో! తినటానికని. ముదనష్టపు వెధవలు. అయినా యిదే దొరికిందా తినటానికి. ముద్దొస్తూ, మురిపెంగా ఉందే వాటినెలా కోసుకుని తింటారో! దరిద్రం– ఇట్లాంటి పన్లు చేస్తారు కాబట్టే వెధవలకు జన్మంతా బీదరికమే" పిల్లుల్ని ఎత్తుకుపోయి తినేవాళ్ళ గురించి గొణుగుతూనే ఉన్నదామె.



★ ★ ★ ★

అసలు మా యింటికి బుజ్జి ప్రవేశ మెలా జరిగిందంటే –

నేను ఆఫీసు నుండి వస్తున్నానొకరోజు.

బుజ్జి పిల్లి పిల్లను కొందరు కుర్రాళ్ళు ఎటుపోతే అటు తరుముతున్నారు.

అది దిక్కుతోచక పరుగెడుతున్నది అటూ, యిటూ. పెద్ద కుక్క ఒకటి దానిని పీకటానికి ఎగబడి వస్తున్నది.

అదంతా చూస్తున్న నేను గబుక్కున ఆ పిల్లి పిల్లను ఎత్తుకున్నాను. లేకుంటే కుక్కవాత పడిపోయేదే అది.

దాన్ని యింటికి తెచ్చి డాబాపై వదిలి పెట్టాను.

మా ఆవిడ ఏ పనిలో ఉందో చూడలేదు.

నేనిలా యింటి కొచ్చానో లేదో వర్షం పడటం మొదలైంది.

# బుజ్జి

## శ్రీమతి శ్రీరంగరాజు విజయలక్ష్మి

డాబా పైకెళ్లాను. అది వర్షంలో తడిసి పోతుందేమో! తెద్దామని.

అది నాకంటే ముందే ఛెంగు ఛెంగున క్రిందకి దూకి వచ్చి మంచం క్రింద దూరింది.

మా ఆవిడ చూడనే చూసింది.

"పిల్లులంటే నాకు ఎలర్జీ. ముందు దాన్ని బయటపడేయక పోతే నేనూరుకోనని" చిందులు త్రొక్కిందావిడ.

మంచం క్రిందకు చీపురు కట్ట చూపించి, బెదిరించి తోలింది. వర్షంలో తడిసిపోతూ.... అరుస్తోందది పాపం!

"అదేమంటుందని. బెదురుగొడ్డులా అట్లా చేస్తావ్ దాన్ని" అంటూ కోప్పడ్డాను.

ఆవిడ కసరటం, అయినా అది యింట్లోకి వస్తూ ఉండటం కొన్ని రోజులు నడిచిందా తతంగం.

కాల క్రమేణా మా ఆవిడకు కూడా మచ్చికై పోయిందది.

"బుజ్జీ.... బుల్లీ" అంటూ ముద్దుగా పిలుస్తుండేది దాన్ని ఆవిడ.

అది ఎంత దూరంలో ఉన్నా ఆమె "బుజ్జీ" అని పిలవగానే "మ్యావ్.... మియావ్" అంటూ గెంతుతూ వచ్చి, ఆవిడ కాళ్లకు చుట్టుకుని తిరుగుతుండేది.

ఎలుకల కోసం బయట కెళ్ళే ఏ కుక్కలైనా పీకుతా యేమోనని మాంసం కొనుక్కొచ్చి పెడుతుండేవాడిని. ఉదయం మాంసం, సాయంత్రం వేయించిన చేపల ముక్కలు తెచ్చేవాడిని. "బ్రాహ్మణులం- యిదేం ఖర్మండీ!" అని ముందు విసుక్కున్నా ఆ తర్వాత వేయించిన చేప ముక్కల్లోని ముళ్లన్నీ తీసి, శుభ్రంగా పొడి పొడిగా చేసి, నలిపి పెట్టేది దానికి మా ఆవిడ.

అదీ ముద్దుగా చిన్న పిల్లల్లా మారాం చేసేది.

కుర్చీలలో, మంచం మీదా, దానిష్ట మొచ్చిన చోట హాయిగా పడుకునేది.

దోమతెర కడితే, అందులో దూరి తనొక్కతే పొడవుగా, మంచం మధ్యలో పడుకునేది.

దాన్ని లేపటం యిష్టంలేక చలిగా ఉన్నాసరే మేమిద్దరం దోమలు కుడుతున్నా భరించి, కింద పడుకునేవాళ్లం.

* * * *

కాస్త పెద్దదయింది బుజ్జి. స్నేహాలు ఎక్కువయ్యాయి దానికి.

సాటి పిల్లులతో కలిసి, ఎటో వెళ్ళి పోతుండేది.

ఆడపిల్లుల కోసమో, ఏమో వెతుకుతూ వెళ్ళి, ఒక్కోసారి ఐదారు రోజులు రావటం మానేసేది.

మా ఆవిడ మరీ దిగులుపడి పోతుండేది అలాంటప్పుడు.

ప్రతి డాబా మీదకూ, గోడల వేపూ కళ్ళు చికిలించుకుని చూస్తుండేది కన్పిస్తుందేమోనని.

"అయ్యో! ఎలుకల కోసం కూర్చుని, ఏ డ్రయినేజ్ గోతిలోనో పడిపోయుంటుందేమో!" అని బాధ పడేది.

పిల్లి వెధవ లూరుకోరు గదా! రాళ్లతో కొట్టటం, తరమటం చేస్తుంటారు పిల్లుల్ని.

పెద్దవాళ్ళు వారించరు అలాంటి పిల్లల చేష్టలను. పైగా వాళ్ళే, పిల్లి లంటే పులులో, సింహాలో, దయ్యాలో, భూతాలో అన్నట్టు చిన్నప్పటి నుంచీ పిల్లలలో ఒకవిధమైన భయాన్ని కల్గిస్తుంటారు.

అందుకే పిల్లలు వాటిని కొట్టి, తరిమి, అవి అటూ, యిటూ పరుగెత్తు తుంటే చూసి పైశాచిక ఆనందాన్ని పొందుతుంటారు.

మూగ జీవాల పట్ల అలా అలా వాళ్లలో క్రూర భావం పెంపొందు తుంటుంది వయసు పైబడే కొలదీ.

అన్నం మిగిలి పోయినప్పుడు కాస్త పెరుగులో నో, మజ్జిగలో నో ఉప్పు వేసి కలిపి పెడితే చక్కగా తినిపోతాయి పిల్లులు.

అలా వాటిపట్ల జాలి ప్రదర్శించి, మనకున్నంతలో వాటికి కొద్దిగా అన్నమది పెడితే అవి దొంగతనంగా కిటికీ గుండా దూకి యింట్లో చొరబడి పాలు త్రాగే అవకాశాలు చాలా తక్కువగా ఉంటాయి గదా! అన్పిస్తుంది నాకు.

పిల్లి లుండ బట్టే ఎలుకల బారి నుండి రక్షించబడు తున్నాం మనం. లేకపోతే దేశమంతా ఎలుకల మయమై దిక్కుతోచక అలమటించి పోతారు జనం.

మనుషుల పురోగతికి సహకరించే మూగజీవాల పట్ల జాలి చూపే ఆనవాయితీ లేదు జనాలకు.

అందుకే మనుషులు జాలి లేకుండా తరిమి కొడతారు కాబట్టే అవి ముఖ్యంగా ఆడపిల్లులు పిల్లల్ని తీసుకుని యిళ్ళు మారుస్తూ ఉంటాయి.

వాటికి సురక్షిత ప్రదేశం దొరికితే ఎందుకలా చేస్తాయి? ఈ మనుషుల వల్ల వాటికి రక్షణ లేదు అని నాకు బోలెడు జాలి వాటి మీద.

ఏదో యింత ఎంగిలికూడో, ఏదో తిని జాలిగా యిళ్ల ముందు పడుండే కుక్కలంటేనూ, తమ స్వార్థం కోసం క్రూరాత్ములైన మనుషులు, తల్లి దగ్గర పాలు త్రాగనీయకుండా, తిండి పెట్టకుండా నిలువునా ఎండ బెట్టితే, ఆకలిక తాళ లేక అరచి అరచి చచ్చిపోయే గేదె దూడ లంటేనూ....

రేపు జరగబోయే ఫంక్షన్‌కు ముందే తెచ్చి కట్టి పడేసిన మేక దాని చావు నూహించుకుంటూ చూసే దీనమైన చూపులూ, అరుపులూ అంటే కూడా నా గుండెలు అవిసేటంతటి బాధకు గురవుతాను నేను.

* * * *

ఒకసారి పది రోజుల తర్వాత వచ్చింది "బుజ్జి" ఎక్కడికో వెళ్ళి.

వస్తూనే మా యిద్దరి కాళ్ల వద్ద పడుకుని తన ముందు కాళ్ళు రెండూ మా యిద్దరి కాళ్లమీదా మార్చి మార్చి వేస్తూ, మూగ చూపులు చూసింది క్షమించమన్నట్టుగానో, ఏమో! మరి.

అట్లా మూడు, నాలుగుసార్లు ఎటో పోవటం, కొన్నాళ్లకు రావటం చేస్తుండేది. బాగా చిక్కిపోయి ఉండేది అలాంటప్పుడు.

మిగతా పిల్లులతో కలసి, సరదాగా ఎటో వెళ్లిపోయి, మళ్ళీ ఇల్లు వెతుక్కోలేక అట్లా కొన్ని రోజులకు వస్తుందేమో అనుకునేవాడ్ని నేను.

ఎందుకంటే పల్లెటూళ్ళలోలాగా విశాలంగాకాక యిరు కిరుకుగా అష్టదిగ్బంధంగా ఉంటాయి గదా సిటీలోయిళ్ళు.

దాని కిబ్బందవుతుందని యిద్దరం కలసి కనీసం సినిమాకు కూడా వెళ్లటం మానేశాం.

మాంసం, చేపలకూ దాని ఖర్చు రోజు కు పదిరూపాయల దాకా అయ్యేది. జీతం చాలక చిన్న చిన్న అప్పులు చేసేవాడ్ని.

ఎక్కడికన్నా వెళ్లాల్సి ఉంటే ఒకళ్లం యింట్లో ఉండి మరొకరం వెళ్లేవాళ్లం.

ఈమధ్య బుజ్జి వెళ్ళి నెలదాటింది.

అది వెళ్ళినరోజు ఉగాది పండుగ.

మదిలో ఉండి దానికి మాంసం తేవటం ఆలస్యం మైంది నాకు.

మామూలుగా ఆలస్యమైనా తెచ్చి పెట్టేదాకా

నిద్రపోతుండేది.

ఆరోజెందుకో పదేపదే కాళ్ళు పట్టుకున్నది.

సాయంత్రం వెళ్లటమే, యిహ మరి రాలేదు.

దానిమీద చెప్పలేని ప్రేమ మా యిద్దరికీ.

పిల్లలు కూడా లేరేమో! ఈమధ్య అది అసలే రాక పోయేసరికి మా ఆవిడ మరి మంచం పడుతుందేమో అన్నంతగా రోగిష్టి దానిలా తయారయింది.

'పిల్లల్లేకపోతే, పిల్లుల్ని పెంచుకో' మనే సామెతను నిజంచేస్తూ కడుపున పుట్టిన బిడ్డ దేశాలు పట్టిపోతే ఎంత దుఃఖం కలుగుతుందో అంతా బాధనీ మేమిద్దరం అనుభవించాము.

బుజ్జి వెళ్లిపోయిందనే దిగులుతో వరండాలో నుండి బయటకు చూస్తూ కూర్చున్నాను ఒక సెలవురోజు.

నా కొలీగ్ మోహనమూర్తి మా యింటికే వస్తూ కనిపించాడు.

వస్తూనే, "ఏవిటోయ్! అంత డల్‌గా ఉన్నావు?" అంటూ పలికరించాడు.

బుజ్జి సంగతి చెప్పాను. మనసులో బాధ మరొకరికి చెప్పుకుంటే పొందే ఉపశమనంలాంటిది కలిగింది.

వింటూనే పకపకా నవ్వాడు.

"ఓయ్ నీ పిచ్చిగూలా! పిల్లిపోయిందని జీవితమే ఐపోయినట్లు దిగులు పడేవాళ్లను నిన్నే చూస్తున్నాను. దానికి మి యింట్లో అంతవరకు ఋణముంది. పోయింది. అంతే. అని తేల్చి పారేశాడు.

నాకు చటుక్కున ఒక విషయం తట్టింది.

"అయితే మూర్తీ! అలా 'కర్మ' సిద్ధాంతాన్ని అన్నింటికి వర్తింప చేసుకో రెందుకోయ్ మనుషులు. యాక్సిడెంట్‌లో పోతేనూ, ఆత్మ హత్యలు చేసుకుంటేనూ, హత్య కావింపబడితేనూ, రేప్‌కు గురికాబడితేనూ అలా జరగాలుంది కాబట్టి జరిగిందని అనుకోరేం మరి! వాటి గురించి ఎంక్వయిరీలు, అరెస్టులు, ఎన్నో చేయిస్తారు గదా! అట్లా అనుకోకపోబట్టే 'బుజ్జి' గురించి నేను అంతులేని దిగులూ పడుతున్నాను" అన్నాను బాధగా.

"సరేలే. ఎవరిపిచ్చి వారి కానందం. పిచ్చి ముదిరింది.... తలకు రోకలి చుట్టమన్నట్లుంది నీ వ్యవహారం. కాస్త మార్పుగా ఉంటుంది. అట్లా తిరిగి వద్దాం పద" అంటూ బలవంతంగా బయటకు తీసి కెళ్లాడు మూర్తి.

★ ★ ★ ★

కాలచక్రంలో మూడు నెలలు గడిచి పోయాయి.

"బుజ్జి"ని అంత ప్రేమగా చూసినా అది వెళ్లి పోవటానికి ఒక కారణం ఉందని పించింది నాకు.

ఒక్కో వీధిలో ఒక్కో గండు పిల్లే ఉండి, ఆ ఒక్కతే ఆ వీధిలో ఉండే ఆడపిల్లులతో జత కట్టాలని తోచేదేమో! ఐదారు యిళ్ల అవతల ఉంటే గండు పిల్లి (యీ బుజ్జి తండ్రే) బుజ్జిని చిన్నగా ఉన్నప్పుడు మూతులు నాకి ముద్దు పెట్టుకుని ప్రేమగా చూసేది. పెద్ద దయిన "బుజ్జి" (వాటిల్లో

# పాటా పక్షీ

## డా. సి. నారాయణరెడ్డి

ఎన్ని పక్షులు పాడుతున్నాయి
ఇంట్లో దూరిన ఆకాశంలో
ఏవీ ఆ గూళ్లు?
ఎక్కడివీ గుక్కతిప్పని నోళ్లు?
మబ్బుల రొదల్ని కరిగించి
మాటలుగా మార్చుకున్నాయా?
చిచ్చు పిడుగుల్ని మచ్చిక చేసి
ఒళ్లో దాచుకుని
లల్లబీలు పాడుతున్నాయా?
పాటకూ పక్షికీ
చూపుకూ అక్షికీ
ఉన్న సంబంధం
ఉదధికీ నదికీ తెలుసు
కాంక్షకూ కాలానికీ తెలుసు

## బుజ్జి

ఎదుగుదల చాలా త్వరగా జరిగి పోతుంది) తన తోటి ఆడపిల్లులతో జత కట్టటం గమనించిన గండుపిల్లి బుజ్జి రాత్రి పూట బయటకు షికారు వెళ్లినప్పుడు చావగొట్టేది. మేమెంత తరిమినా వాటని విడదియటం మావల్ల అయ్యేదికాదు.

ఇలా అది వెళుతుందనగా యీ గండు పిల్లి పగలు కూడా బుజ్జిని చావగొడుతుండేది, అది బయటకు వెళ్తే.

అందువల్ల కూడా అదెటో వెళ్లి పోయిందని పించింది నాకు.

నేను గమనించిన మరో విషయం పిల్లులలో వరసా, వావిలు ఉండవు. అన్న చెల్లెలితో, తండ్రి కూతురితో యిలా జత కడతాయి. ఆ ఋతు సమయంలో ఆడపిల్లి రెండు, మూడు గండు పిల్లులతో తిరుగు తుంది. ఆ యీర్ష్యవల్ల గండు పిల్లులు బొచ్చంతా పీక్కుని రక్తం కారేలా తన్ను కుంటాయి. ఆడపిల్లి మాత్రం నిమ్మకు నీరెత్తినట్లు చూస్తుండి పోతుంది.

పిల్లి మసిలిన ఇల్లు కదా! అవి వాసన ద్వారా అన్నీ గ్రహించ గలవు కాబట్టి, మా యింటికి కొన్ని పిల్లులు వస్తూ పోతూండేవి. ముఖ్యంగా రాత్రులప్పుడు. వాటికి వినికిడి శక్తి అపారమే.

అన్నం, పెరుగూ కలిపి మెట్ల కింద పెడితే ఏవో తిని పోతుండేవి. అంతేగానీ, దొంగతనంగా పాలు త్రాగటమూ, పెరుగు తినటమూ చేసేవి కావు. "బుజ్జీ" అంతే. పెడితే తప్ప ఎదురుగా ఉన్నా ఎగబడేది కాదు.

మాంసం, చేపల ఖర్చు లేదిప్పుడు. అయినా బుజ్జి లేని లోటు మాకు అత్యంత బాధాకరమే.

★ ★ ★ ★

ఆ రోజు ఎందుకో బాగా వర్షంగా ఉన్నది.

ఒక తెల్ల పిల్లి. బొద్దుగా అందంగా ఉన్నది. రెండు చిన్న పిల్లుల్ని తీసుకుని మా యింటికి వచ్చింది. లోపలకు పిలిస్తే తప్ప రాలేదది.

బుజ్జిగా, ముద్దుగా ఉన్నాయని మా ఆవిడ యింట్లోకి తెచ్చింది వాటిని.

"మాంసం అలవాటు వీటికి చెయ్యొద్దు. అప్పుల పాలవుతాం" అని ఆవిడ ఎంత మొత్తుకున్నా వినకుండా, మళ్లీ తెచ్చి పెట్టడం మొదలెట్టాను నేను.

తల్లిపిల్లి వాటికి రోజూ ఎలుకను తెచ్చి యిచ్చేది. అది తినకపోతే వాటి భాషలో కోప్పడేది అది. అది తినీ, యీ మాంసమూ తిని, వాటికి పడకనో, ఏమో కక్కటం, యిల్లంతా పేరగటం చేసేవి.

ఒక్కో రోజు తెల్లవారే సరికి మంచం క్రింద అంతా ఏరుగుళ్ళుండేవి. ఇల్లంతా కంపు లేచిపోయేది.

వానల రోజులు. పొడి మట్టి దొరకటం దుర్లభం కదా!

ఇనుప బొచ్చెలలో మట్టిపోసి, మూలల్లో పెడితే, వాట్లో దొడ్డికి కూర్చునేవి ఆ పిల్లి పిల్లలు రెండూ, పెద్ద పిల్లి ఎటూ బయట కెళుతుంది.

ఇల్లంతా తుడిచీ, తుడిచీ ఎప్పుడూ తడి, లసలస. ఇల్లంతా ఏరుగుళ్ళు. అదంతా ఎత్తి పోయలేక మా ఆవిడ నన్ను తిట్టిపోసేది మాంసం తెచ్చిపెట్టొద్దని.

"అలవాటయిం తర్వాత అవి ఊరుకుంటాయా! పిక్కు తినవూ తెచ్చి పెట్టమని" అని కసిరేవాడిని నేనావిడను.

"మీ మూర్ఖత్వం మీదేకానీ, ఎదుటి మనిషిని అర్థం చేసుకోరు గదా" అంటూ విసుక్కునేదావిడ.

ఆ పిల్లి లేరిగే పెంట వాసనతో, నాలుగు నెలలు సరిగా నిద్రలేక, నరక బాధ పడ్డాము.

ఆ పిల్లుల తల్లి మళ్లీ గర్భిణి.

ఇప్పుడున్న పిల్లలు పుట్టబోయే పిల్లలకు ఎక్కడ అడ్డు వస్తాయోనని, ఆ తల్లి వాటిని దగ్గరకు రానీయకుండా "బుస" కొట్టేది. ఎటైనా వెళ్లిపొమ్మనే సూచనగా.

అంతవరకూ కడుపులో పెట్టుకుని, పాలిచ్చి, కంటికి రెప్పలా చూసిన తల్లి అట్లా దరి చేరనివ్వక పోయేసరికి పిల్లి కూనలు బిక్క మొహా లేసుకుని, చూస్తుండేవి దీనంగా తల్లి వేపు.

నా గుండె తరుక్కు పోయేది అదంతా చూస్తుంటే.

"మీ దొత్తి ఆడమనసని" కోప్పడేది మా ఆవిడ నన్ను.

★ ★ ★ ★

నెలల గడిచి పోయాయి "బుజ్జి" ముండ వెళ్లి. ఈ మధ్య ఒకటే గుర్తొస్తున్నది. అట్లా అని దాన్ని మర్చిపోయిందెప్పుడు గనక!




**పో**టీపడినప్పుడు ఒకరు జయిస్తే మరొకరికి అపజయం కలుగుతున్నది. పూర్వం రాజులు ఇతర రాజ్యాలను ఆక్రమించదలచినప్పుడూ, తమ ప్రాభవాన్ని వెల్లడించదలచినప్పుడూ యుద్ధం చెయ్యడం జరిగేది. ఒకప్పుడు వారు విజయం సాధించవచ్చు. ఒకప్పుడు అప-జయాన్ని పొందనూ వచ్చును. అపజయం కలిగినప్పుడు నిరుత్సాహ-పడక- మరొకసారి జయం కలగవచ్చు-నని ధైర్యంతో ఉండవలెను. అలా ధైర్యం లేకపోతే మనిషి క్రుంగిపోయే పరిస్థితి యేర్పడవచ్చును.

విద్యార్థులు, బాగా కృషి చేసినా, సమయస్ఫూర్తి లేకనో, మరే కారణం వల్లనో పరీక్షలప్పుడు బాగా వ్రాయలేక కృతార్థులు కాక-పోవచ్చును. ఒకసారి పరీక్ష తప్పిన వారు మరొకసారి ఉత్తమశ్రేణిలో నే ఉత్తీర్ణులు కావచ్చును. ఇలాటి సంఘటనలను ఎన్నింటినో మనం చూస్తూనే ఉన్నాము.

వారి వారి బుద్ధికౌశల్యాన్ని పరిశీ-లించుటకు వక్తృత్వంలోనూ, వ్యాస రచనలోనూ పోటీలు పెట్టి, వాటిలో నెగ్గిన వారికి బహుమతులు ఇవ్వడం ఆచారం. ఆ పోటీలలో అర్హులైన వారే పాల్గొంటారు. కాని, వారిలో ఒక్కరే విజయం పొందుతారు. అయినా, తక్కిన వారికి నిరుత్సాహం కలుగ-కుండ, మరొకసారి ప్రయత్నించడానికి ప్రోత్సాహంగా మరికొన్ని బహుమతు-లను ఇస్తూ ఉంటారు. అందువల్ల నెగ్గని వారు తిరిగి ప్రయత్నించడానికి ఉత్సాహంతో సంసిద్ధులు కాగలరు.

ఇక క్రీడారంగాన్ని తీసుకుందాం. ప్రపంచ విఖ్యాతిని పొంది ఎన్నో విజయాలు సాధించి, బహూకృతులను అందుకొన్న ప్రసిద్ధ క్రీడాకారులే ఒక్కొక్కప్పుడు అపజయం పొందడం జరుగుతూ వుంటుంది. ఆ అపజయాన్ని వారు ఎంత మాత్రం లెక్క చెయ్యరు. ధైర్యాన్ని విడువరు. మరొకసారి తప్పక విజయం పొంద-గలమనే ధీమా వారికి తప్పక ఉంటుంది.

కలిమి, లేములను సరిసమానంగానే భావించడం విచక్షణులకు సహజ-గుణం. ఆ విధంగానే జయాన్ని పొందేటప్పుడు అధికోత్సాహాన్నీ, అపజయం పొందేటప్పుడు ఎక్కువ విచారాన్నీ పాటించక, జయాపజయా-లను సరిసమానంగా పరిగణించటం ఎంతో అవసరం.

-బులుసు వేంకట రమణయ్య

---

పిల్లుల పిచ్చి నాకెంతవరకు పోయిందంటే పత్రికలలో వాటి గురించి ఏది వ్రాసి ఉన్నా చదివేవాడిని **అత్యంతోత్సాహంతో**. నా **ఆత్మీయుల** గురించిన సమాచారం చదివానన్న సంతృప్తిని పొందేవాడిని.

ఏ పిల్లిని చూసినా "బుజ్జి" తలపుకు వచ్చి నా సంబంధికులను చూసినంత **ఆనందం** పొందేవాణ్ణి.

* * * *

ఒకరోజు యిప్పుడున్న పెద్ద పిల్లీ, దానికి కొద్ది దూరంలో రెండు పిల్లి పిల్లలూ గడపలో కూర్చుని ఉన్నాయి.

పెద్ద పిల్లెందుకో ఎదురింటి గోడపైకి చూస్తూ... "ఊ" అంటూ మూలుగుతోంది.

"మ్యావ్" అనే మాటనే వివిధ సందర్భాలలో రకరకాలుగా భావాన్ని వ్యక్తం చేస్తాయి పిల్లులు.

"ఏమున్నదా అక్కడ" అని అటు చూస్తూ మ్రాన్పడి పోయాను.

అక్కడ ఉన్న దెవరో కాదు. మా బుజ్జి. బంగారు రంగులో ఉన్న మా బుజ్జి బుల్లి.

పిలిస్తే వచ్చేదే!

వస్తే అదీ, యిదీ కొట్టుకుంటాయి. గోలవుతుంది.

అదొచ్చిందని వీటిని వెళ్ళ గొట్టలేము. అది వెళ్ళినప్పటి నుంచీ యివి బాగా అలవాటయ్యాయి మాకు.

మా ఆవిడ చూడలేదు బుజ్జి నిప్పుడు. చూస్తే పిలిచేదే. అదంటే ఆవిడ కమితమైన ప్రేమ.

ఆవిడ దొడ్లో అవతల లింటావిడతో ఏదో మాట్లాడుతోంది.

నేను "బుజ్జి"నే చూస్తున్నాను.

అది నన్ను చూస్తున్నది.

ఐదు నిముషాలు గడిచాయి.

ఏమనుకుందో లేచింది బుజ్జి.

ఒక్కసారి నావేపు, యీ పిల్లుల వేపూ చూసింది.

ఎందుకో నాకు గుండె బరువెక్కినట్లయింది. దాని చూపులు చూస్తుంటే.

వెనక్కి తిరిగి చూడకుండా గోడమీద నడుస్తూ వెళ్ళి పోయింది గమ్యం తెలియని బాటసారిలా.

నాకు దుఃఖ మాగింది కాదు.

మగాణ్ణనే విషయం మరచి వెక్కి వెక్కి, కదలి కదలి ఏడ్చాను.

కొన్నేళ్ళు కాలగర్భంలో కలసి పోయాయి. కానీ మా "బుజ్జి"ని మాత్రం మళ్ళీ మేము చూడలేక పోయాము. □

## వ్యక్తిగతం



ఫ్రాన్స్‌కి చెందిన సుప్రసిద్ధ సినీ నటి, రచయిత్రి శ్రీమతి సైమన్ సిగ్నొరెట్ (64) ఇటీవల కాన్సర్‌తో మరణించారు. ఈమె నటించిన 'కాస్క్వేడి వోర్' (1952), "రూమ్ ఎట్ ది టాప్" (1959) చిత్రాలు మరపురానివి. మొదటి చిత్రంలో ఈమె నటనకి బ్రిటిష్ ఫిలిమ్ అకాడెమి అవార్డు, రెండవ చిత్రంలో ఉత్తమ నటిగా ఆస్కార్ అవార్డు అందుకున్నది. జర్మనీలోని వీస్‌బాడెన్‌లో పుట్టిన ఈమె పారిస్ పరిసర ప్రాంతాలలో పెరిగింది. ఈమె తండ్రి ఒక యూదు. నాజీల దురాగతాలప్పుడు ఆయన ఫ్రెంచివారి రక్షణ శాఖలో సైనికాధికారిగా ఉండేవాడు. మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత ఆయన బ్రిటన్ వెళ్లి స్థిరపడ్డా ఈమె మాత్రం పారిస్‌లోనే ఉండిపోయింది. పారిస్ నుంచి వెలువడే 'నొవియాక్స్ టింప్స్' దినపత్రికలో కార్యదర్శిగా కొంత కాలం పనిచేసింది. ఈమె చలనచిత్ర జీవితం 1946లో ప్రారంభం అయింది. తన 40 సంవత్సరాల సినీ జీవితంలో ఈమె 40 చిత్రాలలో నటించి ప్రేక్షకుల హృదయాలపై చెరగని ముద్ర వేసారు. ఈమె రాసిన నవలలు అడియూ, వో వోడియా, నాస్టాల్జియా ఈస్ నాట్ వాట్ ఇట్ యూస్డ్ టు బి, లేలెండె మైన్, ఎల్లె ఎటాయిచ్ సోరియెంట్ అమ్మకాలలో రికార్డు సృష్టించాయి. 1977లో ఈమె నటించిన "లా వీ డీ వాంట్ సోయ్" (ఇంగ్లీషులో మేడమ్ రోసా) చిత్రం ఘన విజయాన్ని సాధించింది. 1949లో మొదటి భర్త ప్రముఖ దర్శకుడు అలెగ్రెట్‌కి విడాకులు ఇచ్చి నటుడు, గాయకుడు అయిన మాంటాన్డ్‌ని వివాహం చేసుకున్నది. కమ్యూనిస్టు సిద్ధాంతాలని ఒకప్పుడు ఇష్టపడిన ఈమెకి 1956లో సోవియట్‌లు హంగేరిని ఆక్రమించడంతో దానిపై మోజు కాస్త తగ్గింది. మానవ హక్కుల పరిరక్షణ కోసం ఈమె తమ చివరి క్షణం దాకా కృషి చేసారు. ఫ్రాన్స్‌లోని జాతి విచక్షణ వ్యతిరేకోద్యమానికి అండగా ఉన్నారు. 'ఫ్రాన్స్ అధ్యక్షుడు ఫ్రాంకోయిస్ మిట్టరాండ్ సైమన్ ఫ్రెంచివారి హృదయాలలో శాశ్వతంగా సుస్థిరమైన స్థానాన్ని సంపాదించారు' అనడం ఆమె విశిష్టమైన వ్యక్తిత్వానికి నిదర్శనం ... □

## వారఫలం

### 13-12-1985 శుక్రవారం మొదలు 19-12-1985 గురువారం వరకు

★ **మేషం** :నూతన వ్యక్తుల పరిచయం ఏర్పడటం, తద్వారా ఏదో మేలు జరగటం, ఆర్థికంగా మేలు పొందటం, అయినవారి సంబంధం నిశ్చయం కావటం గ్రహింపదగిన అంశాలు. స్త్రీలకు: ఉద్యోగ వృత్తులందు పెంపు చెప్పదగిన అంశం.

★ **వృషభం** :ఒకటి రెండు గ్రహాలు మీకు అనుకూల స్థానాల్లో ఉన్నాయి. ఈ వారమంతా మాటకు పెంపు, రాజకీయంగా అనుకూలం చేకూరుతుంది. స్వార్జితం అధికంగా కనిపించగల వారం. స్త్రీలకు : అనుకొనని విధంగా మేలు చేకూరుతుంది, ఆనందదాయకమేగా!

★ **మిథునం** :మీ రాశికి గ్రహబలం అధికం. వారమంతా ఆనందోత్సాహాలతో యిల్లు కళకళ లాడుతుంది. అప్రయత్న ధనాదాయమున్నది. వ్యవహారరంగాన మీకు మేలున్నది. పోగొట్టుకొన్న వస్తువులు సేకరించుకోగలుగుతారు. అయినవారికి సాయం చేయవలసిన అగత్యముంటుంది. స్త్రీలకు : ప్రతిభ రాణింపు, ధర్మకార్యాచరణమునకు అవకాశం గల వారం.

★ **కర్కాటకం** :పోయిన వస్తువులు సమకూర్చుకోగలుగుతారు. గ్రహానుకూల్యతమును ప్రయాణ లాభం చెప్పదగిన సమయం కూడ. భూస్థితి యందు పెంపు చేకూరుతుంది. రచనా ప్రావీణ్యత గల వారికి అనుకూలం. స్త్రీలకు: వైజ్ఞానిక రంగాన అనుకూలత, ప్రయాణ మూలకంగా ఏదో అనుకూలం చేకూరుతుంది.

★ **సింహం** :జాయింటు వ్యాపారం మీరు చేసేలాగైతే ఎంతో జాగరూకత అవసరం. ఎంతో కాలంగా ఆశించిన వాహనమో, విలువ గల వస్తువులో లభ్యం కాగలవు. అత్యవసరంగా ప్రయాణం చేయవలసిన అగత్యం ఏర్పడుతుంది. స్త్రీలకు: వృత్తి యందు పెంపు, ధనలబ్ధి.

★ **కన్య** :అనేకవిధాలా మేలు చేకూరే వారం. నాలుగు గ్రహాలు ఈ వారం మీకు అనుకూల ఫలదాయకంగా ఉండగలవని చెప్పవచ్చు. నూతన వృత్తి చేపట్టుటకు కొందరకు అవకాశమున్నది. గ్రహించి మెలగండి. స్త్రీలకు: ఆశించిన విధంగా ఉద్యోగమందు పెంపు కనిపించుట వారం రాశి బలం.

★ **తుల** :'అనుకొనేది ఒకటి, అయ్యేది ఒకటిగా' ఈ వారం గ్రహింపగలుగుతారు. ప్రతిభ రాణించగల సన్నివేశాలుంటాయి. కొందరకు ప్రయాణాలు చెప్పదగిన వారం. అప్రయత్న ధనలబ్ధి కొందరకు. స్త్రీలకు:రచనా ప్రావీణ్యత భాసింప గలవారం.

★ **వృశ్చికం** :స్థితి యందు పెంపు చేకూరుతుంది. అంతేగాక స్వార్జిత ధనమందు పెంపు కూడా కనిపిస్తుంది. రాజకీయవాదుల వలన మీకు మేలు చేకూరుట కల్ల, ఇల్లు అభివృద్ధి నందగల సదుపాయా లేర్పడుతాయి, గ్రహించండి. స్త్రీలకు: అధిక విద్యావకాశాలు, ఆరోగ్యమందు పెంపు చేకూరుతుంది.

★ **ధనుస్సు** :గ్రహించండి. గత కొన్నివారాల కన్నా అన్నివిధాలా అభివృద్ధి మిన్నగా ఉంటుంది. వ్యవహారం ఏదైనా ఉంటే, మీకు ప్రత్యర్థులకు సామరస్యంగా పరిష్కారం కాగలదు. అలా యిలా తిరుగుతూ, మతిమరపు వలన వస్తువులు పోగొట్టుకోగలరేమో! స్త్రీలకు: ధనాదాయం, ఆనందం.

★ **మకరం** :ఇటీవల కొంత కాలంగా ఏది చేసినా కలసి రాలేదని బాధపడ్డారుగా! ఇక మీకు వారం వారం అభివృద్ధి కాలం. అన్నిరంగాలలో సమర్థవంతంగా కనిపించటం మీరే గ్రహింపగలుగుతారు. ధర్మకార్యాచరణమునకు అవకాశమున్నది. స్త్రీలకు : అనవసరంగా ఉద్యోగంలో యిబ్బందులు తెచ్చుకోకండి. ఓర్మితో మెలగాలి.

★ **కుంభం** :మీరు చిరకాలంగా చేసే వ్యవహారం యిక నుండి ఆపవలసి రావచ్చు. అధికారుల వలన మాట పడవలసిన అగత్యం ఏర్పడుతుంది. మీ మూలాన సహాయం పొందిన వారు, సమయంలో సహాయం చేయరు, 'ఇది లోకంలో సహజం' అని కూడా గ్రహింపగలుగుతారు. స్త్రీలకు : అధికారమందభివృద్ధి, స్వల్పంగా ఆదాయం.

★ **మీనం** :విద్యా విషయంగా పెంపు చెప్పదగిన సమయం. కొందరు దూరప్రాంతాలకు పోగల అవకాశాలు కూడా లేకపోలేదు. పుణ్యకార్యాచరణమునకు అవకాశముంటుంది. చాల మందికి అప్పులు వసూలు చేసికొనుటకు అనువైన గ్రహస్థితి గలదని ఆశించండి. స్త్రీలకు: అధికారుల మూలాన ఆశించిన పదవులు లభ్యం కావచ్చు. ఉద్యోగమందు మెలకువతో మెలగవలెనని గ్రహింపదగిన వారం.

—విద్వాన్ కోటసత్యరంగయ్యశాస్త్రి

సీరియల్

# నీడలు-నిజాలు

విన్నకోట సుశీలాదేవి

(గత సంచిక తరువాయి)

శారద సాహచర్యంలో రవి చాలా త్వరగా కోలుకున్నాడు. శారద అతడిని క్షణం కూడా విడవకుండా ప్రక్కనే వుండి అతని అవసరాలు చూస్తోంది. వేళకి మందులు ఇవ్వడం.... భోజనం పెట్టడం.... అతడిని వుల్లాసపరచడానికి ఏవేవో కబుర్లు చెప్పడం- సాయంత్రం వేళ షికారుకు తీసుకెళ్ళడం- ప్రస్తుతం ఆమె దినచర్య. రవి కూడా శారదని విడిచి వుండలేక పోతున్నాడు. ప్రతిక్షణం శారద అతని ప్రక్కనే వుండాలి.

తిరిగి - వాళ్ళిద్దరి మధ్యా ఏర్పడిన సాన్నిహిత్యం లక్ష్మీదేవికి చాలా ఆనందాన్ని కలిగిస్తోంది.

ఈ మధ్య కాలంలో వెంకట్రామయ్య ఒకసారి వచ్చాడు. అతడు రాగానే లక్ష్మీదేవి సంతోషం పట్టలేక -

"అన్నయ్యా! రవి చాలా మారిపోయాడు. ఇప్పుడు శారదని విడిచి క్షణం కూడా వుండటం లేదు. వాళ్ళిద్దరిప్పుడు ఎంత అన్యోన్యంగా వున్నారో తెలుసా" అంటూ గబగబా చెప్పింది.

వెంకట్రామయ్య ఏ భావమూ ప్రకటించ లేదు. నిర్లిప్తంగా చూస్తూ వుండి పోయాడు.

"కావాలంటే చూద్దువుగాని రా అన్నయ్యా" అంటూ వెంకట్రామయ్యని మేడ పైకి తీసుకెళ్ళింది.

రవి మంచం మీద పడుకుని వున్నాడు. శారద రవి ప్రక్కన కూర్చుని ఏదో పుస్తకం చదివి వినిపిస్తోంది. ఆ దృశ్యం చూడగానే వెంకట్రామయ్యకి ఒళ్ళు మండిపోయింది. బలవంతాన తన కోపాన్ని అణచుకున్నాడు.

**జరిగిన కథ-3:** వెంకట్రామయ్య కూతురు శారద. తల్లి లేని శారదను తండ్రి అల్లారు ముద్దుగా పెంచుతాడు. వెంకట్రామయ్య చెల్లెలు లక్ష్మీదేవి కుమారుడు రవి. రవికి ఏక్సిడెంట్ అయ్యిందని తెలిసి చూసిరాను హైదరాబాదు వెళతానని పట్టు పట్టింది శారద. శారదను రైలెక్కిస్తాడు వెంకట్రామయ్య. రైల్లో శారదకి గతం అంతా కళ్ళముందు కదలాడింది. శారదకి, రవికి పెళ్ళి చేయాలనుకుంటారు పెద్దలు. రవి దుడుకుతనం వల్ల కాగే కాగే నూనె శారద ముఖంపై, చేతులపై చింది ఆమె శరీరం అంద వికారమయిపోతుంది. అయినా రవికి శారదపై ప్రేమ తగ్గలేదు. రవి యూనివర్శిటీలో ఎం. కామ్‌లో చేరుతాడు. అక్కడ జరిగిన ఒక సంఘటన అతని జీవితాన్ని ఒక కొత్త మలుపు తిప్పింది. రవికి సునీత పరిచయం అయ్యింది. అతను శారదను వివాహం చేసుకోనని ఇంట్లో చెప్పేస్తాడు. శారదను పెళ్ళి చేసుకోలేనని మేనల్లుడు చెప్పగా విన్న వెంకట్రామయ్య దీనికి తలదన్నే సంబంధం తెచ్చి శారదకి పెళ్ళి చేయాలని దేశమంతా గాలించడం మొదలు పెట్టాడు. మేనకోడల్ని చూచిన లక్ష్మీదేవికి ప్రాణం లేచి వచ్చినట్లయింది. రవికి కంటి చూపు పోయింది. అతను పూర్తి ఆరోగ్యవంతుడయిన తర్వాత ఆపరేషన్ చేస్తే చూపు వచ్చే అవకాశం ఉందని డాక్టరు చెపుతాడు. రవికి శారద సేవలు చేయడం మొదలు పెట్టింది. మళ్ళీ వాళ్ళిద్దరు దగ్గరయ్యారు.

రవిని పలకరించి క్రిందికి వచ్చాడు. ఆ రాత్రి వెంకట్రామయ్య చెల్లెలితో అన్నాడు....

"లక్ష్మీ! శారదని తీసుకెళ్ళడానికి వచ్చాను."

ఆ మాట విని లక్ష్మీదేవి కంగారు పడింది! రవి శారద వలన ఇప్పుడిప్పుడే కోలుకుంటున్నాడు. ఇటువంటి సమయంలో శారదని తీసుకెడితే రవి ఏమైపోతాడు. అతడి ఆరోగ్యం మళ్ళీ మొదటికి వస్తుంది. డాక్టరుగారు రవికి త్వరలో ఆపరేషను చేసే వుద్దేశంలో వున్నారు. శారద వెళ్ళిపోతే.... రవికి ఆపరేషను చేసే అవకాశం ఇక ఎప్పటికీ రాకపోవచ్చు.

"రేపు వుదయం బండికి వెడతాం లక్ష్మీ" అన్నాడాయన.

"అదేమిటన్నయ్యా! ఇప్పుడు శారదని తీసుకెడితే ఎలా?"

"శారద వచ్చి చాలా రోజులయిందికదమ్మా. అంతగా కావాలంటే ఆపరేషను టైముకి వస్తుందిలే."

ఆయనకి శారదనిక ఇక్కడ వుంచడం ఏమాత్రం ఇష్టం లేదు.

రవి ఆనాడు అన్నమాటలే ఆయన మనస్సులో ప్రతిక్షణం మెదుల్తున్నాయి! అటువంటి దుర్మార్గుడికి తన కూతురు ఎందుకు సేవ చెయ్యాలి? పెళ్ళి చేసుకోడానికి అడ్డు వచ్చిన దాని వికారరూపం సేవలు చేయించుకోడానికి ఎలా పనికి వచ్చింది!

అయినా శారదకి బుద్ధి వుండాలి! అటువంటి మోసగాడి కోసం ఎందుకంత హైరాన పడాలి? వాడు లేకపోతే బ్రతకలేనన్నట్లు పాకులాడుతోంది! ముందు శారదని ఇక్కడ నుండి తీసుకు పోవాలి!" అనుకున్నాడు.

లక్ష్మీదేవి ఆలోచనలు వేరుగా వున్నాయి. రవి తన తప్పుని తెలుసుకున్నాడు. శారద గొప్పతనాన్ని గ్రహించాడు. ఆమె అంటే చాలా అభిమానం చూపుతున్నాడు. మళ్ళా వాళ్ళిద్దరు ఒకటయ్యారు! రవికి ఆపరేషన్ జరిగి- కళ్ళు రాగానే వాళ్ళిద్దరికి పెళ్ళి చేసి- తన కోరిక తీర్చుకోవాలి! అనుకుంటోంది.

కానీ అన్నగారి ముఖంలోని చిరాకుని గమనించి- తన భావాల్ని తనలోనే అణచుకుని -

"పోనీలే అన్నయ్యా! నీ ఇష్టం వచ్చినట్లే చెయ్యి" అంది లక్ష్మీదేవి.

వెంకట్రామయ్య మౌనంగా భోజనం ముగించి తన గదిలోకి వచ్చాడు!

అరగంట తర్వాత శారద తండ్రి గదిలోకి వచ్చింది. లోపలి కొస్తున్న శారదని చూస్తూ -

"అయిందా సేవ" అన్నాడు వెంకట్రామయ్య కోపంగా.

తండ్రి మాటలకు శారద నవ్వింది! తండ్రి మంచం మీద కూర్చుని-

"నాన్నా! నువ్వు వచ్చినప్పటి నుండీ నీతో సరిగ్గా మాట్లాడలేదని కోపం వచ్చిందా?" అనడిగింది.

"నాతో మాట్లాడలేదని కాదు! వాడికి సేవ చేస్తున్నావని నా బాధ!"

"బావ మనకి పరాయివాడా నాన్నా!"

"అవును! వాడికి చేసేకంటె రోడ్డుమీద పోయేవాడికి చేసినా సంతోషించే వాడిని."

"ఎందుకు నాన్నా! బావ అంటే నీకంత కోపం?" శారద మెల్లగా అంది.

"కోపం కాక ప్రేమ ఎలా వస్తుందమ్మా! ఆనాడు నిన్ను పెళ్ళి చేసుకోనని తిరస్కరించాడు! ఇప్పుడు కళ్ళు పోగానే నీమీద ఎక్కడలేని అభిమానం కురిపిస్తున్నాడు! అంతా నాటకం!" వెంకట్రామయ్య పళ్ళు కొరికాడు.

"కాదు నాన్నా! బావ మారిపోయాడు. ఆనాడు తనన్న దానికి పశ్చాత్తాప పడుతున్నాడు!"

శారద అమాయకత్వానికి నవ్వూ, జాలి కలిగాయి ఆయనకు!

"శారదా! అది నిజం కాదమ్మా! తన అవసరం కొద్దీ అలా నటిస్తున్నాడు. అంతే! రవి మారాడంటే నేను నమ్మను. వాడొట్టి స్వార్థపరుడు!"

"లేదునాన్నా!" నువ్వు పొరబడు తున్నావు! బావ మారాడు. నిజానిజాలు గ్రహించాడు!" అంది దృఢంగా.

కూతురంత గట్టిగా చెప్తోంటే.... ఆయన ఇక వాదించలేక పోయాడు.

క్షణం ఆగి అన్నాడు-

"నిన్ను తీసుకెడదామని వచ్చాను తల్లీ!"

శారద ఆశ్చర్యపోయింది!

"నన్నా! నేనిప్పుడు రాను నాన్నా! బావకి ఆపరేషను జరగాలి! కళ్ళు రావాలి! అంతవరకూ నాకు మనశ్శాంతి లేదు. బావ కళ్ళని మళ్ళా చూశాకే ఇంటికి తిరిగి వస్తాను!" నిర్ణయించుకున్నట్లు చెప్పింది.

ఆయన చిన్నగా నిట్టూర్చాడు.

"ఏమో తల్లీ, నీ వరసేం నచ్చులేదు నాకు! నిన్ను కాదన లేకుండా వున్నాను! అనవసరంగా నువ్వు బాధపడి నన్ను బాధపెడుతున్నావ్!"

"నాన్నా! బావంటే నాకెంత ఇష్టమో నీకు తెలుసు! బావ అలా గ్రుడ్డివాడుగా మంచంలో పడివుంటే నేను చూస్తూ వూరుకోలేను నాన్నా! ఒకవేళ అతడు నాపై కోపంగా వున్నా అతడికి సేవ చేసేదాన్ని. చిన్నప్పట్నుంచి పెంచుకున్న అభిమానం ఒక్కసారి ఎలా పోతుంది నాన్నా!"

"అది నిజమే తల్లీ! నువ్వు అభిమానం చూపుతున్నావు! బాగానే వుంది. అతడిక్కూడా నీ మీద అభిమానం వుంటే ఎంతో సంతోషించే వాడిని. ఈ పాటికి మీ ఇద్దరికీ పెళ్ళి చేసి మనవళ్ళతో ఆడుకుంటుండేవాడిని." అన్నాడాయన.

ఆ మాటలకు శారద సిగ్గుపడింది.

వెంకట్రామయ్య శారద తల నిమురుతూ –

"పిచ్చితల్లీ! నీ సంతోషం కంటె నాకు కావలసిందేమున్నదమ్మా! నీ ఇష్ట ప్రకారమే కానీ! నేను రేపు వుదయం బండికి వెడుతున్నా!" అన్నాడు.

"రేపేనా!"

"అవునమ్మా! కూలీలకు ఇంకా డబ్బు ఇవ్వలేదు! నేను వెళ్ళకపోతే గొడవ చేస్తారు!"

శారద మాట్లాడ లేదు.

"ఇప్పటికే చాలా అలిసిపోయి వుంటావు! పడుకో తల్లీ!" అన్నాడు దుప్పటి మీదికి లాక్కుంటూ!

శారద తన మంచం మీదకు వెళ్ళి పడుకుంది. వెంకట్రామయ్యకి కళ్ళు మూసుకోగానే నిద్రపట్టేసింది!

శారదకి నిద్రపట్టలేదు. తండ్రి గురించే ఆలోచిస్తోంది.

నాన్నకి బావ మీద కోపం పోలేదులా వుంది. కానీ పాపం బావ అప్పుడేదో క్షణికావేశంలో అలా మాట్లాడి వుంటాడు.. ఇప్పుడు తప్పు తెలుసుకున్నాడు గదా! పొరపాట్లు చెయ్యడం మానవ సహజం! క్షమించడం కూడా మానవ లక్షణమే. బావని తను ఏనాడో క్షమించేసింది. ఇప్పుడతడి మీద ప్రేమ ఇదివరక్కంటే రెట్టింపయింది. అతడిని విడిచి తనుండలేదు! బావకి ఆపరేషన్ జరిగి అతడికి కళ్ళువస్తే తనిక శాశ్వతంగా అతడితో వుండిపోవచ్చు! బావ తనని పెళ్ళిచేసుకున్న రోజున తన తండ్రికి బావ మీద నమ్మకం ఏర్పడుతుంది. ఆరోజు ఎంతో దూరంలో లేదు. త్వరలో నే వచ్చేస్తుంది.



శారద మనస్సు తీయని వూహలతో నిండిపోసాగింది!

★ ★ ★ ★ ★ ★ ★ ★

"శారదా! నాకు కళ్ళు రాకపోయినా ఫర్వాలేదు. నువ్విలా నాప్రక్కన వుంటే చాలు" అన్నాడు రవి ఒకరోజు.

"అలా అనుకోకు బావా! నీకు తప్పకుండా కళ్ళు వస్తాయి. నా మాట మీద నమ్మకం లేదా!" కించిత్తు బాధా మిళిత స్వరంతో అంది.

రవి నొచ్చుకుంటూ–

"నమ్ముతాను శారదా! నువ్వు దేవతవు. నీమాట ఫలిస్తుంది శారదా! నాకు కళ్ళురాగానే మొదటగా నిన్నే చూడాలి! నువు నా ఎదురుగా వుండాలి! వుంటావు కదూ!"

అతడి మాటలకు శారద వుప్పొంగి పోయింది.

"అలాగే బావా. తప్పకుండా."

క్షణం తర్వాత రవి అన్నాడు.

"శారదా! నిన్నొక మాట అడగాలనుకుంటున్నాను! అడగనా!"

"సందేహమెందుకు? అడుగుబావా".

"శారదా! నువు చిన్నప్పుడు పాటలు పాడేదానివి కాదుగా! సంగీతం కూడా నేర్చుకోలేదు. మరింత మధురంగా ఎలా పాడగలుగుతున్నావ్!"

"ఓ! అదా! నీ సందేహం" శారద నవ్వేసింది." కాలేజీ మానేసి వూరికే వున్నా కదూ ఈ మధ్య, అప్పుడు నేర్చుకున్నాను!"

"శారదా! నామూలంగానే నీ చదువాగి పోయింది కదూ!" బాధగా అన్నాడు.

"బావా! చదువాగిపోయి నందుకు నేనేం బాధపడటం లేదు. ఈ సంవత్సర కాలంలో నేనెన్ని పుస్తకాలు చదివానో లెక్కలేదు. కాలేజీలో నేను ఇన్నాళ్ళూ నేర్చుకున్న జ్ఞానం కంటే ఈ సంవత్సరంలో నేను పొందిన విజ్ఞానం ఎక్కువ. అంతేకాదు లలితసంగీతం కూడా నేర్చుకున్నాను. నేను కాలేజీలో చదివుంటే నాకీ రెండు వరాలు లభ్యమయ్యేవి కావు! ఏది జరిగినా మన మంచికే అంటారు ఇదేనేమో?"

శారద ప్రతిమాటా రవికి చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది. ఇంతటి మంచితనం –విశాల హృదయం అసలు ఎవరికేనా సాధ్యమేనా? శారదని కాదని తనిన్నాళ్ళూ ఎంత పొరపాటు చేశాడు. మనిషికి కావలసింది అందం కాదు! మంచిమనసు!

అందం అశాశ్వతం. ప్రేమ – అభిమానం శాశ్వతం! తనకు కళ్ళు పోయి వుండకపోతే ఈ సత్యాన్ని ఈ జన్మకు తెలుసుకునే వాడు కాదు.

తనపై ఎంతో ప్రేమ కురిపించిన సునీత ఇప్పుడీ ఛాయలక్కూడా రావడం లేదు! సునీతకు కావలసింది తను కాదు తన అందం – డబ్బు.... సునీత పేరు తలుచుకోవడమే మహా పాపం. ఆ వగలాడి తనకెంత మోసం చేసింది!

శారద అన్నట్టు–తనకు కళ్ళుపోవడం కూడా తన మంచికే జరిగింది. ఏది నకిలీయో! ఏది మేలిమి బంగ్గారమో తెలుసుకోగలిగాడు. తనకు కళ్ళు వచ్చినా ఆ దుర్మార్గుల గాలి కూడా సోకనంత దూరంగా వుంటాడు. ఇక తనకు శారద తోడిదే లోకం! ఆమే తనకు సర్వస్వం.

"ఏమిటి బావా ఆలోచిస్తున్నావ్!"

"ఏం లేదు శారదా!"

"కళ్ళు వస్తాయా! లేదా! అని ఆలోచిస్తున్నావా!"

"వుహుఁ! అది కాదు...." ఏదో చెప్పబోయాడు!

ఇంతలో మెట్ల మీద బూట్ల శబ్దం విన్పించడంతో ఆగిపోయాడు.

డాక్టరుగారు –రాఘవయ్యా– లక్ష్మీదేవి లోపలకు వచ్చారు!

"హల్లో రవీ! ఎలా వున్నావ్" డాక్టరు పలకరించాడు.

"మీరే చెప్పాలి సార్" అన్నాడు రవి నవ్వుతూ. డాక్టరు రవిని పరీక్ష చేసి–

"రవీ! చాలా త్వరగా ఇంప్రూవ్ అయ్యావ్! ఇంకో నాలుగు రోజుల్లో ఆపరేషను చేసేస్తాను" అన్నాడు.

ఆ మాటలకు అక్కడున్న వాళ్ళకు భయమూ– సంతోషమూ రెండూ కలిగాయి.

"డాక్టరు గారూ! బాబుకు కళ్ళు వస్తాయంటారా?"

"వస్తాయమ్మా! రవి ఇంత బాగా కోలుకుంటాడని నేననుకోలేదు. ఇతడిని చూస్తుంటే నాకు చాలా ధైర్యంగా వుంది. అందుకే నేనింత నమ్మకంగా చెప్పగలుగుతున్నాను. ఎలాగైనా మీరు మీ అబ్బాయి విషయంలో చాలా శ్రమ పడివుంటారు!" అన్నాడు లక్ష్మీదేవితో.

"లేదు డాక్టరుగారూ. ఇదంతా నా మేనకోడలి చలవండీ!" అంది శారద వేపు ఆదరంగా చూస్తూ!

"అలాగా! వయసులో చిన్నదయినా నర్సింగ్‌లో చాలా గొప్పదానివమ్మా!" అంటూ శారదని మెచ్చుకున్నాడు డాక్టరు.

శారద బిడియంగా తలదించుకుంది.

"ఇకనే వస్తాను. రవీ! డోంట్‌వర్రీ! నీకేం ఫర్వాలేదు". అని చెప్పి వెళ్ళిపోయాడు.

లక్ష్మీదేవి, రాఘవయ్యా ఆయన వెనకే వెళ్ళారు.

వాళ్ళు వెళ్ళాక శారద రవి దగ్గరికొచ్చింది.

"బావా! విన్నావా! డాక్టరుగారు నీకు కళ్ళు వస్తాయన్నారు." అంది సంబరంగా!

రవి ముఖం కూడా ఆనందంతో నిండిపోయింది.

"శారదా! ఈ క్రెడిట్ అంతా నీదే!"

"అలా అనకు బావా! ఇందులో నేను చేసిందేముంది!"

"నువు నాకెంత సేవ చేశావో నాకు తెలుసు! డాక్టరు గారు కూడా మెచ్చుకున్నారు కదా!"

"నా బావకోసం ఆ మాత్రం చెయ్యడం కూడా గొప్పేనా. అది నా బాధ్యత! నా సంతోషం!" అంది శారద!.

"శారదా!" ఉద్రేకంగా పిలిచాడు.

"బావా! కష్టం వచ్చినప్పుడే మనిషి అవసరం అయ్యేది! అప్పుడే అభిమానాలు. ఆప్యాయతలు బయట పడతాయి. నీకు సేవ చెయ్యడంలో నా స్వార్థం కూడా వుంది. నీకు కళ్ళు వస్తే......"

'మనం ఒకటవుతాం' అని చెప్పలేక సిగ్గుపడి ఆగిపోయింది.

"అప్పుడు మన జీవితాలు నందనవనాలు అవుతాయి కదూ!" అన్నాడు రవి నవ్వుతూ!

శారద సిగ్గుపడింది.

రవికే కళ్ళుంటే..... చిగురు టాకుల్లా వణికే పగడాల పెదవులనూ– కలల బరువుతో భారంగా వాలిపోయిన కాటుక కళ్ళ అందాన్ని తనివితీరా చూసే వాడేమో?

★ ★ ★ ★ ★ ★ ★

రవి ఆపరేషన్ విజయవంతంగా ముగిసింది.

కళ్ళకు కట్టు వూడదీసే రోజు– ప్రొద్దుటినుండీ లక్ష్మీదేవి, రాఘవయ్యా, శారదా రవి దగ్గరే వున్నారు. రవికి కళ్ళు రావాలని లక్ష్మీదేవి వెయ్యి దేవుళ్ళకి మొక్కుకుంటోంది. శారద మాత్రం రవికి తప్పకుండా కళ్ళు వస్తాయనే ధైర్యంతో వుంది.

పది గంటల ప్రాంతంలో డాక్టరు వచ్చి రవికి కట్టు వూడదీశాడు. దూదితో కళ్ళపై తుడిచాడు!

"నెమ్మదిగా కళ్ళు తెరు!" అన్నాడు.

రవి నెమ్మదిగా కళ్ళు తెరిచాడు.

"డాక్టర్! నాకేం కన్పించడం లేదండీ!"

లక్ష్మీదేవి గుండెల్లో రాయిబడినట్లయింది. శారదా– రాఘవయ్య కంగారుపడ్డారు.







డాక్టర్ రవి బుజం తట్టాడు.

"రవీ! జాగ్రత్తగా కళ్ళు తెరు. అంతా చీకటిగా వుందా! వెలుగేమి కన్పించడం లేదా?"

రవి నెమ్మదిగా కళ్ళు తెరిచాడు! మొదట చీకటి– తర్వాత అంతా తెల్ల తెల్లగా.. . తర్వాత.... మసగ్గా ఏవో ఆకారాలు....

మళ్ళీ కళ్ళు మూసి తెరిచాడు! ఆకారాలు స్పష్టమైన రూపాన్ని సంతరించు కున్నాయి!

హాస్పిటల్ తెల్లని గోడలు.... ఆ తర్వాత తన ఎదురుగా తెల్లని బట్టల్లో డాక్టరు.... స్పష్టంగా కన్పించారు.

"డాక్టర్! మీరు కనిపిస్తున్నారండీ!" సంతోషంతో కేకపెట్టాడు. అతని కేకకు హాస్పిటల్ అదిరి పోయింది!

డాక్టర్ చిన్నగా నవ్వాడు.

"రవీ అటు చూడు!"

రవి తల తిప్పి చూశాడు.

తల్లీ– తండ్రీ కన్పించారు.

"అమ్మా!" అన్నాడు.

లక్ష్మీదేవి పరుగున వచ్చి కొడుకుని కౌగలించుకుంది.

'బాబూ! నిజంగా నేను నీకు కన్పిస్తున్నానా! నా తండ్రీ! నీకు కళ్ళు వచ్చాయా?" రవి ముఖాన్ని నిమురుతూ ఆరాటంగా అడిగింది.

"అవునమ్మా! నువ్వూ – నాన్నగారు అందరూ కన్పిస్తున్నారు!"

రవి కళ్ళల్లోకి ప్రేమగా చూస్తోంది.

రాఘవయ్య డాక్టరు దగ్గరి కొచ్చి. "థాంక్యూ డాక్టర్! మా బాబుకి కళ్ళు తెప్పించారు. మీ ఋణం ఈ జన్మలో తీర్చుకోలేమండీ!" అన్నాడు.

"నాదేముందండీ! నా డ్యూటీ నేను చేశాను. కానీ, ఒక్క విషయం ఒక సంవత్సరం వరకూ కళ్ళకు ఎక్కువ బాధ కలిగించకూడదు. కళ్ళకు గానీ– తలకు గానీ ఎటువంటి దెబ్బా తగలకూడదు. ఎక్కువ శ్రమ కలిగించ కూడదు. రవీ వింటున్నావా!" అన్నాడు డాక్టర్.

"అయితే కాలేజీకి వెళ్ళొద్దంటారా!" రవి అడిగాడు.

"వెళ్ళొచ్చు! కానీ ఎక్కువ సేపు చదవ్వొద్దు! సినిమాలు– టి.వి.లు ఎక్కువగా చూడొద్దు! నేను మందులు రాసిస్తాను. అవి వేసుకుంటూ నేను చెప్పిన సూచనలు పాటించు. కనీసం ఆరు నెలలయినా వీటిని గట్టిగా పాటించాలి. నీ దుడుకు స్వభావం తెలుసు కాబట్టి ఇంతగా చెప్తున్నాను!" అన్నాడాయన నవ్వుతూ!

"అలాగే డాక్టర్! మీరు చెప్పినట్టే చేస్తాను! గుడ్డివాడి జీవితం ఎంత దుర్భరమో అనుభవపూర్వకంగా తెలుసుకున్నాను! మళ్ళీ ఆ జీవితాన్ని ఎలా కోరుకుంటాను డాక్టర్!"

"వెరీగుడ్! ఆ మాత్రం ఆలోచన వుంటే చాలు!" అని రాఘవయ్య వేపు తిరిగి –

"మీరు నా రూములోకి రండి మందులు రాసిస్తాను!" అన్నాడు డాక్టరు.

రాఘవయ్య డాక్టరు వెనక ఆయన రూములోకి వెళ్ళాడు.

డాక్టరు వెళ్ళిన వేపే చూస్తున్న రవి చూపులు హఠాత్తుగా నిలిచి పోయాయి. ఇందాకటి నుండి డాక్టరు అడ్డుగా వుండటం వలన చూడలేక పోయాడు.

ఆ అమ్మాయి....

నల్లని మచ్చలతో ....

బక్కచిక్కిన శరీరం. అస్థిపంజరం మీద చర్మం అతుక్కున్నట్టు.....

ఎవరా అమ్మాయి. వెంటనే మనసుకుతట్టింది. ఆ అమ్మాయి శారద కదూ! అవును శారదే!

"శారదా" అని పిల్చాడు.

ఆ పిలుపు కోసమే ఎదురు చూస్తున్నట్టుగా నిల్చున్న శారద– రవి పిలవగానే ఒక్క పరుగున వచ్చి రవి చేతిని పట్టుకుంది.

"బావా! చూశావా! నేను చెప్పలేదూ! నీకు కళ్ళు వస్తాయని! వచ్చాయి!" అంది ఆనందంగా.

రవి శారద చేతిని మెల్లగా అదుముతూ– "అవునా శారదా! అంతా నీ చలవే." అన్నాడు ఆమె వేపు కృతజ్ఞతతో చూస్తూ!

★ ★ ★ ★ ★ ★ ★ ★

రవికి కళ్ళు వచ్చాయనే వార్త యూనివర్సిటీ అంతా పాకి పోయింది. రవి కొన్నాళ్ళు హాస్పిటల్లో రెస్టు తీసుకుని ఇంటికి తిరిగి వచ్చాడు.

అతడు వచ్చిన మూడో రోజున రవి స్నేహితులు బిలబిలమంటూ వచ్చారు.

అప్పటికి సాయంత్రం అయిదుగంటలయింది. రవి, శారదా గుడికి వెళ్ళాలనే ప్రయత్నంలో వున్నారు.

రవి తయారయి కూర్చున్నాడు.

శారద పూజకు కావలసిన సరంజామా సిద్ధం చేస్తోంది.

"శారదా త్వరగా రావాలి" హాల్లో సోఫాలో కూర్చుని పిలుస్తున్నాడు.

ఇంతలో –

"హల్లో రవీ! గుడీవినింగ్" అన్న మాటలు విని తల తిప్పి చూశాడు.

రవి స్నేహితులు లోపలకు వచ్చి అతడి చుట్టూ చేరారు.

"రవీ! ఎలా వున్నావ్?" ఆప్యాయంగా అడిగారు.

రవి ముఖం చిట్లించాడు.

"ఇన్నాళ్ళకి నేను జ్ఞాపకం వచ్చానన్నమాట" కోపంగా అన్నాడు.

"రవీ! చెబితే నువ్వు నమ్మవుగాని– నువ్వు గుర్తుకు రాని క్షణం లేదురా! కానీ ఏం చేసేది. ప్రొఫెసరుగారు రోజుకో పరీక్ష పెట్టి చంపాడురా! అక్కడికీ నువ్వు హాస్పిటల్లో వుండగా రెండు సార్లు వచ్చాంరా! కానీ డాక్టరు చూడటానికి వీల్లేదు పొమ్మన్నాడు. తర్వాత ఇంటికొద్దామనుకున్నాం! కానీ అసలే నువ్వు

బలహీనంగా వున్నావు. మేము వచ్చి నిన్ను హైరాన పెట్టడం దేనికని రాలేదురా. ప్రతి నిముషం నీకోసం ఆ దేవుడిని ప్రార్థిస్తూనే వున్నాము. నీకు త్వరగా కళ్ళు రావాలని ఎన్నో మొక్కులు మొక్కాం. ఆ దేవుడి దయవల్ల మా ప్రార్థనలు ఫలించి నీకు కళ్ళు వచ్చాయి. ఇప్పుడు మాకెంత ఆనందంగా వుందో తెలుసా! రవీ, నీపేరున గుళ్ళో పూజ చేయించాం! ఇదుగో ప్రసాదం" అంటూ రవి చేతిలో చిన్న కొబ్బరి ముక్కను వుంచారు.

"రవీ! నువ్వు లేకపోతే యూనివర్సిటీ అంతా వెలవెలబోతోంది. మాకసలు ఏం తోచడం లేదు. రవీ! రేపటి నుండే యూనివర్సిటీకి వచ్చెయ్యరా!" రవి స్నేహితుడు ప్రసాద్ అన్నాడు.

రవి వాళ్ళ మాటలకు పొంగిపోయాడు. వాళ్ళ మీద వున్న కోపం మంచులా కరిగిపోయింది!

"అలా నిలబడే వున్నారు కూర్చోండిరా", అన్నాడు రవి ఆదరంగా!

అందరూ కూర్చున్నారు.

"రవి ఇప్పుడెలా వుంది నీకు", అనడిగాడు విశ్వం.

"బాగానే వున్నాను"!

"రవీ, యూనివర్సిటీకి ఎప్పటి నుండి వస్తావ్".

"ఎల్లుండి మంచిదిట! ఆరోజు నుండీ వస్తాను. మన యూనివర్సిటీ విశేషాలేమిట్రా!"

"రవీ ! యూనివర్సిటీ ఎలక్షనులు జరగబోతున్నాయి. బహుశ ఈ నెలలోనే వుంటాయి. మేమందరమూ ప్రెసిడెంటుగా నీపేరు సజెస్ట్ చేశాం! నువ్వు కాదనకూడదు" అన్నాడు శర్మ!

ఆ మాటలకు రవి లోలోపల చాలాఆనందించాడు. కానీపైకి–

"నేనెందుకురా! ఇంకెవరి పేరయినా చెప్పాలిసింది" అన్నాడు రవి.

మన ఫైనల్ స్టూడెంట్లలో నువ్వుతప్ప ఎవరున్నారు? నువ్వు డాషింగ్-డైనమిక్ హీరోవి"! పొగిడేశారు.

రవి వాళ్ళ పొగడ్తలకు పుప్పొంగిపోయాడు.

"రవీ ! నువ్వు తప్పకుండా గెలుస్తావు. మేమందరమూ నీ తరఫున ప్రచారం చేసి నిన్ను గెలిపిస్తాం" అన్నాడు ప్రభాకర్.

"రవీ! నీకు పోటీగా ఎమ్. ఎ. ఎకనామిక్స్ స్టూడెంటు గోపాల్‌గాడు నిలబడుతున్నాడు. కానీ వాడు ఓడిపోవడం ఖాయం". అన్నాడు ప్రసాద్!

"నీకేం భయం లేదురా! నువ్వలా కూర్చో! నిన్ను గెలిపించే పూచీ మాది". దృఢంగా చెప్పారు .

రవికి వారి మాటల్తో చాలా వుత్సాహం కలిగింది. వారికి తనపై వున్న అభిమానానికి ఆనందపడుతున్నాడు. అప్పుడే తను ఎన్నికల్లో గెలిచినట్టుగా గర్వపడ్డాడు!

"రవీ! ఒక చిన్న విషయం!"




"ఏమిట్రా?"

"ఒక చిన్న పార్టీ అరేంజ్ చేద్దామనుకుంటున్నాం!"

"ఎందుకూ?"

"అదేం ప్రశ్న! చాలా కారణాలున్నాయి. ఒకటి నీకు కళ్ళు వచ్చినందుకు! రెండు నువ్వు ఎలక్షన్లలో నిలబడుతున్నందుకు! మన ఫ్రెండ్సందరికీ చెప్పి నీ తరఫున ప్రచారం చేసి నిన్ను గెలిపించేట్టు చెయ్యమంటాం! రవీ! ఈ కాలంలో ప్రతి పనికీ పబ్లిసిటీ అవసరంరా! మనం ఇలా పబ్లిసిటీ ఇచ్చామంటే ఆ గోపాల్‌గాడు కంగారుపడిపోయి పోటీ నుండి విరమించుకోవచ్చు! అప్పుడు గెలుపు నీదే కదా!" అన్నాడు శర్మ.

ఆ మాటల్లో చాలా నిజం వుందనిపించింది రవికి! వాళ్ళ సూచనకు వెంటనే అంగీకరించాడు.

"అలాగేరా! మీ ఇష్టం వచ్చినట్టు కానివ్వండి" అన్నాడు.

వాళ్ళందరూ ఆనందపడి పోయారు.

"రవి జిందాబాద్" అంటూ అరిచారు.

రవి నవ్వుతూ "ఇది ఇల్లురా! రోడ్డుకాదు. మా అమ్మ వింటే తిడుతుంది!" అన్నాడు.

"రవీ ! ఇలా గొంతు చించుకుని అరిచినందుకు గుక్కెడు కాఫీనీళ్ళయినా మా గొంతులో పొయ్యరా!"

"తప్పకుండా" రవి లోపలకు వెళ్ళి అందరికీ కాఫీ, టిఫిన్లు తెప్పించాడు.

అందరూ ప్లేట్లు – కప్పులు ఖాళీ చేశారు!

"రవీ! పార్టీ ఏర్పాట్లకి కాస్త డబ్బు కావాలిరా." ప్రసాద్ నసిగాడు.

రవి లోపలకు వెళ్ళి రెండువందలు తెచ్చి ఇచ్చాడు. "ప్రస్తుతానికి ఇది వుంచండిరా! ఇంకా కావాలంటే తర్వాత ఇస్తాను"! అన్నాడు.

"అలాగే - అలాగే" సంతోషపడిపోయారు.

"రవీ! పార్టీ రేపు సాయంత్రమే వుంటుంది."

"రేపేనా!"

"అవునురా! ఇటువంటి విషయాల్లో ఆలస్యం పనికి రాదు", అన్నాడు ప్రభాకరం!

"సరే! మీ ఇష్టం".

"ఇకమేం వెడతాం రా! పార్టీ అరేంజ్‌మెంట్లు చూసుకోవాలిగా! రేపు వుదయం నీకు ఫోను చేస్తాం", అంటూ వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళడం చూసి– శారద హాల్లోకి వచ్చింది.

"వెళ్ళారా! మీ వానరసైన్యం" అంది.

రవి నవ్వాడు

"శారదా! నేను యూనియన్ ప్రెసిడెంట్‌గా పోటీ చేస్తున్నాను. మా వాళ్ళు నన్ను గెలిపిస్తారుట! పాపం నాకోసం ఎంత కష్టపడుతున్నారో! నిజమైన స్నేహితులంటే వీళ్ళే శారదా" అన్నాడు.

రవి మాటలకు శారద మనసులో నవ్వుకుంది. వీళ్ళనే ఒకప్పుడు రవి స్వార్థపరులని– మోసగాళ్ళని తిట్టాడు. వాళ్ళేవో నాలుగు తియ్యటి కబుర్లు చెప్పగానే వాళ్ళని పొగుడుతున్నాడు. బావ మనస్సు చాలా చిత్రమైంది.

"ఏమిటి శారదా ఆలోచిస్తున్నావ్".

"ఏం లేదు బావా! మరిక మనం గుడికి వెడదామా!" అంది.

"ఏడుదాటింది. ఇంకేం వెడతాం శారదా!"

"అత్తయ్య గూడా బయలుదేరింది. ఇవ్వాళ గుడిలో పూజ చేయించాలిట. వద్దంటే బాధపడుతుంది! కారులో వెడితే సరి! అయిదునిముషాల్లో చేరుకుంటాం"! అంది.

"సరే! నీ ఇష్టం! అమ్మని రమ్మను". అంటూ లేచాడు రవి.

శారద లక్ష్మీదేవిని పిలుచుకు రావడానికి లోపలకు వెళ్ళింది!

(ఇంకా ఉంది)




### ఎన్. ఆర్. ఎస్. కె. అనంతపురం

★ నేను ఒక అమ్మాయిని ప్రేమించాను. అమె కూడా నన్ను ప్రేమించింది. మా యిద్దరి మధ్య శారీరక సంబంధం కూడా వుంది...

● చూశారా? అదే 'ప్రేమంటే సెక్సు' అని నేనంటే – తిట్టి పోస్తారు! పెళ్ళికి కనీసం సెక్సునైనా మిగుల్చుకోకపోతే – ఇక ఆ బంధానికి అర్థం ఏమిటయ్యా? ప్రేమించుకుంటే స్నేహితుల్లా ఉండాలి- పెళ్ళాడితే దంపతుల్లా వుండాలి. .

### టి. కె; టి. హెచ్. ఆర్–తో గుమ్మి

★ మీరు ఎవరేం విమర్శలు చేసినా చలించక చక్కని సమాధానాలిస్తున్నారు. మా అభినంద నలు.

● విమర్శలంటే భయందేనికి? అందరినీ ఒకేలా మెప్పించేలా రాయడం – ఎవరి తరం కాదు అందుకే –నేను ఎవ్వరేమన్నా నా ధోరణిలో నే నడుస్తాను

### సీత–విస్సన్నపేట

★ రామలక్ష్మిగారూ నీటికి కన్నీటికి తేడా ఏమిటి?

● ఒకదాల్లో కరుణ వుంది. ఇంకొకదాల్లో జీవం వుంది. కన్నీళ్ళు తాగితే దాహం తీరదు. అంచేత ఎవరినీ ఏడిపించకు సీతా!

### కె. ఎల్. వి; కె. ఆర్. ఎం. పాలకొండ

★ బాగా ధర పలికే దాకా వుంచి అబ్బాయిలను అప్పుడు అమ్మే తల్లితండ్రులను, అమ్ముడు పోడానికి సిద్ధపడే అబ్బాయిలను.... మీ అభిప్రాయం?

● నా కలాంటి వాళ్ళు తారసపడలేదు. అదృష్టవంతురాలినే లేకపోతే చదువూ సంధ్యలకి బదులు గిట్టలూ సుళ్ళూ చూడవలసి వచ్చేది!!

### బి. ఎస్. కె. బోడసకుర్ర

★ నేను ఒక అమ్మాయిని లైక్ చేశాను. చెప్పాను. ఆ అమ్మాయి నిన్ను బ్రదర్ అనుకొంటాను అంది. నేను ఆ అమ్మాయిని తప్ప ఎవరినీ లైక్ చెయ్యను.

● దాందేముంది? మోసపోయిన ప్రేమికుడిగా స్నేహితుల సింపతీ సంపాదించుకో బ్రదర్. అదొక్కటే దారి. బ్రదర్‌గా చూస్తే ప్రేమికుడిగా చూడలేదనే కదా అర్థం?!

### ఎం. ఆర్. కె. బోధన్

★ కులమత బేధాలెందుకు అంటారు. మరి యీ ఎఫ్ సి, బి. సి, ఎస్ సి, ఎస్ టిలు ఎందుకు?

● కులమత బేధాలు అక్కరలేదు మనకి. రాజకియ నాయకులకి కావాలి. అవే వాళ్ళ ఓటు బ్యాంకులు. అంచేత నైతికంగా కూడదనేవి రాజకియంగా నేర్పుగా కావాలి అంటారు.

### ఆర్. కె. పెద్దాపురం

★ చాడీలు చెప్పడం అనే మాట ఆలకించే వుంటారు. అత్తాకోడళ్ల మధ్య యివి తప్పవు.

● ఆడాళ్లే చాడీలు చెప్తారనుకుంటున్నారా? ఇవి ఎక్కువగా మగాళ్లే చెప్పుకుంటారు!

### వి. బి. ఆర్. గంభీరావుపేట

★ రామలక్ష్మిగారూ వనితలంటే ఎవరు? సినిమాలలో నటించే వారు వనితలు అనబడరా? వారు డబ్బుకి అమ్ముడుపోయిన వనితలని అర్థమా? బోలో జీ.

● మధ్యన ఆ 'బోలోజీ' లెందుకు! ఉద్యోగం చేసే వాళ్ళు జీతానికి అమ్ముడుపోయినవారని మీరు అర్థం చెప్పుకుంటే – నటీమణులూ అంతే– కోటి విద్యలు కూటి కోసం అన్న మాట వినలేదా? ఎవరి వృత్తినైనా చిన్నచూపు చూసే హక్కు ఎవరికీ లేదు.

### వి. ఎస్. ఎమ్మిగనూరు

★ వర్ణాంతర వివాహాలపై మీ అభిప్రాయం?

● ఇష్టమై చేసుకుంటే గొడవలేదు. కాని ఏదో సంఘ సేవ చేస్తున్నామని చేసుకోవడం మంచిదికాదు.

★ మీ జవాబులు ఘాటుగా వుంటాయి?

● కాస్త మిరియాలెక్కువ వాడతాను మంచిదని.

★ ప్రేమించి పెళ్లాడడంపై మీ అభిప్రాయం?

● ప్రేమించి పెళ్లాడగానే సరికాదు. పెళ్ళయ్యాక కూడ ఈ ప్రేమని గౌరవంగా చూడగల్గాలి.

★ ఈనాడు సినిమాలో హీరో హీరోయిన్‌ల కథ వుంటుందేమో గాని సమాజానికి సంబంధించినది ఏది వుండదు?

● ఇంకా నయం - హీరోయిన్‌కి కాస్త స్థలం వుంచుతున్నారు సంతోషించండి. ఏమాత్రం అవకాశం వున్నా అంతా హీరోయే వుంటాడు. సినిమారంగంలో వున్నంత పురుషాహంకారం మరెక్కడా మీకు కన్పించదు.

### కె. ఆర్. ఎన్. గుణుపురం

★ ఈ రోజులలో విద్య గొప్పదా? వృత్తి గొప్పదా?

● తిండి పెట్టని విద్యకంటే తిండి పెట్టే వృత్తి ఎప్పుడూ గొప్పదే.

### ఎమ్. ఎస్. నర్సీపట్నం

★ ఆడవారికి పెళ్లి అయినట్టు లైసెన్సు గుర్తు మంగళసూత్రాలు. అదే విధంగా మగవారికి కూడా గుర్తు పెడితే?

● మీకే వాటి మీద విలువలేదని తెలుస్తోంటే -వాళ్లకి ఎందుకు బంగారం దండుగ!

### కె. జి. వి. ఎల్. పిట్లవేమవరం

★ మగ మహారాజులు వేలకు లక్షలకు అమ్ముడుపోతూ మరి ఆడవాళ్ళని 'అంగడి బొమ్మ' అంటారేంటి?

● 'కొనుక్కొని' పొందుతారు కనుక అలా అంటారు. వాళ్ళు అమ్ముడు పోతున్నారే గాని కొనుక్కోం కదా! అది తేడా. □






# పుష్పవిలాపం

కాకాని కమల

"(స) రోజా సీరియస్. స్టార్ట్ ఇమిడియట్లీ"

—జగన్నాధం.

టెలిగ్రాం చదువు కున్న రవీంద్ర గుండె ఒక్క క్షణం ఆగి తిరిగి రెట్టింపు వేగంతో కొట్టుకో సాగింది.

తుఫానులో చిగురాకులా ఆపాదమస్తకం కంపించి పోయాడు.

ఒక విధమైన ఉద్వేగంలో శరీరం లోని రక్తం వురుకులెత్త సాగింది.

కళ్ళముందంతా నల్లగా చీకటి వలయాలు....

కాళ్ళ కింద నేల జారిపోతున్నట్లు అనిపించి నిస్సత్తువతో ప్రక్కనే వున్న కుర్చీలో జార్లపడ్డాడు.

అతని మెదడంతా సన్నని హోరు.....

పోటెత్తిన సముద్రంలా మనసంతా ఒక విధమైన అలజడి.

"(స) రోజా సీరియస్ స్టార్ట్ ఇమిడియట్లీ."

—జగన్నాధం.

కళ్ళు విప్పార్చుకుని మళ్ళీ ఒక్కసారి చేతిలోని ఎర్రని కాగితాన్ని చదువు కున్నాడు.

"..... ఏమిటి? రోజాకి సీరియస్‌గా వుందా? ఇంత హఠాత్తుగా అంత ముంచుకు వచ్చిన ప్రమాదం ఏమిటి? సరిగ్గా ఇరవై రోజుల క్రితమే కదా మావయ్య గారి వూరు వెళ్ళి వచ్చాడు తను? సరోజ ఆరోగ్యంగా చెలాకీగా వుంది. పదిహేడేళ్ళ పరువంతో మిసమిస లాడి పోతూంది. ఆమెకి నలతగా వున్నట్లు కూడా తనతో కనీస మాటగా నైనా ఎవరూ అనలేదు. ఇంతలోనే అంత ముంచుకు వచ్చిన ప్రమాదం ఏమిటి? మావయ్య ఇంత అర్జంటుగా తనని బయలుదేరి రమ్మని ఎందుకు టెలిగ్రాం ఇచ్చాడు?"

రవీంద్ర భ్రుకుటి ముడి పడింది.

అతని మెదడంతా పాముల బుట్టలా తయారయ్యింది.

చిక్కు పడిన దారాల్లా ఆలోచన్లు ఎటూ తెగటంలేదు.

సరిగ్గా వచ్చే వారం నుంచి మెడిసన్ ఆఖరి సంవత్సరపు పరీక్షలు.

వూపిరి తియ్యటానికి కూడా వ్యవధి లేనంత బిజీగా వున్నాడు. కాలు కదపటానికి వీలు లేని పరిస్థితి.

కాని చేతిలో టెలిగ్రాం చూస్తూ వెళ్ళ కుండా మాత్రం ఎలా వుండగలడు?

మామయ్యకి మాత్రం తెలియనిదా తన పరీక్షల సంగతి?

అయినా అర్జంటుగా బయలు దేరి రమ్మని టెలిగ్రాం ఇచ్చాడంటే సరోజ పరిస్థితి ఏదో ప్రమాద కరంగానే వుండి వుండాలి.

ఆ మధ్య ఒకసారి అత్తయ్య కాబోలు అంది.

"రోజా ఈ మధ్య తరచూ కడుపు నొప్పి అంటోందయ్యా, ఒకసారి పరీక్ష చేయించాలి". అని!

బహుశా అదేమన్నా సీరియస్ అయి ఏ "ఆపెండిసైటిస్" ఆపరేషన్ కైనా దారితియ్య లేదుకదా?........

అసహనంగాముని వేళ్ళతో కణతలు నొక్కుకున్నాడు రవీంద్ర.

ప్రక్కనే వున్న రైటింగ్ టేబిల్ నిండా మెడిసన్ పుస్తకాలు దొంతర్లు దొంతర్లుగా పేరుకుని వున్నాయి. అందులో సగం లైబ్రరి నుండి పట్టు కొచ్చాడు. త్వరలో రిటన్ చెయ్యాలి.

మరొక ప్రక్క అతను కష్ట పడి ప్రిపేర్ చేసుకున్న నోట్సు తాలూకు కాగితాలు "క్రేలో" పేపరు వెయిట్ కింద నలుగు తున్నాయి.

పగలూ రాత్రి కూర్చుని చదువుతున్నా సమయం చాలటం లేదు.

ఈ పరిస్థితిలో ప్రయాణం ఏమిటి?

కాని.......

కాని తన రోజాకి .... తన ప్రియాతి ప్రియమైన రోజాకి సీరియస్‌గా వుందని తెలిసి వెళ్ళకుండా మాత్రం వుండగలడా?

అసహనంగా ముని వేళ్ళతో కణతలు రుద్దుకుంటూ ఆలోచన్ల భారంతో నెమ్మదిగా తల ఎత్తాడు రవీంద్ర

ఎదురుగా .... టేబిల్ మీద వున్న పెద్ద ఫోటో కేస్‌పై అతని దృష్టి నిలిచి పోయింది.

లైఫ్ సైజులో రోజా కలర్ ఫోటో విరిసిన గులాబిలా అందంగా చిరునవ్వులు చిందిస్తోంది.

తుమ్మెద రెక్కల్లా రింగులు రింగులు తిరిగి బొద్దుగా వున్న రెండు జడలు .... లేత గులాబి రంగు ఆఫ్ శారీ, నల్ల జాకట్టు, మీనాల్లా సోగలు దేరిన కళ్ళతో కొంటె నవ్వులు చిందిస్తూ రవీంద్ర కేసి చిలిపిగా చూస్తున్నట్లు వుంది ఆ ఫోటో.

రవీంద్ర ఆర్తిగా ఆ ఫోటోని చేతుల్లోకి తీసుకుని తమకంగా పెదాలకి ఆనించుకున్నాడు

కళ్ళనిండా గిర్రున నీళ్ళు తిరిగాయి.

మనసు చల్లగా ఆర్ద్రం అయ్యింది.

"రోజా! ఏమైంది నీకు?"

తలతిప్పి గడియారం కేసి చూశాడు. సమయం పది గంటలు దాటుతోంది లాస్ట్ బస్ పదిన్నరకి వుంది. ఆ బస్సు కేచ్ చేస్తే తెల్లారకుండా రోజా ముందు వుంటాడు

అంతే!

ఆ ఆలోచన రావటం తోటే గభాల్న కుర్చీలోంచి లేచాడు రవీంద్ర

చిందర వందరగా పడి వున్న పుస్తకాలన్ని తీసి ఒక ప్రక్కకి సర్దాడు. కిటికి రెక్కలు మూశాడు

బ్రీఫ్ కేస్ తెరిచి ఒక జత బట్టలు పెట్టాడు చల్లని నీళ్ళతో మొఖం కడుక్కొని డ్రెస్ అయ్యాడు.

పది నిమిషాల్లో ప్రయాణానికి సిద్ధం అయి గదికి తాళం పెట్టి హడావుడిగా రోడ్డు మీదకి వచ్చాడు.

ఆటో ఎక్కి వేగంగా బస్‌స్టాండ్ చేరుకున్నాడు.

అప్పటికే లాస్ట్ బస్సు స్టేజీలో బయలుదేరటానికి సిద్ధంగా వుంది.

కండక్టర్ని రిక్వస్టు చేసి పరుగున వెళ్ళి టిక్కట్టు తీసుకుని కదులుతున్న – బస్సులోకి ఎక్కి కూర్చున్నాడు.

లాస్ట్ బస్సు కావటంతో బస్సు కొంచెం ఖాళీగానే వుంది.

పావు గంటలో బస్సు ఊరి పొలిమేర దాటింది. నగర శివార్లు దాటగానే బస్సులో లైట్లు ఆరిపొయ్యాయి. ప్రయాణీకులు ఒకరొకరే తమ సీట్లలో నిద్రకి వుపక్రమించసాగారు.

చల్లటి గాలి తెరలు తెరలుగా వీస్తోంది.

అమావాశ్య రోజులు కావటంతో బయటంతా చీకటి చిక్కగా వుంది.

## కొత్త కారు కొంటే!

ఒక మిత్రుడు, ఉన్న పాతకారును
వదలి కొత్తగా రోల్సురాయిస్ కారు
కొనుక్కున్నాడు నానా ఇబ్బందులూ పడి
మంత్రిగారు వచ్చారు.
మీ కారు ఈ రోజు
ఇవ్వండి అన్నారు కలెక్టరుగారు
ఇవ్వక తప్పదు. లేకపోతే
ఏ కేసులో నో ఇరికిస్తాడు.
ఆ రోజు గడిచింది
మరొక రోజున
మా ఇంట్లో పెళ్ళి
అన్నాడు జిల్లా జడ్జి
ఇవ్వకపోతే ఎలా?
ఇచ్చాడు. ఇంత పసుపూ
కుంకుమా పారాణీ పూసి
ఇచ్చారు పెళ్ళి అయాక
మూడో నాడు
నా మిత్రుడు కారు
అమ్మేస్తానన్నాడు
'మంచి పని చెయ్యి'
అన్నాను. మళ్ళీ పాత కారు
వచ్చింది ఎవరూ దాన్ని
కావాలనటం లేదు.

— ఎం. ఎస్. ఎం.

## పుష్పవిలాపం

బస్సులో కూర్చున్నా రవీంద్రకి స్థిమితం చిక్కలేదు. మనసంతా ఒక విధమైన ఉద్వేగం. అలజడి! చల్లగా చలిగాలులు వీస్తున్న వూపిరి ఆడనట్లుగ వుంది.

కడుపంతా మంట రగులుతున్నట్లు ఏదో . అంతు చిక్కని సన్నని వేదన.

మాటి మాటికి టెలిగ్రాంలోని ఎర్రటి అక్షరాలే కళ్ళ ముందు కదులుతున్నాయి.

బస్సులో అంతా నిద్రకి జోగుతున్నా అతనికి మాత్రం రెప్పమూత పడటం లేదు.

కళ్ళు విప్పార్చుకుని అలాగే కిటికీల్లోంచి బయట చీకట్లోకి చూస్తూ కూర్చున్నాడు.

ఆ నల్లని చీకటిలో సయితం సన్నటి చిరునవ్వుతో రోజా రూపం కనిపిస్తోంది.

అందమైన ఆమె గులాబి వన్నె చెక్కిళ్ళు, ఎర్రని మొగ్గల్లాంటి పెదవులు, సోగలు దేరిన చిలిపి కళ్ళు, తియ్యగా నవ్వుతూ ...."రవీన్ .." అని పిలుస్తున్నట్లే అందమైన అనుభూతి

"లవ్ ఈజ్ టు హార్ట్స్ మ్యూజిక్ ఇన్ వన్‌సాంగ్" అన్నట్లు ఆమె తలపు మాత్రానికే అణువు అణువునా అనిర్వచనీయమైన ఆనందం!

"రో...జా?" రవీంద్ర పెదవులు కలవరింతగా అస్పష్టంగా పలికాయి.

వేదనగా కళ్ళు మూసుకున్నాడు.

★ ★ ★ ★

జగన్నాథం రవీంద్రకి స్వయాన మేనమామ. ఆయన ఒక్కగానొక్క గారాల కూతురు సరోజ.

సరోజ పుట్టినపుడు ఎర్రగా నెత్తురు కక్కుతూ గులాబి మొగ్గలా అందంగా వుండేది. అందుకే అంతా – "రోజా...రోజా పువ్వులా వుంది" అన్నారు క్రమంగా ఆ పేరే స్థిరపడింది.

కాంతివంత మైన ఆమె గులాబి రంగు శరీరచ్ఛాయ, సోగలు దేరిన కళ్ళు..... ఒంపు తిరిగిన సన్నని పెదవులు, చెయ్యి తిరిగిన చిత్ర కారుడు తీర్చి దిద్దిన బొమ్మలా వుంటుంది సరోజ.

చిదిమి దీపం పెట్టవచ్చా అనేటంతటి అందం ఆమెది

దానికి తోడు జగన్నాథం పెద్ద మోతుబరి రైతు సరోజ ఒక్కగనొక్క బిడ్డ కావటంతో అపురూపమైన పెంపకం.

రోజా పుట్టగానే "రవీన్" కి భార్య పుట్టింది అన్నారు.

ఆ అనుబంధం తోనే ఇన్నాళ్ళూ పెరిగారు.

సరిగ్గా రెండు నెల్ల క్రితమే రవీంద్ర తల్లి తండ్రులు వచ్చి సరోజకి–పూలు పళ్ళు ఇచ్చి ప్రధానం జరిపించారు

ప్రస్తుతం రవీంద్ర మెడిసన్ ఆఖరి సంవత్సరం లోకి వచ్చాడు

అతని పరీక్షలు పూర్తి కాగానే వచ్చే వేసవిలో ఇద్దరికి పెళ్ళి ముహూర్తం పెట్టి లగ్న పత్రిక కూడా వేశారు.

రోజా బి. ఎస్సి ఆఖరి సంవత్సరంలోకి వచ్చింది.

రవీంద్ర కాలేజికి టర్మ్ హాలిడేస్ ఇచ్చినప్పుడల్లా ముందు మేనమామ ఇంటికి వెళ్ళి రోజాతో నాల్గు రోజులు సరదాగా గడిపి ఆ తరువాతే తమ వూరికి వెళతాడు

ఇద్దరూ తరచూ ఉత్తరాలు రాసుకుంటారు.

కేవలం పెద్దలు కుదిర్చారనే కాక ఇద్దరికి ఒకరిపై ఒకరికి వల్లమాలిన మమకారం. అలివికాని ప్రేమ. బావా–మరదళ్ళ తియ్యని అనుబంధం.

రవీంద్రకి ఆమె వూహే ఒక అందమైన అనుభూతి.

ఆమె తలపులే వెన్నెల జల్లులు.

ఆమె సమక్షంలో మల్లెపూల పరిమళంలా ఒక మత్తు ఆవరిస్తుంది అతన్ని.

....."ఏల సలిలంబు పారు గాడ్పేల విసరు?
ఏల నా హృదయమ్ము ప్రేమించా నిన్ను?–".....

అన్నంత సహజంగానూ ఇద్దరి హృదయాలూ ఏకమయ్యాయి.

పరీక్షలు అయ్యేదాకా వెళ్ళటం కుదరదని క్రిందటి నెల్లోనే ఏవో నాల్గు రోజులు సెలవులు కల్సివస్తే మేనమామ ఊరికి వెళ్ళి సరోజని చూసి వచ్చాడు రవీంద్ర

సరిగ్గా ఇంకొక వారం రోజుల్లో రవీంద్రకి ఆఖరి సంవత్సరపు మెడిసన్ పరీక్షలు మొదలవుతాయి.

ఆ సంగతి జగన్నాథం కి తెలియని విషయం కాదు.

అయినా.......

వెంటనే బయలు దేరి రమ్మని టెలిగ్రాం ఇచ్చాడంటే నిజంగానే సరోజకి సీరియస్‌గా వుండి వుండాలి. ఏదో ప్రమాదం జరిగి వుండాలి.

రవీంద్ర మనసు మనసులోలేదు.

ఎందుకో "కీడు" శంకిస్తుంది.

కడుపంతా నిప్పు రాజుతున్నట్టు వుంది.

రోజా!

తన మనసులో మనసు.

ప్రాణంలో ప్రాణం......

అలాంటి తన రోజాకి ప్రమాదంగా వుందంటే ఎంత పరీక్షలు అయితే మాత్రం తను వెళ్ళకుండా వుండగలడా? రోజా కంటే ఈ లోకంలో తనకి ఏదీ ఎక్కువ కాదు. అన్నీ ఆమె తరువాతే. రోజా దగ్గర్నించి ఉత్తరం రావటం ఒక్క రోజు ఆలస్యం అయితే చాలు..... తన మనసు పుస్తకం మీద లగ్నం కాదు.

"ప్రేమ" అన్న అందమైన పదానికి తన గుండెలో అర్థం స్ఫురింప చేసింది రోజాయే కదా?

వెన్నెల లోని చల్లదనం, కోయిల పాటలోని తియ్యదనం..... తనకి రోజా సాన్నిహిత్యం లోనే లభించాయి.

అలాంటి తన రోజాకి ఏమయ్యింది?

ఆలోచన్ల మధ్య సతమత మవుతూ అలసటగా కళ్ళు మూసుకున్నాడు రవీంద్ర.

అలా.... ఎంత సేపున్నాడో అతనికి తెలియదు.

ప్రయాణీకుల హడావుడి, కండక్టర్ కేకలకి , "కూలీ...... కూలీ..... " అన్న అరుపులకి గభాల్న మెళకువ వచ్చి కళ్ళు తెరిచాడు.

బస్సు గమ్యాన్ని చేరింది.

వేగు చుక్క పొడిచింది.

తూరుపు క్రమంగా తెల్ల బారుతోంది. రవీంద్ర బ్రీఫ్ కేస్ పట్టుకుని హడావుడిగా బస్సు దిగాడు.

★ ★ ★ ★ ★ ★

రవీంద్ర వెళ్ళేసరికి మేనమామ జగన్నాథం వీధి వసారాలో మంచంలో కూర్చుని చుట్ట తాగుతున్నాడు.

వసారాలో చిన్న లైటు వెలుగుతూంది.

లోపల వంట గదిలోనుంచి గిన్నెల శబ్దం వాటితోపాటే కమ్మటి కాఫీ డికాషన్ సువాసనలు వస్తున్నాయి.

చేతిలో చిన్న సూట్‌కేస్‌తో లోపలికి వస్తున్న రవీంద్రని చూసి జగన్నాథం గభాల్న మంచం దిగి పెద్ద లైటు వేశాడు.

మేనల్లుడ్ని చూడగానే ఒక్క క్షణం ఆనందమో దుఃఖమో తెలియని ఉద్వేగంతో కదిలినట్లు అయ్యాడు.

ఆయన మొఖంలో నెత్తురు విరిగింది.

ఇంక రవీంద్ర ఆతృత పట్టలేక పొయ్యాడు.

చేతిలో బ్రీఫ్‌కేస్ కిందపెట్టి చుట్టూ కలయ చూస్తూ ఖంగారుగా అడిగాడు.

"మావయ్యా? రోజా ఎక్కడ? ఆమెకేమయింది?"

అంతే!

తరతరాలుగ గెడ్డకట్టిన హిమాలయం కరిగి నీరయినట్టు ఆ చిన్న పరామర్శకే దుఃఖంతో కదిలి పొయ్యాడు జగన్నాథం.

కళ్ళనిండా ఎర్ర జీరలు అలుముకున్నాయి. దుఃఖాన్ని ఆపుకుంటున్నట్టు ఆయన దవడ ఎముకలు బిగుసుకున్నాయి.

గభాల్న నోట్లో చుట్ట గిరాటేసి రెండు చేతుల్తోటి రవీంద్రని గట్టిగా కౌగలించుకున్నాడు.

ఆయన కళ్ళనుండి వెచ్చటి కన్నీరు జలజలా రాలిపోతూంది.

భుజంమీది తువ్వాలుతో కళ్ళు తుడుచుకొని రుద్ధకంఠంతో అన్నాడు.

"ఏం చెప్పమంటావ్ రవీ! ముందు నువ్వు ఇలా కూర్చో...." అంటూ మేనల్లుడి చెయ్యిపట్టుకుని మంచంమీద కూర్చోపెట్టాడు.

ఇంతలో వసారాలో అలికిడికి వంటగదిలోంచి ఇవతలికి వచ్చిన తులసమ్మ మేనల్లుడు రవీంద్రని చూస్తూనే కొద్ది క్షణాలు నోటమాట పడిపోయినట్టు స్థంభించి పోయింది.

రవీంద్ర అయోమయంగా చూశాడు.

"అత్తయ్యా! రోజా ఎక్కడ? అసలు ఆమెకేమయింది? నన్నింత అర్జంటుగా ఎందుకు రమ్మన్నారు?"

"అంతే!

వ్రేళ్ళతో సహా పెకిలించబడ్డ మహా వృక్షంలా నిలువునా కుప్పకూలిపోయింది తులసమ్మ దుఃఖంతో కదిలిపోతూ చప్పున పయిట చెంగుతో ముఖం దాచుకుంది.

మేనత్త ప్రవర్తనతో స్థంభీ భూతుడయ్యాడు రవీంద్ర.

అతను ఎప్పుడు వచ్చినా రోజా చిరునవ్వుతో గడపలోనే ఎదురయ్యేది.

ముందుగా తెలిస్తే తండ్రిని తీసుకుని సరాసరి బస్సుస్టాండ్‌కే వచ్చేది.

కాని ఈ రోజు అతను వచ్చి పది నిముషాలు అవుతున్నా ఆమె కనిపించలేదు. సరికదా.... అసలు విషయం చెప్పకుండా ఈ ఏడుపులు ఏమిటి? ఇంతకి రోజా ఎక్కడ?

కోపంగా నొసలు చిట్లించి ఏదో అనబోయి- మళ్ళీ అంతలోనే చివ్వున మంచం లోంచి లేచి నడవ దాటి చరచరా ఆమె గది వైపు వెళ్ళబోయ్యాడు.

అతని పరిస్థితి అయోమయంగా వుంది.

క్షణక్షణానికి అతనిలో సహనం నశించిపోతూంది. క్రోధంతో రవీంద్ర నాలుగు అడుగులు వేశాడో లేదో ...జగన్నాథం ఖంగు తిన్నవాడిలా గభాల్న లేచి మేనల్లుడ్ని అడ్డకొని చప్పున అతని చేతిని పట్టుకున్నాడు. వారిస్తున్నట్టుగా అన్నాడు.

"నాయనా రవీ! రోజా కిప్పుడు బాగానే వుంది. నిద్ర పోతూంది. కాని ముందు నీతో అర్జంటుగా కొంచెం మాట్లాడాలి. ఆతరువాత రోజాని చూద్దువు గాని...." అంటూ మరో మాటకి ఆస్కారం లేకుండా రవీంద్ర చేతిని గట్టిగా పట్టుకొని గబగబా హాలు దాటించి పెరటి వైపుకి తీసుకెళ్ళాడు.

పెరటంతా రకరకాల పూల మొక్కలతో బాగా ఏపుగా పెరిగి నవనవ లాడుతూంది.

తెల్లవారు ఝాము... సమయం ఐదు గంటలు కావస్తోంది. ఇంకా పూర్తిగా వెలుగు రేఖలు విచ్చుకోలేదు.






# "పుష్ప విలాపం"

ప్రకృతి అంత పల్చగా తెరకప్పినట్టు పొగ ఆవరించింది.

పక్షులు గూళ్ళలోంచి బయటికి వచ్చి కలకల రావాలు చేస్తూ సుప్రభాతం పలుకుతున్నాయి.

జగన్నాథం రవీంద్ర చేయి పట్టుకొని నూతి గట్టు దగ్గరకి తీసుకెళ్ళాడు.

రవీంద్ర భుజాలు పట్టుకొని ప్రక్కనే వున్న గట్టు మీద కూర్చో పెడుతూ తనూ కూర్చున్నాడు.

"............"

"............"

కొద్ది క్షణాలు ఇద్దరి మధ్య నిశ్శబ్దం. ఆ తరువాత జగన్నాథం నెమ్మదిగా గొంతు విప్పాడు.

"నాయనా! రవీ..... ఇప్పుడు సరోజ ఆరోగ్యం బాగానే వుంది. ప్రమాదం లేదని డాక్టర్లు చెప్పారు. మా ఖర్మమో... దాని దురదృష్టమో... జరగకూడని అనర్థం జరిగిపోయింది. ముందు నేను చెప్పేది ప్రశాంతంగా విను. ఆ తరవాత నీకేది మంచిదని తోస్తే అది చెయ్యి...."

".............!?"

"మొన్న రాత్రి రోజా దాని స్నేహితురాళ్ళతో కల్సి మొదటి ఆట సినిమాకి వెళ్ళింది. సినిమా వదిలే సమయానికి బాగా వర్షం పడేటట్లు వుండటంతో బస్సు కోసం నిల్చోక రోజా స్నేహితురాళ్ళంతా ఆటోలు రిక్షాలు మాట్లాడుకొని ఇళ్ళకి వెళ్ళిపోయారట. అందుకని రోజా కూడా ఆటో మాట్లాడుకొని ఎక్కి కూర్చుంది. అయితే సగం దారిని వచ్చేసరికి ఎవరో కొందరు రౌడీలు ఆటోని అటకాయించి దౌర్జన్యంగా పక్కదారి పట్టించి ఊరి చివరికి తీసుకు వెళ్ళారట. అక్కడ ....వాళ్ళంతా కల్సి ....నీనా....రోజా....ని......"

"ఆఁ.........!?"

పిడుగు పడినట్లు అదిరి పడ్డాడు రవీంద్ర వెర్రివాడిలా మేనమామ మొఖంలోకి చూశాడు.

"............"

"............"

కొద్ది నిమిషాలు ఇద్దరి మధ్య నిశ్శబ్దం.

జగన్నాథంపై తువ్వాలుతో కళ్ళు తుడుచుకుని రాద్ధమైన గొంతు సవరించుకున్నాడు,

"అవును రవి! ఆ రౌడీలు కత్తులు కటార్లతో ఆటో డ్రైవర్ని, రోజాని బెదిరించారుట. ఆ ఆటో డ్రైవరు వాళ్ళ చేత బాగా దెబ్బలు తిని స్పృహ తప్పాడు. ఇంకా హాస్పటల్ లోనే వున్నాడు.

..... అసలు రోజా మొదటి ఆట సినిమాకి బయలు దేరు తున్నప్పుడే నేనూ మీ అత్తయ్య కూడా వద్దని వారించాము. కారణం అప్పటికీ వారం రోజాలుగా ఊళ్ళో బాగుండ లేదు. మతపరంగా అల్లర్లు జరిగి పాతబస్తీ అంతా అట్టుడికినట్లు వుడుకు తోంది: దాంతో రాజకీయంగా కూడా గొడవలు మొదలయినాయి. కొన్ని ప్రాంతాల్లో "కర్ఫ్యూ" కూడా విధించారు. కాని ఇటువైపు గొడవలు ఏమీ లేవు. అంతా ప్రశాంతంగానే వుంది. అయినా ఊళ్ళో బాగోనప్పుడు ఈ పరిస్థితుల్లో సినిమా ఏమిటని వారించాము. కాని అప్పటికే పదిరోజుల్నించి కాలేజీలకి "టర్మ్ హాలిడేస్..... అందువల్ల వీళ్ళంతా ఏం తోచక ఓ అరడజను మంది అమ్మాయిలు మనింటికి వచ్చారు. "బోర్"గా వుందని అంతా కల్సి మొదటి ఆట సినిమాకి బయలు దేరారు. సరే ఒకళ్ళకి ఒకళ్ళు తోడుగా వున్నారు కదా అని మేమూ గట్టిగా కాదన లేక పొయ్యాం . అదే మేం చేసిన పొరపాటు. .......

..... వెళ్ళేటప్పుడు అంతాకల్సి వెళ్ళినా వచ్చేటప్పుడు రాత్రి సమయం , పైగా వర్షం పడేటట్లు వుండటంతో – ఎవరి దారిన వాళ్ళు ఇళ్ళకి వెళ్ళి పొయ్యారు. మిగతా అమ్మాయిలంతా క్షేమంగానే ఇళ్ళకి చేరారు. కాని మా ఖర్మ కాలి మన సరోజ విషయం లోనే ఇలా విధి వక్రించింది పైగా మనది కాస్త వూరికి దూరంగా వున్న కాలనీ ఏరియా..... దాంతో......."

"....... ! ?" రవీంద్ర వూపిరి తియ్యటం కూడా మరిచి పొయ్యాడు.

మెదడు నరాలు చిట్లి శరీరం లోని రక్తం అంతా గెడ్డ కడుతున్నట్లు చైతన్య రహితం అయి పొయ్యాడు. భావరహిత మైన గాజు కళ్ళతో వెర్రి వాడిలా మేనమామ ముఖం లోకి చూస్తూ వుండి పొయ్యాడు.

వింటున్నది నిజమో అబద్ధమో తెలియని సందిగ్ధంలో స్థాణువు అయిపొయ్యాడు.

"ఆరోజు రాత్రి ..... సినిమాకని వెళ్ళిన పిల్ల ఎంతకి రాకపొయ్యే సరికి మీ అత్తయ్య ఏడుపు లంకించు కుంది. దాని ఏడుపు చూస్తే నాకూ కాళ్ళూ చేతులూ ఆడలేదు.

అఖరికి ఆ వానలోనే గొడుగు వేసుకుని దాని స్నేహితురాళ్ళందరి ఇళ్ళు గాలించాను. చివరికి గత్యంతరం లేక పోలీసు కంప్లైంటు ఇచ్చాను. రిపోర్టు ఇచ్చిన రెండు గంటలకి ఆ చూకి దొరికింది......

..... ఊరి చివర తుప్పల్లో పులివాత పడ్డ జింకలా చావు బతుకుల్లో వున్న రోజాని అక్కడికి కాస్త దూరంలో తల పగిలి రక్తం మడుగులో వున్న ఆటో డ్రైవర్ని పోలీసులు చూసి హాస్పటల్లో చేర్చారు. నిన్న రాత్రి రోజాని ఇంటికి తీసుకొచ్చాం....."

"మామయ్యా ! ?"

"అవును రవీ జరిగింది ఇది. దాని బతుకు బండలు అయిపోయింది. ఊళ్ళో తల ఎత్తుకో లేక ఓ ప్రక్క, ఒక్కగా నొక్క కూతురి బతుకు బురదపాలయిందన్న బాధ మరొక ప్రక్క........!

.... రోజా కన్నీరు చూడ లేక పోతున్నాం. ప్రాణాలతో బయట పడింది. కాని ఏం లాభం ? నా కన్న తల్లి ఎవరికి అన్యాయం చేసిందని దానికింత శిక్ష? నువ్వు ఇంక దాని ముఖం చూడనని నువ్వు లేకుండా తను బ్రతక లేనని దాని బాధ. నిన్న రాత్రి ఒంటినిండా కిరసనాయిల్ పోసుకుంది. ఒక్క క్షణం ఆలస్యం అయితే మాకు బూడిదే మిగిలేది. ఎంత బ్రతిమాలిన పచ్చి గంగ కూడా ముట్టటం లేదు.....

"అసలు విషయం నీకు నెమ్మదిగా ఉత్తరం వ్రాద్దామనుకున్నాను. కాని....దాని బాధ చూడలేక ఏమైనా జరగనీ అనుకుని నీకు టెలిగ్రాం ఇచ్చాను. ఏ క్షణంలో ఏం అఘాయిత్యం చేస్తుందోనని నేను మీ అత్తయ్య వెయ్యి కళ్ళతో కాపాడుతున్నాం. ఏ జన్మలో ఏం పాపం చేసుకున్నామో....ఈ రోజా ఇంత శాపం పెట్టాడు మాకు ఆ భగవంతుడు......"

జీరబోయిన కంఠంతో చెప్పటం ఆపి దీర్ఘంగా వూపిరి తీసుకున్నాడు జగన్నాథం.భుజం మీది తువ్వాలుతో అలసటగా మొఖం తుడుచుకున్నాడు.

"............"

రవీంద్రలో చలనం నశించి పోయింది. గుండెని ఒక్కసారి బయటికి తీసి తిరిగి యధాస్థానంలో పెట్టినట్లు కొద్ది క్షణాలు అతని మస్తిష్కం స్థంభించి పోయింది.

మేనమామ చెప్తున్న విషయాలు వింటూ స్తంభీభూతుడయి పొయ్యాడు.

చివరికి ఎలాగో గొంతు పెగల్చుకొని నాలికతో పెదాలు తడుపుకున్నాడు. ఏదో చెప్పాలన్న తాపత్రయంతో పెదవి కదిపాడు.

అంతలో మళ్ళి జగన్నాధమే అన్నాడు.

"నాయనా రవీన్! ఈ పరిస్థితుల్లో నీకు నేను ఏది చెప్పలేను. నువ్వు చదువుకున్న వాడివి. మంచి-చెడు అన్ని ఆలోచించగలవు. రోజా దాని గదిలో వుంది. నీకు ఇష్టం అయితే వెళ్ళి చూడు. లేకపోతే ఇట్నుంచి ఇటే వెళ్ళిపో. దాని మొఖాన ఏది రాసి వుంటే అదే జరుగుతుంది."

"మావయ్యా?"

"అవును రవీన్!" ఇంతకంటె నీకు నేను ఏమీ చెప్పలేను. ఏదీ దాచకుండా జరిగింది జరిగినట్లు నీకు చెప్పాను. రోజా విషయంలో నీ నిర్ణయం ఎలాంటి దయినా నాకు సంతోషమే." నోటి వాక్యం పూర్తి కాకుండానే జగన్నాథం గభాల్న లేచి మొఖం చాటు చేసుకుని వడి వడిగా వీధిలోకి వెళ్ళిపొయ్యాడు.

రవీంద్ర దిగ్భ్రాంతుడయ్యాడు.

ఆ తెల్లవార ఝామున.... చీకట్లు విడని ఆ తొలి వేకువలో .... ఆ చల్లని ... మంచులో .... ఒంటరిగా మిగిలిపొయ్యాడు .

ఎంతో సేపు అలాగే చలనం లేని రాతి బొమ్మలా కూర్చుండి పొయ్యాడు. అతని మనసంతా భావరహితం అయిపోయింది – "న – భంసురి

న – భాంసురియా" – అన్నట్లు మనసు మూగబోయింది.

చుట్టూ మంచు పొరలు పొరలుగ ప్రకృతిని ఆవరించుకొని వుంది.

ప్రక్కనే బావి గట్టును అనుకొని పెద్ద దేవపారిజాతం చెట్టు ఆకు కనిపించకుండా నిలువెల్లా పూలతో విరగబూసింది.

ఆ చెట్టు కిందంతా పారిజాతం పూలు రాసులు పోసినట్లు గుట్టలు గుట్టలుగ పడి వున్నాయ్.

గాలి వీచినప్పుడల్లా ఆ చెట్టు నుంచి పూలు

జలజలా రాలిపడుతున్నాయి.

ఆ పూల నుంచి వచ్చే మత్తైన పరిమళం సన్నగా గాలిలో కదులుతూంది.

చిన్నటి ఎర్ర కాడల్తో..... పవిత్రంగా ... వున్న ఆ తెల్లని పూలు......మంచు ముత్యాలతో పోటీ పడుతున్నాయ్.

ఆ రాలిన పూలని చూస్తుంటే రవీంద్రకి చప్పున మెరుపులా ఒక సంఘటన జ్ఞాపకం వచ్చింది.

సరోజ ఉదయానే లేచి ఆ రాలిన పూలన్నింటిని ఏరి పెద్ద దండ కట్టి దేవుడి పటానికి వేసేది.

దాంతో తులసమ్మ గయ్యి మనేది. "చెట్టున అన్ని పూలుండగా ఆ కింద పడ్డ పూలు దండ కడతా వేమిటే?" అని కూతుర్ని తిట్టుకొనేది.

అయినా రోజా పంతంగా ఆ కింద రాలిన పూలే దండ గుచ్చి దేముడి పటానికి వేసేది రోజా

రవీంద్రకి కూడా అలా కింద పడ్డ పూలు దేముడికి అలంకరించటం నచ్చేది కాదు.

అందుకే –

"పోనీ అత్తయ్య చెప్పినట్టే వినరాదా రోజా?" అనేవాడు రవీంద్ర.

"ఎందుకు వినాలి బావా?" ఈ పూలు ఏం పాపం చేశాయని? కింద పడ్డాయని ఈ పూలని మనం నిర్లక్ష్యంగా ఇలాగే వదిలేశామనుకో. పనిమనిషి వచ్చి చీపురుతో చెత్త కుప్ప మీదకి వూడ్చేస్తుంది. కింద రాలినంత మాత్రాన పూజకి ఎందుకు పనికి రావూ? అంతా మన భ్రమ. మంచి అయినా చెడు అయినా మనం అనుకోవటంలో వుంది...

....చూడు. మంచులో తడిసి తెల్లగా ఎంత అందంగా వున్నాయో! కింద పడ్డంత మాత్రాన పూజకి పనికి రావా? ఎవరా మాట అన్నది?"

...అంటు ఎంతో భక్తిగా ఆ చెట్టు కింద నేల మీద రాలిపడ్డ పూలన్నింటిని ఒద్దికగా ఏరి బుట్టలో వేసి చక్కగా నీళ్ళలో కడిగేది రోజా. ఓపిగ్గా దండ గుచ్చి భక్తిగా దేముడి పటానికి అలంకరించేది.

ఆ మాటలన్ని ఇప్పుడు రవీంద్ర మనసులో గంట కొట్టినట్టు వినిపిస్తున్నాయి.

ఎదురుగా వున్న ఆ పారిజాతం చెట్టు నుంచి గాలి విసిరి నప్పుడల్లా జలజలా పూలు రాలిపడుతుంటే... అంచెలంచెలుగా...రోజా మాటలు... ఆ నాటి దృశ్యాలు జ్ఞాపకం వస్తున్నాయి.

చిన్న ఎర్రటి కాడల్తో తెల్లగా మంచుపుష్పాల్లా వున్న ఆ పారిజాతం పూలని చూస్తుంటే నిర్మలమైన ...అమాయకమైన ....సరోజ ముగ్ధ మోహన రూపమే కనిపిస్తుంది.

"ఈ పూలు పూజక ఎనిక రావా? ఎవరా మాట అన్నది?" అని నిలదీసి ప్రశ్నిస్తున్నట్టే అనిపిస్తూంది.రవీంద్ర మనసు మెత్తగా కరిగినట్టు అయ్యింది.

చప్పున బావి గట్టు మీంచి లేచి ఆ పూల చెట్టు దగ్గరకి వెళ్ళాడు.

ఒంగి గుట్టలు గుట్టలుగా నేల మీద రాసులు పోసినట్టు రాలిపడి వున్న ఆ చిన్న తెల్లటి పారిజాతం పూలని దోసిలి నిండా తీసుకున్నాడు.

సరిగ్గా అదే సమయంలో –

సందు చివర వున్న శివాలయంలో తెల్లవారు ఝాము ....సుప్రభాత సేవని సూచిస్తూ....

"ఠంగ్ ...ఠంగ్..." మని గంటలు మ్రోగాయి.

ఆ గంటలతో పాటే మైకులో సుప్రభాత గీతం శ్రావ్యంగా మొదలయ్యింది.

".....

ఏమి చేతురా లింగా

ఏమి చేతు...

గంగ ఉదకము తెచ్చి నీకు

లింగ పూజలు చేదమంటే

గంగనున్న చేప–కప్ప

ఎంగిలంటున్నాయి లింగా

మహానుభావా...

మా లింగమూర్తి

ఏమి చేతురా....."

ఆ ఉషోదయాన ...మంచు తెరలని చీల్చుకుని శ్రావ్యంగా మారుమోగుతుంటే –

ప్రతి పువ్వులోనూ సరోజ చిరునవ్వుతో కూడిన అమాయకమైన ముగ్ధ మోహన రూపమే కదులుతుంటే దోసిలి నిండా పూలని పట్టుకుని నెమ్మదిగా ఆమె గది వైపు అడుగులు వేశాడు రవీంద్ర. □

# ఈ వేమన పద్యాలు




కొండగుహలనున్న కోవెలలందున్న
మెండుగాను బూది మెత్తియున్న
కుండుగోకు బుద్ధి కుదరక మానదు
విశ్వదాభిరామ వినురవేమ.

# తీర్థయాత్రల్లో తిప్పలు! -BANNU*

ఋషిశీ























# మనుష్యుల్లో వైరస్‌లు కలిగించే వ్యాధులు!

సర్వసాధారణంగా వచ్చే జలుబు మొదలుకొని ఆటలమ్మ, పెద్ద అమ్మవారు, శిశు పక్షవాతం, గవదబిళ్ళలు, పసరికలు, తట్టు లేక పొంగు, మెదడు వాపు వ్యాధి వంటి తీవ్రమైన వ్యాధుల వరకు. వైరస్‌లు కలిగిస్తాయి. మనుష్యులనే కాదు, పశుపక్ష్యాదులని సయితం ఈ వైరస్‌లు ఎంతగానో బాధిస్తాయి. రాబిస్ వ్యాధికి వైరస్ కారణమని ఎంతో మందికి తెలుసు. పార్వో వైరస్ ఎలుకల గర్భకోశాలలో వ్రణాలని కలిగిస్తుంది. ఇలాగ వైరస్‌లు రకరకాల వ్యాధులని కలిగిస్తూ వుంటాయి.

జలుబు రావటానికి రైనో వైరస్ కారణం. (బొమ్మలో ఉంది!). ఈ వైరస్ ఒకరి నుంచి ఒకరికి అతి వేగంగా అంటుకొంటుంది. నాసికాపుటలు వాచి ఎర్రగా అవుతాయి. తుమ్ములు విపరీతంగా రావడం అందరికీ తెలిసిన విషయమే. తలనెప్పి, దిబ్బడ మామూలే! మూడు, నాలుగు రోజుల తరువాత జలుబు దానంతట అదే తగ్గిపోతుంది. ఈ రొంపకి ఎన్నో రకాల మందులు వాడుకలో ఉన్నా శాశ్వతంగా దీనిని అరికట్టడం సాధ్యంకావడంలేదు. పడిశాన్ని తెచ్చిపెట్టే రైనో వైరస్‌ని స్పష్టంగా తుదముట్టించే మందులుకాని, వాక్సిన్‌లు కాని నేడు అందుబాటులో లేవనే చెప్పాలి.

తట్టు లేక పొంగు (మిసల్స్) కూడా వైరస్ వల్లే వస్తుంది. తట్టు వచ్చినప్పుడు, 3, 4 రోజులపాటు జ్వరం తీవ్రంగా ఉంటుంది. తుమ్ములు, దగ్గు, ముక్కు నుండి నీరు కారడం, కళ్ళు ఉబ్బి ఎర్రబారడం సర్వసాధారణంగా కనిపించే లక్షణాలు! చర్మముపై తట్టు ఎర్రటి పూతలాగా ఏర్పడుతుంది. తరువాత నెమ్మది నెమ్మదిగా తట్టు, జ్వరము రెండూ తగ్గుతాయి. ఇది అంటువ్యాధి. దీనికి వ్యాక్సిన్ చేస్తారు!

గవదలు లేక గాలిబిళ్ళలు అనేది వైరస్‌లు కలిగించే మరొక వ్యాధి. ఇది ఎక్కువగా పసివాళ్ళకి వస్తూ ఉంటుంది. లాలాజలగ్రంధుల వాపువల్ల విపరీతంగా నెప్పివేస్తుంది. రోగి లాలాజలం వల్ల ఈ వ్యాధి త్వరితంగా వ్యాప్తి చెందుతుంది. అందుకే ఈ వ్యాధి సోకిన వారి దగ్గరికి పసిపిల్లలని పంపకూడదు. గవదబిళ్ళల వల్ల 4, 5 రోజులపాటు జ్వరం వస్తుంది. కొందరి విషయంలో తల తిరుగుడు, వాంతులు చేసుకోవడం మొదలైనవి కూడా సంభవిస్తాయి.

పెద్ద అమ్మవారు వైరస్ కలిగించే అతి ప్రమాదకరమైన వ్యాధులలో ఒకటి. ఒకప్పుడు ఈ వ్యాధి ప్రపంచం మొత్తాన్ని బాధ పెట్టింది. ఇప్పుడు చాలా దేశాలలో ఈ వ్యాధి జాడేలేదు. మనదేశంలో కూడా దీనిని పూర్తిగా నిర్మూలించినట్లు తెలుస్తోంది.

పెద్ద అమ్మవారు పోస్తే రోగిని తప్పనిసరిగా దూరంగా ఉంచాలి. వైరస్ నోటి ద్వారా కాని, ముక్కు ద్వారా కాని దేహంలోకి ప్రవేశించిన 14 రోజుల తర్వాత వ్యాధి లక్షణాలు బయటపడతాయి. చలిపుట్టడం, జ్వరం తీవ్రంగా రావడం, శరీరంపై పెద్ద పెద్ద పొక్కులు ఏర్పడడం, తల తిరగడం, మైకం ఇలాంటివన్నీ ఈ వ్యాధి ప్రభావ ఫలితాలే! ఈ వ్యాధి సమసిపోయాక పొక్కులు మాయమైనా మచ్చలు మాత్రం శాశ్వతంగా ఉండిపోతాయి!

ఆటలమ్మ మరో వ్యాధి. ఇది ఇంకా రంగంలోనే ఉంది. ఈ వ్యాధి రాకుండా చికెన్‌పోక్స్ - వ్యాక్సిన్ చేస్తారు. ఈ వ్యాధి సోకినప్పుడు కూడా చలిపుట్టడం, జ్వరం హెచ్చుగా రావడం ఉంటుంది. చిన్న చిన్న పొక్కులేర్పడి, అవి మాయని మచ్చలుగా మిగిలిపోతాయి. ఈ వ్యాధి పసిపిల్లలకి ఎక్కువగా వస్తుంది. అందుకే నెలల వయసులోనే వ్యాక్సిన్ చేయిస్తే మంచిది.

పసిపిల్లలకి వచ్చే పక్షవాతం లేదా పోలియో ఎంతో నష్టాన్ని కలిగించే వ్యాధి. ఒక్కోమారు పసిపిల్లలు శాశ్వతంగా పక్షవాతం పాలవుతారు. కాళ్ళూ చేతులు పడిపోతే వాళ్ళ భవిష్యత్తు అంధకారమయమై పోతుంది కదా! పోలియో మైలిటిస్ అనే వైరస్ ద్వారా వచ్చే ఈ వ్యాధి వల్ల వెన్నుపాము దెబ్బతింటుంది. దీనివల్ల కండరాలని కదలించే శక్తి పడిపోతుంది. ఫలితంగా కాళ్ళూ చేతులూ పనిచేయవు. ఈ వ్యాధి వచ్చినప్పుడు శరీర ఉష్ణోగ్రత బాగా ఎక్కువవుతుంది. కొందరైతే అపస్మారకం పాలవుతారు కూడా! మరి బలహీనంగా ఉండే పిల్లలలో అయితే మూర్ఛవంటి జబ్బులకి కూడా దారితీయవచ్చు. నెలల పసికందులుగా ఉన్నప్పుడే పోలియో చుక్కలని వేయించుకొంటే ఈ వ్యాధి బారి నుంచి బయటపడవచ్చు. తల్లితండ్రులు అజాగ్రత్తగానో అలక్ష్యంగానో ఉండిపోతే పిల్లల బంగారు భవిష్యత్తుని చేతులారా నాశనం



పార్వో వైరస్



పోలియో వైరస్



ఇన్ఫ్లుయెంజా వైరస్



రైనో వైరస్

చేసినట్లు అవుతుంది. పోలియో ఇనాకులేషన్ ఎట్టి పరిస్థితులలోనూ మరచిపోకూడదు.

వైరస్ వల్ల వచ్చే వ్యాధులలో పసరికలు కూడా ఒకటి. ఈ వ్యాధి ఏకకాలంలో అనేకమందికి వస్తుంది. అంటువ్యాధి. త్వరగా జబ్బువాత పడేవారు పసిపిల్లలే! కలుషితమైన నీరు త్రాగడం వల్ల ఈ వ్యాధి రావచ్చును. జ్వరము విపరీతంగా ఉండి తలనెప్పి బాగా ఉంటుంది. కళ్ళు, చర్మము పసుపు రంగులోకి మారుతాయి. (పైత్యరసం ఎక్కువైనా పసరికలు రావచ్చును!) ఈ వ్యాధినే కామెర్లు, కామాలి అనికూడా పిలుస్తూ ఉంటారు. ఎల్లో ఫీవర్ అంటే ఇదే!

కుక్క కరవడం వల్ల వచ్చే రాబీస్ కూడా వైరస్ వల్ల సంక్రమించేదే! హైడ్రో ఫోబియాకి (నీటిని చూచి భయపడటం) కూడా తిరగవచ్చు. ఈ వ్యాధికి కుక్క కరచిన వెంటనే చికిత్స చేయించుకోవడం ఉత్తమమయిన పద్ధతి. గతంలో పాశ్చర్ ట్రీట్‌మెంట్ ఇచ్చి 14 రోజులపాటు ఇంజక్షన్‌లు వేసేవారు. ఇటీవల ఈ చికిత్సలో గణనీయమైన ప్రగతిని సాధించినట్లు తెలుస్తోంది. ఎంతో మందిని ఒకే సమయంలో బాధపెట్టే ఇన్‌ఫ్లూయెంజా జ్వరం కూడా వైరస్ వల్లే వస్తుంది. ఈ జ్వరం వయోభేదం లేకుండా అందరికీ వస్తుంది. 3 నించి 5 రోజులు వరకు జ్వరం తీవ్రంగా ఉండి కళ్ళు మండడం, ఒళ్ళు నెప్పులు పుట్టడం ఈ వ్యాధి లక్షణాలుగా చెప్పుకోవచ్చును. ఈ జ్వరానికి తాత్కాలిక ఉపశమనాన్ని కలిగించే మందులు ఉన్నాయి కానీ, ఈ జ్వరానికి మూలమైన వైరస్‌ని రూపుమాపేందుకు తగిన పథకం అందుబాటులో లేదు. ఈ రంగంలో ఆశాజనకమైన ఫలితాలు పరిశోధనాపరంగా కనిపిస్తూనే ఉన్నాయి!

ఇటీవల ఎంతో మంది ప్రాణాలని బలిగొన్న మెదడువాపు వ్యాధి (ఎన్ సెఫలయిటిస్!) వైరస్‌ల ద్వారా సంక్రమించేదే! పందుల వల్ల ఈ వైరస్ సంక్రమిస్తుందని పందులని ఊరికి దూరంగా ఉంచడం, లేదా చంపడం వంటి పనులని కూడా మనవారు చేపట్టారు. అయితే మెదడువాపు వ్యాధికి పందులకి సంబంధమే లేదని చెప్పే పరిశోధకులు కూడా ఉన్నారు. కచ్చితమైన నిర్ధారణకి ఇంతవరకు ఎవరూ రాలేదు!

మెదడు వాపు వ్యాధి వచ్చినప్పుడు ఆ వ్యాధి పేరు సూచిస్తున్నట్లే మెదడు బాగా ఉబ్బిపోతుంది. ఈ వ్యాధికూడా పదకొండు సంవత్సరాలకి తక్కువ వయస్సున్న పిల్లలకే వస్తుంది. రోగనిరోధ శక్తి వారిలో బాగా తక్కువగా ఉండటమే కారణం కావచ్చు. వాపు భాగంలో చీము కూడా పడుతుంది. వ్యాధి సోకినవాళ్ళు మైకంతో తూలిపోతుంటారు. తలనెప్పి భరించరానంతగా ఉంటుంది. రక్తవాంతులు కూడా అవుతాయి! కోమాలోకి వెళ్ళిపోనూ వచ్చు. ఈ వ్యాధి ముదిరాక బ్రతకడం చాలా కష్టం. కలుషితమైన నీటివల్ల కూడా ఈ వ్యాధి వస్తుందని కొందరు చెబుతారు. ఏది ఏమైనా ఈ వ్యాధికి సంబంధించినంత వరకు అన్ని విషయాలు స్పష్టంగా తేలలేదనే చెప్పాలి.

ఈ విధంగా ఎన్నో రకాల జబ్బులకి వైరస్‌లు బాధ్యత వహిస్తున్నాయి. పరాన్న జీవులుగా బ్రతికే చిన్న చిన్న జంతువుల వల్ల, బ్యాక్టీరియమ్‌ల వల్ల మనిషికి ఇంకా ఎన్నో రకాల వ్యాధులు వస్తున్నాయి. ప్రకృతి భీభత్సాలు, ప్రమాదాలు, మారణహోమాలు, హత్యలూ, ఆత్మహత్యలూ ఎలాగూ ఉన్నాయి. క్రమక్రమంగా ప్రకృతిని అర్థం చేసుకొంటూ తన ఉనికి భద్రంగా ఉండాలంటే ప్రకృతి కూడా క్షేమంగా ఉండాలన్న నగ్నసత్యాన్ని గుర్తుపెట్టుకొని మనిషి మరింత ముందుకు ప్రయాణించవలసి ఉంది.

— డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

## (అ) మృతం

అర్థబలం అవివేకాన్ని
అంగబలం అన్యాయాన్ని
భుజబలం అత్యాచారాన్ని
విద్యాబలం స్వార్థాన్ని
పెంపొందింపజేస్తే
అమృతం తాగినా
మరణమే సంభవిస్తుందేమో!

—ఐలూరి నాగభూషణం



# సినిమా

## కృష్ణ, కోదండరామిరెడ్డి కాంబినేషన్‌లో త్వరలో విడుదలయ్యే "ఖైదీ రుద్రయ్య"

"కృష్ణది డైనమిక్ రోల్. ఊటీలో పాటలు, ప్రధాన సన్నివేశాలు చిత్రీకరించాం." అన్నారు ఎ. కోదండరామిరెడ్డి. ఆయన స్వీయ కొప్పే. దర్శకత్వంలో ఉత్తమాభిరుచిగల నిర్మాత టి. త్రివిక్రమరావు బహుజనరంజకంగా నిర్మించిన విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ "ఖైదీ రుద్రయ్య"లో కృష్ణ, శ్రీదేవి, సత్యనారాయణ, జగ్గయ్య, రావు గోపాలరావు, గుమ్మడి, శ్రీధర్, నూతన్‌ప్రసాద్, అల్లు రామలింగయ్య, గిరిబాబు, చలపతిరావు, భీమరాజు, అరుణ్‌కుమార్, సిల్క్‌స్మిత, వరలక్ష్మి, శ్రీలక్ష్మి నటించారు. పరుచూరి సోదరులు కథ, మాటలు రాశారు. వేటూరి గీతాలకు చక్రవర్తి

"సీతారామ కళ్యాణం"లో



"అనాదిగా ఆడది"లో భానుప్రియ

# విశేషాలు

— జి. వి. జి. ...

స్వరకర్త. వి. ఎస్. ఆర్. స్వామి ఛాయ, భాస్కరరాజు శిల్పం, కె. సదాశివరావు సహ దర్శకత్వం, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పు, ఆనంద్ సహకార దర్శకత్వం, దోనవల్లి కోటేశ్వరరావు నిర్మాణ సారథ్యంతో బి. ప్రద్యుమ్నరావు సహ నిర్మాత.

## ఎన్. బి. చక్రవర్తి దర్శకత్వంలో "దొంగరాముడు"గా అర్జున్

"డిసెంబర్ 15 నుంచి షూటింగ్. ఫిబ్రవరికి పూర్తవుతుంది," అన్నారు ఎన్. బి. చక్రవర్తి. ఈయన దర్శకత్వంలో సి. హెచ్. వి. నర్సింహారెడ్డి నిర్మించే సి. వి. ఎస్. ప్రొడక్షన్స్ వారి పై చిత్రానికి మధు కథకుడు. సత్యానంద్ మాటలు, వేటూరి పాటలు, చక్రవర్తి సంగీతం. ఎన్. సుధాకరరెడ్డి ఛాయ, సాయికుమార్ శిల్పం, బాబు నృత్యాలు. వెంకటరత్నం కూర్పు వగైరా సాంకేతికవర్గం.

రజని, బాలకృష్ణ



రాధిక, "రాక్షసప్రేమ"లో



## అర్జున్ "గురుదక్షిణ" రెండవ షెడ్యూల్

"అర్జున్ సరసన ప్రీతి నాయిక. గురువుగా రంగనాధ్ నటిస్తున్నారు. యాక్షన్‌తో పాటు సెంటిమెంట్ మిళితమైన కధావస్తువు. నవంబర్ 3 నుంచి 10 వరకు ఫస్ట్‌షెడ్యూల్ పూర్తి చేశాం. రెండవ షెడ్యూల్ డిసెంబర్ 1 నుంచి 10 వరకు. జనవరి 15 న ఆఖరి షెడ్యూల్ మొదలవుతుంది," అన్నారు పి. శేఖర్. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో మయూరి ఆర్ట్స్ అధినేత ఎన్. వి. వి. విజయకుమార్ నిర్మిస్తున్న పై చిత్రంలో వేలు, రాజశేఖర రెడ్డి, పెమ్మసాని రామకృష్ణ, రామరాజు, కెప్టెన్ రాజు, పూర్ణిమ, ప్రీతి, బబిత, సిల్క్‌స్మిత నటిస్తున్నారు. విద్య–రత్నం కథ, మాటలు రాశారు. వేటూరి, రాజశ్రీ గీతాలకు కృష్ణ–చక్ర బాణీలు కూర్చారు. కె. ఎస్. మణి ఛాయ, కె. రామలింగేశ్వరరావు శిల్పం, పి. మహేష్‌కుమార్ సహకార దర్శకత్వం, సాహుల్ సాహసాలు, ప్రకాష్– సురేఖ నృత్యాలు, కె. ప్రభాకర్ ప్రొడక్షన్, నాయని మహేశ్వరరావు కూర్పు, జయప్రసాద్ నిర్వహణతో గుండా సత్యనారాయణ సమర్పిస్తారీ చిత్రాన్ని.

అట్టా నిద్రపోతే డబ్బు దండగ పెట్టినట్టు కాదూ? లేవండీ, లేవండి– లేచి సినిమా చూడండి!



## రేలంగి, చంద్రమోహన్‌లతో పి. వి. ఎస్. ఫిలిమ్స్ హాస్య ప్రధాన చిత్రం

"ఈ నాటి వివాహ వ్యవస్థ మీద హాస్య ప్రధానంగా రూపొందుతున్న చిత్రం . రంగ స్థలం మీద పేరు గడించిన దివాకర్‌బాబు ఈ చిత్రానికి కథ, మాటలు రాశారు," అన్నారు రేలంగి నరసింహారావు. నవంబర్ 7 నుంచి డిసెంబర్ 12 వరకు ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తవుతుంది. చంద్రమోహన్, అశ్విని, సత్యనారాయణ, గొల్లపూడి, నూతన్ ప్రసాద్, వేలు, వీరభద్రరావు, రమాప్రభ, వై. విజయ, అనూరాధ, జయమాలిని వగైరా తారా సందోహం. సి. నారాయణరెడ్డి, రాజశ్రీ గీతాలకు చక్రవర్తి స్వరకర్త. కోటేశ్వరరావు ఛాయ, లీలాకృష్ణ శిల్పం, శివసుబ్రహ్మణ్యం నృత్యాలు, గురుదేవ్ సహదర్శకత్వం, కె. ఎస్. ఎన్. మూర్తి ప్రొడక్షన్‌తో ఎన్. కృష్ణప్రసాద్ సహనిర్మాత. ఎస్. వి. ఎస్. ఫిలిమ్స్ సమర్పించే ఈ చిత్రానికి ఎం. చంద్రకుమార్ నిర్మాత.

# విశిష్టమైన పౌరాణిక చిత్రం "శ్రీ దత్త దర్శనము"

దత్తాత్రేయుడు మహారాష్ట్రలో ప్రఖ్యాతి చెందిన దైవం. ఆయన మహిమలు ఇంతవరకు దక్షిణాది ప్రజలకు తెలియదు. సత్యనారాయణ వ్రతం, ఏకాదశి వ్రతం మొదలైన వ్రతాలకు మల్లె అనఘావ్రత ప్రాధాన్యత అందరికీ తెలియజేయాలనే సంకల్పంతోనే ఈ చిత్రం నిర్మాణం జరుగుతోంది," అన్నారు పౌరాణిక చిత్రాలను తెరకెక్కించడంలో తనకు తానే సాటి అనిపించుకున్న కమలాకర కామేశ్వరరావు. ఈయన స్క్రిప్టు, దర్శకత్వంలో కె. సి. తల్వార్ నిర్మించే శ్రీదత్త సచ్చిదానంద ప్రొడక్షన్స్ వారి ఫై చిత్రంలో త్రిమూర్తుల అంశ అయిన దత్తాత్రేయుడు భక్తులకు పెట్టే పరీక్షలు, ఆ పరీక్షల వెనుక దాగిన అంతరార్థాలు సోదాహరణంగా విశదీకరించబడ్డాయి. జంభాసుర గర్వభంగం, విష్ణుదత్తుడి నిస్వార్థ భక్తి, పరాక్రముడైన కార్తవీర్యార్జునుడితో పరశురాముని యుద్ధం, వాటి వెనుక దాగిన దత్తాత్రేయుని లీలలు ప్రధాన ఘట్టాలు. సర్వదమన్ బెనర్జీ (దత్తాత్రేయుడు), రంగనాథ్ (కార్తవీర్యార్జునుడు), శివకృష్ణ (పరశురాముడు), గుమ్మడి (జమదగ్ని), కె. ఆర్. విజయ (రేణుకాదేవి), జ్యోతిర్మయి (అనసూయదేవి), ప్రభాకరరెడ్డి, రమణమూర్తి, ఎ. వి. నాగరాజు, చలపతిరావు, వీరభద్రరావు, కాంచన, జయంతి, ప్రభ, జయవాణి పాత్రధారులు. శ్రీ గణపతి సచ్చిదానందస్వామీజీ కథకు స్వర్గీయ సముద్రాల జూనియర్ సంభాషణలు సమకూర్చారు. వేటూరి గీతాలకు కె. వి. మహదేవన్ స్వరకర్త. నాగరాజు శిల్పం, శేషు చిత్రాలు, వీరప్ప కూర్పుతో వల్లభనేని లక్ష్మిదాసు నిర్మాణ సారథి.



"శ్రీ దత్త దర్శనము"లో జ్యోతిర్మయి

"పెళ్ళిళ్ళోయి పెళ్ళిళ్ళు"లో నరేష్, సంగీత

సినిమా

## అరకు లోయలో ప్రతి ధ్వనిస్తోన్న వంశీ "ఆలాపన"

ఉత్తమ అభిరుచులు కలిగిన వినూత్న చిత్రాల యువ దర్శకుడు శ్రీ వంశీ దర్శకత్వంలో హరితచిత్ర మూవీస్ వారి "ఆలాపన" చిత్రం మొదటి షెడ్యూలు అక్టోబర్‌నెల 22న అరకులో ప్రారంభమైంది.

సంగీత, నృత్య ప్రధానమైన చిత్రాలకు దర్శకత్వం వహించే కొద్దిమంది దర్శకులలో వంశీ ఒకరు. "మంచుపల్లకి"తో దర్శకులుగా చలన చిత్ర రంగ ప్రవేశం గావింపబడి "సితార" చిత్రంలో తనకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని సంతరించుకున్న వంశీ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో "ఆలాపన" చిత్రం పూర్తి ఔట్‌డోర్‌తో అరకు లోయలోని సుందర దృశ్యాలలో రూపురేఖలు దిద్దుకుంటోంది.

గతంలో ఒక చిత్రం షూటింగ్ నిమిత్తం అరకు వచ్చిన వంశీ అక్కడి ప్రకృతి శోభకు మురిసి ఒక నవలను ఆలపించటం జరిగింది. ఇపుడు అదే అముద్రిత నవల దృశ్య కావ్యంగా రూపొందుతుంది "ఆలాపన" చిత్రంగా.

ఈ చిత్ర కథానాయకుడు శివుడు ఒక రైల్వే ట్రాలీ పుల్లర్. అంతేగాక, అతనొక సుమధుర గాయకుడు కాగా కథా నాయిక ఉష నర్తకి. ఒకానొక శుభ ఘడియల్లో వారిద్దరికీ పరిచయం ఏర్పడుతుంది. అతనిది ఆలాపన, ఆమెది నర్తనం. వారిద్దరి మధ్యా శారీరక సౌఖ్యాలు కోరని సౌందర్యైకమైన అమరప్రేమ. శివుడి టాలెంట్‌ను కేష్ చేసుకోవాలని చూసే కళా దళారి, వారి ప్రేమను భగ్నం చేయాలని చూసే దుష్ట పాత్రలతో కథ నడుస్తుంది. ప్రతి చిత్రంలోనూ కొత్తదనాన్ని అందించే వంశీ ఈ చిత్రంలో ఒక అనూహ్యమైన ముగింపును యిస్తున్నారు.

"ఆక్రందన" లో నిర్మల, గొల్లపూడి



కథా నాయకుడు శివుడి పాత్రలో మోహన్, నర్తకి ఉష పాత్రలో భానుప్రియ నటిస్తుండగా, ఇతర పాత్రలలో జె. వి. సోమయాజులు, దేవదాసు కనకాల, ప్రదీప్, రాళ్ళపల్లి, మల్లిఖార్జునరావు, సి. హెచ్. కృష్ణమూర్తి, శ్రీ గోపాల్, థమ్, పద్మ మరియు వై. విజయ, రూప, యూన్సీ నటిస్తున్నారు.

కూచిపూడి, భరతనాట్యం, కథక్, కథాకళి, ఒడిస్సీ, మణిపురి నృత్యరీతుల సమ్మేళనంగా చిత్రీకరించే "ఆవేదన ఒక ఆరాధన, ఏ శక్తులు శాసించిన సాగే ఈ తపన తెలియని ఆవేదన" అనే బాలు ఆలపించిన సి. నా. రె. గీతం ఈ చిత్రానికి ఒక హైలెట్ కాగలదని దర్శకులు శ్రీ వంశీ అభిప్రాయ పడుతున్నారు. యిదిగాక, ఈ చిత్రంలో మరో అరుపాటలు వున్నాయి. నవంబర్ 20 వరకు కొనసాగే ఈ చిత్రంలో ఒక్కపాట మినహా - డైలాగ్ పార్ట్‌తో సహా ఆరు పాటలు చిత్రీకరింప బడతాయి. ఒకే ఒక షెడ్యూలుతో పూర్తి చిత్రాన్ని అరకులో నిర్మించిన మొట్ట మొదటి చిత్రం యిదే అవుతుంది.

వంశీ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం సమకూర్చిన ఈ చిత్రానికి మాటలు తనికెళ్ల భరణి, పాటలు: వేటూరి, సి. నా. రె. సంగీతం: ఇళయరాజా, కెమెరా: ఎమ్. వి. రఘు, కళ: తోట యాదు, ఎడిటింగ్: జి. ఆర్. అనిల్ మల్నాడ్, నృత్యం: ఆనంద్, ప్రొడక్షన్: కె. యల్. యన్. శాస్త్రి, నిర్వహణ: ఎ. జగన్ మోహనరెడ్డి, నిర్మాత: పెళ్లకూరి అమరేంద్రరెడ్డి.



బాలకృష్ణ, విజయశాంతి

## "ముద్దుల కృష్ణయ్య"లో ముద్దుల గుమ్మ

సినిమా

కృష్ణయ్య (బాలకృష్ణ) ఇంటికి వచ్చాడు. తలుపు తీశాడు. ఎదురుగా ఓ యువతి (విజయశాంతి) కనిపించే సరికి అమాంతంగా కొయ్యబారిపోయాడు.

"రా, బావా! నీ కోసమే ఎదురుచూస్తున్నా," అందా యువతి.

"ఎవరున్నవ్వు? ఇంట్లోకెలా వచ్చావ్?" కృష్ణయ్య ఇంకా విస్మయంలోంచి తేరుకోలేదు.

"సెంపిన్నుతో తాళం సటుక్కున వచ్చేసింది."

"అదిసరే.... ఇంతకీ, నువ్వెవరు?"

"ఎవరున్నవ్వు అంటావేటి-గొప్ప మర్యాదే! మా అయ్య రాడానికి వొళ్ళు బాగోలేదు. అమ్మే మా అయ్యకు తోడు. ఎవరూ ఎల్లకపోతే బాగుండదని నన్నంపాడు మా అయ్య."

"అయ్యెవరు?"

"బెజవాడ పార్వతమ్మ తమ్ముడు."

"ఆవిడెవరు?"

"అనకాపల్లి అచ్చియ్యగారి పెద్ద కూతురు."

"అతనెవరు?"

"మీ అమ్మ తమ్ముడి, మేనత్త మొగుడి మేనల్లుడి పెళ్ళాం-పింతండ్రి భార్యకి ఓ వరస కొడుకూ, ఓ వరస మర్ది."

"ఇంతకీ, నువ్వెవరో చెప్పవా?"

"మరిసపోయావా? నీకు ఊహ తెలియనప్పుడు, నాకు వయసు తెలియనప్పుడు మనం ఎంత ఇదిగా గుర్తు పత్తాదిలే. వచ్చి పణ్ణెం తిను. వంట పండాను."

"ఏంటి! వంట కూడా చేశావా?"

"ఆఁ.... నీ ఇంట్లో నాకాపాటి స్వాతంత్ర్యం లేదేమిటి? బొమ్మిడాల యిగురు నీకిష్టమని వండాను. వచ్చి పణ్ణెం తిను. పడక దగ్గర ఇంకా చాలా విషయాలు సెబుతాను."

కృష్ణయ్య స్థాణువులా నిలుచుండి పోయాడు.

ఎస్. గోపాల్ రెడ్డి నిర్మించే భార్గవ్ ఆర్ట్ ప్రొడక్షన్స్ "ముద్దుల క్రిష్ణయ్య" చిత్రానికి కోడి రామకృష్ణ దర్శకుడు. □

# కాలితే ఏం చేయాలో మా అమ్మకు బాగా తెలుసు.

## తనకి అమ్మమ్మ నేర్పిందిట.

అబ్బ, అమ్మంటే మా అమ్మలా ఉండాలి. ఎంత బాగా చూసుకుంటుందని! అమ్మ మొన్న నా బుజ్జి బొమ్మ గౌను ఇస్త్రీ చేస్తుంటే పొరబాట్న నేను చెయ్యి పెట్టాను. వేలు కాలింది. గబగబా అమ్మ బర్నాల్ రాసింది. కాలితే అమ్మమ్మ కూడా అలాగే బర్నాల్ రాసేదిట.

నా బుజ్జి పాపా, నీకెప్పుడైనా కాలిందంటే నేనూ బర్నాల్ రాస్తాలే, బాగయిపోతుంది.
కదమ్మా! కదూ బర్నాల్!




# బర్నాల్

ఇంటింటా విశ్వసింపబడినది.

BL 2078

సీరియల్

# అంతరాలు-అంతర్యాలు

బోసుబాబు

(గత సంచిక తరువాయి)

సుమారు వారంరోజులు గడిచాయి. ఒకనాటి సాయంత్రం....

శోభ మంచంమీద పడుకునుంది. మొత్తం మీద చూడగా శరీరంలో చలనం లేనట్లుగా వుంది. కళ్ళు పెద్దవి చేసుకుని పైకప్పు వంక తదేకంగా చూస్తోంది. అప్పుడప్పుడు గాలి తెరలు వచ్చినప్పుడు మాత్రం రెప్పలు టపటపలాడిస్తోంది. ఆమె మస్తిష్కం ఏ స్థితిలో, ఏ దశలో వుందో తెలియదు. దానికి ఆలోచనా శక్తి వుందో లేదో కూడా తెలియదు. అలాటి స్థితిలో నాయుడుగారు, ఆయన వెంట డాక్టరుగారు, శ్రీ లక్ష్మి గదిలోకి వచ్చారు. ఈ ముగ్గురినీ తల ప్రక్కకు తిప్పి చూచిందేగాని, శోభ ఏమి మాట్లాడలేదు.

శోభ వదనం వంక తండ్రి చూచారు. వెంటనే చెల్లెలు వైపు దృష్టి నిలిపారు. 'ఏమిటి పరిస్థితి నాకేమి తోచడంలేదు', అన్నట్లున్నాయి నాయుడిగారి చూపులు. ఆయన చూపుల్లో మమతానురాగాలతో పాటు కించిత్తు పునరాలోచనా ధోరణి తొంగిచూచింది. అన్నయ్య మనసును చెల్లెలు కూడా గ్రహించగలిగింది డాక్టరుగారు శోభ నాడి పరీక్షించారు. ఆయన తల ప్రక్కకు తిప్పి వంచినట్లున్నప్పటికి ఆమె ముఖాన్ని అప్పుడప్పుడు చూస్తూనే వున్నారు. కళ్ళ వైపు చూచి, తేజస్సు తగ్గుతోందా అని అనుమానించారు. ఏదో ఇంజక్షన్ చేశారు.

నాయుడుగారి వైపు తిరిగి–

'ఏమండి! నేను వైద్యుడినేగాని, మానసిక వ్యాధి నిపుణుడిని కాదు,' అన్నారు.

ఆయన నోటివెంట ఆకస్మికంగా వెలికి వచ్చిన ఈ మాట వినగానే నాయడుగారు, శ్రీలక్ష్మి ఒక్కసారిగా తొట్రుపడి, ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు. వారి చూపులు పరస్పరం ప్రశ్నించుకుంటున్నట్లున్నాయి.

నాయుడుగారు డాక్టరుగారి వైపు తిరిగి ఏదో చెప్పబోయి ఆగిపోయారు. శ్రీలక్ష్మి శోభను సమీపించింది–

'అమ్మా! ఇటు చూడు... నేను... అంటీని.' అంటూ తగ్గు స్వరంతో చెప్పింది. శోభ లేని సత్తువ తెచ్చుకుని మొదట చిరునవ్వు చూపింది. ప్రక్కకు తిరగడానికి ప్రయత్నిస్తే, ఆంటీ ఆమెను ప్రక్కకు తిప్పి దిండు సరిచేసింది.

అమ్మా! ఆమెను డిస్టర్బ్ చేయకండి. ఇంజక్షన్ పని చేయడం ప్రారంభమైంది. విశ్రాంతి వుంటే, మరింత త్వరగా పని చేస్తుంది. నావరకూ నేను శాయశక్తులా ప్రయత్నిస్తాను. అయితే నేను చేసిన సూచనను కూడా మీరు ఆలోచించండి', అన్నారు డాక్టరుగారు.

శ్రీ లక్ష్మి అన్నయ్యను ఇవతలకు పిలిచి చెప్పింది–

'నీకు కోపం రాదంటే ఓ సలహా చెబుతాను. లేకపోతే మన శోభ...' అంటూ దుఃఖాన్ని దిగమ్రింగింది.

'నీ సలహా నాకు తెలుసు లక్ష్మి. ఆ శ్యామంగారికి కబురు చేయకపోతే, నాబిడ్డ... అంతే కదూ...' అంటూ కళ్ళ నిండా నీళ్ళు పెట్టుకున్నారు నాయడుగారు.

'తప్పదేమోనన్నయ్యా, అమ్మాయి మనసు చెప్పలేనంతగా గాయపడింది. దానికి మందు, మన మామూలు మందుల్లో వుండదు.'

'ఒకవేళ కబురు పంపామనుకో. ఆయన రాకపోతే...'

'వస్తారన్న నమ్మకం నాకుంది. అంతగా రాకపోతే నీవో, నేనో వెళ్ళక తప్పదు.'

'అంతేనంటావా?'

శ్రీలక్ష్మిలో ఎందుకోగాని, శోభను గురించి కొత్త ఆశలు చిగురించాయి.

'అవును మరి... మన శోభ ఆరోగ్యానికేకాదు ఇప్పుడు ముప్పు వచ్చింది.?'

'నాకు తెలుసు.... ఇక చెప్పకు చెల్లీ...' నాయుడుగారు నిట్టూర్చారు. డాక్టరుగారు లేవడం చూచి, ఆయన దగ్గరకు వెళ్లారు. డాక్టరు ఓసారి నాయుడిగారిని చూచి, 'నేను మీకు చెప్పగలిగినంతటి వాడినికాదు. కాని, మీ అమ్మాయికోసం చెబుతున్నాను. ఆమె మానసిక రుగ్మత తొలగిపోయేట్లు చూడండి. రేపు ఉదయం వస్తాను, అంటూ గదిలోనుంచి బయటకు నడవబోయి, ఓసారి శోభ వదనం వైపు చూచారు. ఆయనతో పాటు

జరిగిన కథ–15: శోభ, శ్యామ్‌ల ప్రేమకు అడ్డుగోడగా నిలుస్తాడు శోభ తండ్రి. సరోజ తల్లి తండ్రులు సరోజని ముత్యాలరావు కిచ్చి పెళ్ళి చేయాలనుకుంటారు. కానీ సరోజ తానసలు పెళ్ళే చేసుకోనని చెపుతుంది. శ్యామ్ తల్లి వర్ధనమ్మగారికి సరోజని చూస్తే అభిమానం ఉంది కానీ ఆ అమ్మాయిని కోడలుగా చేసుకోడానికి మాత్రం ఆమె మనసు అంగీకరించదు. సరోజ తను శ్యామంను పెళ్ళి చేసుకుంటానని తల్లితో చెపుతుంది. సరోజ తరచు శ్యామం ఇంటికి వెళుతోందని అలా వెళ్ళకుండా కూతుర్ని అదుపులో పెట్టుకోమని పరంధామయ్య సుబ్బారావు గారిని హెచ్చరించడంతో ఆయన ఉగ్రుడై కూతురిపై చేయి చేసుకుంటాడు. సుబ్బారావు గారు స్వంత ఇల్లుని అమ్మేసి సరోజ వివాహ ప్రయత్నాలు ప్రారంభించారు. శోభ శ్యామం ఇంటికి వెళ్ళి రావడం చూచిన శోభ తండ్రి ఆమెను ఇంట్లోంచి వెళ్ళిపొమ్మంటాడు. ఆమె మనోవ్యాధితో మంచం పడుతుంది. సరోజని తను పెళ్ళి చేసుకోలేనని ముత్యాలరావు ఉత్తరం రాస్తాడు. సుబ్బారావుకి గుండెనొప్పి.

ఇంవసా యి

నాయుడుగారు, లక్ష్మి కూడా చూస్తున్నారు.

శోభ తలప్రక్కకు తిప్పి, చిరునవ్వు చూపుతూ, ఏమనుకుందో ఏమో, శక్తిని మరోసారి కూడగట్టుకుని, రెండుచేతులు జోడించి నమస్కరించింది ముగ్గురికీ. మెల్లగా పలికాయి ఆమె పెదవులు... 'నమస్తే'... అని

ముగ్గురూ గదిలోనుంచి వెళ్ళిపోయారు. గది వెలుపల వున్న పని మనిషిని, శోభకు తోడుగా వుండమని చెప్పింది లక్ష్మి.

గదిలో నిశ్శబ్దత... శోభలో నిశ్చలత. కాసేపటికి మళ్ళీ వచ్చిన మలయ మారుతాలు శోభ మనసును తట్టి లేపాయి. కనురెప్పలు అల్లల్లాడాయి. మనసులో అనుభూతులు. మస్తిష్కంలో ఆలోచనలు. ఇవి రెండూ మమేకమై, ఓ సుందర సుమమాలగా రూపొందాయి. ఆమాలలోని ప్రతి పూవు ఓ అక్షరంగా రూపుదాల్చింది ఆమె మనసులో. అదే అక్షరమాల అయింది. ఆ మాలను తన ప్రియుని మెడలో అలంకరించాలన్న బలీయమైన కోర్కె జనించింది. పని మనిషిని పిలవాలనుకుంది. మంచం సమీపంలో టీపాయ్ మీద ఓ సీసాను కొట్టి శబ్దం చేసింది. ఈ శబ్దం విని, పని మనిషి గదిలో కొచ్చింది. దగ్గరకు రమ్మని సైగ చేసింది. పనిమనిషి వచ్చి శోభను లేపి కూర్చోబెట్టింది. టాబ్లెట్ వేసుకుంది. గుక్కెడు నీళ్ళు నోట్లో పోసుకుంది. కాస్సేపటికి ఏదో సత్తువ వచ్చినట్లయింది. పనిమనిషి సహాయంతో టేబిల్ దగ్గరకు వెళ్ళి, కుర్చీలో కూర్చుంది. కొద్దిగా ఆయాసం.. కొద్దిసేపటికి అది నిమ్మళించింది. ప్రక్కనే వున్న షెల్ఫ్‌లోంచి కాగితాలు, కలం తీసింది.

ఈసారి పలికింది–,

'ఏమేవ్, నువు కాసేపు బయట కూచుంటావా?'

సరేనని పనిమనిషి బయటకు నడిచింది. శోభ ఓ నిట్టూర్పు విడిచి, కిటికీలోంచి బయటకు దృష్టి సారించింది. అప్పుడప్పుడే చీకటి తెరలు ఆకాశాన్ని క్రమ్ముకుని, నీలి రంగును, మరింత చిక్కటి నీలిమం చేస్తున్నాయి. పశ్చిమాద్రి చాటునుంచి, పైకి ప్రసరిస్తున్న సూర్య కిరణాలు క్రమంగా వన్నె తరిగిపోతున్నా, తెల్లని మేఘమాలికలకు బంగారు రంగు పులిమాయి. ఆ మేఘాల పయనంతో పాటు శోభ మనసు కూడా ఆకాశంలో విహరించింది. అది, అనంతాకాశంలోకి వెళ్ళిపోతోంది కాబోలు... లీనమైతోంది కాబోలు... దృగ్గోచరం కాని... కాలేని, ఆ సుదూరాలలో ఆమె ప్రియుని రూపం లీలా మాత్రంగా భాసించింది.

దృష్టిని మరల్చింది. కలాన్ని చేపట్టింది.... మనసులోని భావాలు, ఆ కాగితంపై అక్షరమాలగా అలంకరించుకుంటున్నాయి....

'శ్యామసుందరరావుగారికి నా హృదయ పూర్వక నమస్కారాలు. మీతో పరిచయం వున్న ఓ అమ్మాయి మీకీ లేఖ రాస్తోంది. నా పేరు శోభ... అంతేకాదు ముద్దుగా 'రాణి' అని కూడా చేర్చారు మా తల్లిదండ్రులు. మా అమ్మ గతించి చాలా కాలమైంది. నాన్న అల్లారు ముద్దుగా పెంచారు. బాగా చదివించారు. ఈ శిరిసంపదల మధ్య నిజంగానే రాణి'లా పెరిగాను....'

తనలో తానే నవ్వుకుంది.... మళ్ళీ వ్రాయడం ప్రారంభించింది.

'మా భోగ భాగ్యాలు ఎంత గొప్పవో మీకు తెలియదుగదా మరి. అందుకే అలా రాశాను. ఏమనుకోకండి. అయినా, ఏమిటి వింత. 'మీరు, మీరు' అంటూ రాస్తున్నానేమిటి?

క్షమించండి..మీతో నాకున్న పరిచయాన్ని బట్టి 'మీరు' అనకుండా 'నీవు' అంటాను. 'గారు' అనకుండా 'శ్యామ్!' అంటాను. అభ్యంతరం వుండదు కదూ... వుండదని నాకు తెలుసు. శ్యామ్' నీ మనసు నీ కంటే బాగా నాకు తెలుసు. 'శోభా' అని ఎంతో అనురాగంతో పిలవడం నాకు తెలుసుగా.. 'శోభా!' అని పిలిచినప్పుడు నీ చూపులు ఎంత అమాయకంగా వుంటాయో నీకేం తెలుసు..? 'శోభారాణిగారూ!' అని పిలిచినప్పుడు, నా మనసెంత సిగ్గుపడి పోతుందో నీకూ తెలుసుగా. అయినా..నన్ను ఉడికించడానికి నీ ఎదురుగా లేనుగా. ఆ నాటి నా సౌందర్యాన్ని నీవు వర్ణించావు. నా తనవు ఎంతగానో పులకించిపోయేది.. మరిప్పుడో.. ఇప్పటి నా సహజ 'సౌందర్యాన్ని' వర్ణించడానికి, నేను, నీ ఎదుట లేనుగా. అయినా, నేను బాధపడుతున్నాననుకుంటున్నావా... లేదు...నిజంగానే నేనేమీ బాధ పడటం లేదు. ఎందుకంటే ఒకవేళ నాలో బాధ వున్నా, నీకు కనిపించనివ్వనుగా. నన్ను చూచి నీవు బాధపడితే, నేను చూడలేను. అవునా. నాకు తెలియక అడుగుతాను. బాధంటే ఏమిటి?... మా నాన్నగారు నిన్ను అవమానించినప్పుడు నీవు పడిన వ్యధేనా... అదేనా..? నేను మీ యింటికి వచ్చి, నిన్ను అనుమానించి, అవమానకరంగా మాట్లాడినప్పుడు నీవు పడినది బాధే కదూ... బ్యారేజి వద్దకు వచ్చినప్పుడు నిన్ను చూచి కూడా, పలకరించలేక; దగ్గరకు రాలేక తిరిగి వెళ్ళిపోయినప్పుడు నీకు కలిగింది బాధే కదూ.. ఈ బాధలన్నీ భరించావంటే నీ మనసు ఎంత మంచిదో నీకే తెలియదన్నమాట. అయ్యో శ్యామ్! నీ వెంత వెర్రివాడివి. నన్ను గాఢంగా ప్రేమిస్తున్నావన్న సంగతి, నీ కంటే నీ మనసుకు బాగా తెలుసు. నీ మనసు తెలుసుకున్నదాన్ని, దోచుకున్నదాన్ని కూడా నేనేనని నీకు తెలుసా? రెండు ప్రేమైక హృదయాలు తొలి స్పర్శ దివ్యానుభూతిని కలిగిస్తుంది శ్యామ్...అదే అమరమైనది. అదే జన్మజన్మల అనుబంధమైన ప్రేమ... అయినా నేను చెప్పడమేమిటి? నీ మనసుకు తెలుసు తన ప్రియురాలి మనసు.

శోభ మురిసిపోతూ నోరార నవ్వింది. ఆ నవ్వులు వినబడి పనిమనిషి వచ్చి 'ఏంటమ్మగారూ!' అంది.

'ఓసేవ్, నీకు కూడా నన్ను చూస్తే నవ్వుగా వుందా.. ఫో అవతలికి...' ఆవేశంతో అరిచింది శోభ. పనిమనిషి బిక్క మొగంతో వెళ్ళిపోయింది. శోభ చేతి వ్రేళ్ళలో కొద్దిగా కంపనం ప్రారంభమైంది. కాసేపటికి తగ్గింది. ఆలోచనల గతి తప్పినట్లుంది. మెడ అటు ఇటు తిప్పుతూ చిరాకుపడింది.

'చూశావా శ్యామ్! నన్ను నీతో మాట్లాడనివ్వడం లేదు. ప్రతివారికి



మనమంటే అసూయే అసూయ ముందు పుట్టి ఆతర్వాత మనిషి పుట్టాడనుకుంటాను చివరకి పనిమనిషి కూడా అసూయేనా.. ఛ ..'

మళ్ళీ అంతలోనే శోభ దిగజారిపోయింది. 'అవును శ్యామ్. విధి బలీయమైనదంటారు నిజమేనేమో! అనవసరంగా నేనే అందరినీ తూలనాడుతున్నానేమో అవును శ్యామ్ నాదే పొరపాటు నాకున్నట్లే ప్రతివారికి కోర్కెలుంటాయిగా ఎవరి కోర్కెలు వారివి. ఎవరి ఆశలు వారివి.. నా ఆశలు ఫలించనందుకు నన్ను నేనే నిందించుకోవాలి.. విధికి తలవంచాలి. నా కోసమేగా మా ఆంటి ఈ ఊరు వచ్చింది. నా కోసమేగా నాన్నగారి ఆవేదన... అందరూ మంచివాళ్ళే. అందరికి నా నమస్కారాలు నీకు మాత్రం నా ప్రేమపూర్వక నమస్కారాలు .. స్వీకరిస్తావు కదూ. ! ఈ ఉత్తరమైనా నీకు అందుతుందనే ఆశ పడుతున్నాను.

అన్నట్టు అసలు విషయం చెప్పడం మరిచా... సరోజ ఎంతో మంచి అమ్మాయి. నేను సర్టిఫికెట్ ఇస్తున్నానని నవ్వకు మరి..ఆ అమ్మాయికి అన్యాయం జరుగకూడదనేదే నా కోర్కె.... నన్ను గురించి ఆలోచించడం లేదు శ్యామ్! సరోజ గురించే నా ఆలోచన. నన్ను నిజంగా ప్రేమించినవాడవైతే, నా మాట త్రోసిపుచ్చవు కదూ. నేను మళ్ళీ నిన్ను ఎప్పుడు చూస్తానో ఏమో...ప్చ్.. నాకే తెలియదు.. అందుకే ఇవన్నీ చెప్పేస్తున్నా. నేను ఎక్కడ వున్నా, ఎంత దూరాన వున్నా, ఈ శోభ నీ హృదయరాణి అన్న సత్యాన్ని మరచిపోవు కదూ. నేను ఎక్కడ వున్నా నీ ఎదపైవాలి తన్మయత్వం చెందినట్లే భావిస్తాను నా ఈ మాట నమ్ము. . ఐ లైక్ యూ శ్యామ్... ఐ లైక్ యూ...ఐ లవ్ యూ డియర్...ఐ .ల ..వ్...యూ!!.. .'

ఇంకా పైన సత్తువ లేనట్టుగా, చాలదన్నట్టుగా శోభ ఆ ఉత్తరం మీదనే వాలిపోయింది. మూతబడిన కనులు, చిక్కిపోయిన చెక్కిళ్ళు, పాలిపోయిన పెదవులు ఆ ఉత్తరం పైనే దోగాడాయి.

★ ★ ★ ★ ★

సుబ్బారావుగారి పరిస్థితి నిమ్మళించకపోగా మరింత తీవ్రమైంది.

వర్షాలు జోరుగానే కురుస్తున్నాయి. అప్పుడప్పుడు తెరపి ఇచ్చినా, మళ్ళీ మబ్బులు క్రమ్ముకు రావడం, వర్షం పడటం సాధారణమైంది. రోడ్లన్నీ బురదమయం.

సుబ్బారావుగారు వుంటున్న పూరికొంప వర్షానికి తాళ లేకపోయింది. ఇంటిలో గచ్చు లేదు. వర్షపు చినుకులతో మట్టినేల ముద్ద అవుతోంది. నీటిచుక్కలు గాక, ధారలుగా పడిన చోట్ల గుంటలు పడ్డాయి. ఆయన మంచాన్ని వర్షం పడని చోట ఓ మూలగా వేశారు చెక్కపెట్టి మీద ఓ చిన్న ట్రంకు పెట్టి వుంది. దాని మీద గుడ్డలు, వాటిలో కొన్ని తడిగుడ్డలు.

వున్న రెండు మంచాలలోను, ఒకదాని మీద సుబ్బారావుగారు పడుకున్నారు. సామాను తరలిస్తున్నప్పుడు రెండవ మంచం కోడు ఒకటి విరిగింది. అందువల్ల ఆ మంచం ప్రస్తుతానికి మూలపడింది. రెండు చాపలలో ఒకటి చింకిది. కొంచెం మెరుగ్గా వున్న చాపను, సుబ్బారావుగారు పడుకున్న మంచం మీద, వర్షపు బిందువులు పడకుండా, పందిరి వేసినట్టుగా, త్రాళ్ళతో పైభాగాన కట్టారు. అయినా, ఒకటి రెండు చోట్ల వర్షపు బొట్లుపడినందు వల్ల ఆ చాప మీద, పాత చీర ఒకటి విప్పి పరచారు. సుబ్బారావు గారికి కప్పిన దుప్పటి చలిని ఆపలేకపోతోంది. అందువల్ల, ఆ దుప్పటి మీద కూడా మరో రెండు పాత చీరలు కప్పవలసి వచ్చింది. అప్పటికే మందుల కోసమని, డబ్బు ప్రవాహంలా ఖర్చు అయింది. సరోజ కాళ్ళ త్రిప్పటకు అంతులేదు. తిండి కూడా సరిగా లేదు. ఆమె మరింతగా చిక్కిశల్యమైంది. ఆ ఇంటి పరిస్థితి దారుణంగాను, దయనీయంగాను తయారైంది. ఒక్క బంధువైనా వచ్చి ముఖం చూచిన పాపాన పోలేదు.

ఒకటి రెండుసార్లు సుబ్బమ్మగారు అన్నది భర్తతో –

'ఏమండీ, అబ్బాయిలకు ఉత్తరాలు రాయమంటారా?' అని.

కాని ఆయన తల అడ్డంగా ఊపారు ఇష్టం లేదు కొడుకుల పేరు చెబితే, ఆయన గుండె మరింతగా మండిపోతోంది.

'వద్దు .పిలిపించవద్దు వాళ్ళకు నేను తండ్రిని కానప్పుడు, వాళ్ళు నాకు కొడుకులు కారు. పరవాలేదు .. ఏం పరవాలేదు . అమ్మాయి పెళ్ళి అవుతుంది తప్పకుండా అవుతుంది...'

ఇలా అన్న కాసేపటిలో మళ్ళీ ఏవో ఆలోచనలు... వెంటనే అన్నారు...'నేనేమీ చేయలేను. ఈ దీర్ఘవ్యాధి నన్నేమి చేస్తుందో!?..'

ఆయనకు ఆయాసం, దగ్గు ఎక్కువైంది. పలురకాల ఆలోచనలతో సతమతమవుతున్నారు

'నేనిప్పుడు ఒంటరిగాడిని. ఏ బంధువూ రావడం లేదు . ముఖమైనా చూపడం లేదు. ఎంతమందికి ఎన్నివిధాల సహాయపడ్డాను. ఒక్కడికైనా విశ్వాసం లేదు. విశ్వాస ఘాతకులు. ఆ పరంధామయ్య ఎంత తియ్యగా మాట్లాడాడు. ఎంతో లాభానికి ఇల్లు కాజేశాడు మళ్ళీ ఇటుకేసి ముఖం చూపలేదు. ఆ శ్యామం గారి గురించి చెప్పినదంతా నిజమేనాఅని... . ఆయన మంచివాడు కాదా?.... యోగ్యుడు కాదా?.. . సరోజ మీద అనవసరంగా చేయి చేసుకున్నానా? ఏమి తోచడం లేదు. నిజం తెలియడం లేదు.... శ్యామం గారు మంచివాడే కావచ్చు. . అవును మంచివాడే . మంచివాడే.'

మళ్ళీ దగ్గు తెర. ఈ సారి అది ఉవ్వెత్తున వచ్చి శరీరాన్ని ఊపివేసింది. తట్టుకోలేక పోయారు. లేని బలాన్ని కూడగట్టుకుని, గుండెను అదుముకున్నారు ఆయాసం స్వాస సరిగా అందడంలేదు. శూలపోటు నరాలన్నీ జివజివలాడిపోతున్నాయి. సూదులతో పొడిచినట్టుగా శరీరమంతా మంటలు.

ఎందుకనో మరి. ఏదో నిర్ణయానికి వచ్చారు.

'ఏమేవ్!'

భార్య వెంటనే దగ్గరకు వెళ్ళింది. కళ్ళు తెరవలేకనే తెరవడానికి ప్రయత్నించారు. అన్నారిలా–

'శ్యామంగార్ని పిలిపించు...'

ఈ మాట వినగానే భార్యస్థబ్దురాలైంది. మరచిపోయిన శ్యామంగారు ఇప్పుడు ఎందుకు గుర్తు వచ్చారో ఆమెకు బోధపడలేదు మాట్లాడకుండా అలా నిలబడేవుంది.

'నిన్నే... పిలిపించు... ఆయన యోగ్యుడు. నాకు తెలుసు. తూలనాడాను అనవసరంగా... తప్పు. ఆయన ఎవరైనా గాని, చిన్నవాడే గాని .. క్షమాపణ చెప్పుకుంటాను'.

భార్య అంది దిగులుగా–

'అవునండీ, ఆయన యోగ్యుడే కావచ్చు. కాని, ఇప్పుడు దేనికి?'

సుబ్బారావు గారు ప్రయత్న పూర్వకంగా కళ్ళు తెరిచారు. అవి ఎర్రగా వున్నాయి. రక్తవర్ణ చారలతో నిండివున్నాయి. కోపంగా చూశాయి.

భర్త ఆవేదన గ్రహించింది భార్య.

బాగా చీకటి పడింది. బయట మళ్ళీ చినుకులు ప్రారంభమయ్యాయి. మేఘాలు ఢీకొని ప్రళయగర్జన చేస్తున్నాయి. ఏక్షణంలోనైనా కుంభవృష్టి తప్పదు.

సరోజ తల్లిదండ్రుల సంభాషణ విన్నది. జోక్యం చేసుకోడానికి ప్రయత్నించింది. కాని నోటమాటరాలేదు.

సుబ్బారావుగారి పరిస్థితి విషమించింది. కాని ఈ విషయం ఎవరికీ తెలియదు. చలిగాలితీవ్రతకు, దగ్గు తెరలు తెరలుగా వస్తోంది. ఆ దగ్గు తెరలధాటికి మంచంలోని శరీరం ఎగిరెగిరి పడుతోంది. భార్య మంచం ప్రక్కన కూర్చుని భర్త భుజాలు గట్టిగా పట్టుకుంది. అయినా దగ్గు తెరలు ఆగలేదు. దగ్గువచ్చి నప్పుడల్లా, విపరీతమైన ఆయాసం. దానితో పాటు కంఠస్వరం మొదట జీరగా మారి, ఆ తర్వాత కొంత సేపటి వరకు , మాటపోవడం జరుగుతోంది. ఈ సారి కూడా అలాగే జరిగింది. అంతేకాదు. బ్రావ్మంటూ

మొదట త్రేన్పి, గుటకలు మ్రింగి, ఆ వెంటనే బొళుక్కుమని కక్కుకున్నారు.

సుబ్బమ్మ గారికి కాలు, చేతులాడటం లేదు.

'అమ్మాయ్, త్వరగా వెళ్ళి డాక్టరు గార్ని తీసుకురా!.... ' అని చెప్పిందేగాని భర్త శరీరం గజగజ వణికి పోతోంటే పట్టుకుని ఆపలేక పోతోంది.

సరోజ లేచి,జుత్తుముడి వేసుకుని డాక్టరుగారికోసం బయలుదేరి వెళ్ళింది. త్రోవలో చినుకు పెద్దదయింది. అయినా ఆమె ఆగ లేదు గాలి తీవ్రత క్రమంగా పెరిగింది. అప్పటికి రాత్రి ఎనిమిదిగంటలు దాటింది. భయాందోళనలు ముప్పిరిగొనగా సరోజ చకచక నడుస్తోంది.

అదే సమయంలో అక్కడ?..... అనగా ఎక్కడ??

★ ★ ★ ★ ★ ★ ★

అక్కడ.... అల్లదుగో అక్కడ.... అందమైన సుస్యందన మందిరంలో...

రంగుటద్దాల కిటికీలమధ్య.... సిల్కు పరదాల అందాల వెనుక... దేదివ్యమాన దివ్య కాంతులనడుమ.. హంసతూలికా తల్ప సదృశమైన మెత్తని పాన్పుపైన పవ్వళించి వున్నది ఓ సుందరాంగి... అమృతమూర్తి నిర్మల ప్రేమకు ప్రతీక ఆమె హృదయం..... ఆమె వాణి అమరవాణి ... ఆ మూర్తి ఎవరు? శోభ.... శోభను రాణింపజేయగల శోభ..... ప్రేమ సామ్రాజ్యాధిదేవత. ..

ఆ పరుపు మీద పడుకుని, కళ్ళు మూసుకుంది. ఒకసారి తెరచింది గుండెలో మంటలు చెలరేగినట్లుంటే, రెండు చేతులతోను అదిమిపెట్టుకుంది. కడుపులో ప్రేగులు మెలివేసినట్లుంటే అటు ఇటు దొర్లుతూ గిలగిల లాడిపోయింది కళ్ళు తిరుగుతున్నట్లుంటే తెరువ లేక పోతోంది. వీస్తున్న గాలుల్లో చల్లదనం కనిపించలేదు. వెలుగుతున్న కాంతుల్లో వెలుతురు కనిపించడం లేదు.

వాంతులు వచ్చేటట్లు బాధ ... సత్తువ లేక లేవలేక పోయింది. ఒక్కసారి మాత్రం కళ్ళు తెరిచింది. అంతటి వేదనలోను నవ్వింది. ఎవరినో పిలుద్దామని ఆరాటపడింది. ఆ మాటలు పైకి రాకుండా గుండెలు అదిమివేశాయి. సుదూరాల నుంచి ఎవరో పిలుస్తున్న అనుభూతి. ఆ రూపం అస్పష్టమైనా, పిలుపు స్పష్టంగా వున్నట్లేవుంది కళ్ళు తిరుగుతున్నాయి. మగతలాంటి దేదో జనిస్తోంది. అప్రయత్నంగా పెదవులు కంపించాయి. అయితే అవి ఎవరికి వినిపించని మాటలు... కాదు... శబ్దాలు. . ఆ శబ్దాలకు అర్థం బహుశా ఇది కాబోలు....

'అమ్మా.... నేనూ.. .. వ... స్తు... న్నా ...!'సిల్కు పరదాలు అటు ఇటు వూగాయి. దూసుకొచ్చి తిరిగి బయటకుపోయిన గాలులు వింత శబ్దాలు చేశాయి. అది నేపథ్య సంగీత సమ్మిళితమైన వీడ్కోలు కాబోలు.....!

★ ★ ★ ★ ★ ★ ★

సరోజ బట్టలు తడిచిపోయాయి. అంతకుముందు వేసుకున్న ముసుగు తీసివేసింది. ఆమె శరీరమంతా వర్షంలో తడిచి ముద్దయింది. ఒక బజారు దాటే సరికి గాలుల తీవ్రతకు, తీగలు ఊగిసలాడి వీధి దీపాలు ఆరిపోయాయి అంతా చీకటిమయం.

రోడ్లమీద గుంటలు. ఆ గుంటల్లో వర్షపునీళ్ళు. రాకపోకలు బాగా తగ్గిపోయాయి.అయినా అక్కడక్కడ ఒకటి, అరా రిక్షాలు కనబడుతున్నాయి.

సరోజ నడక, ఆ వర్షంలో, జోరుగా సాగిపోతూనేవుంది శక్తి లేని కాళ్ళు చప్పబడి అప్పుడప్పుడు తప్పటడుగులు వేస్తున్నాయి. తడబడుతున్నాయి. నడుస్తోంది .. వేగంగా నడుస్తోంది.మధ్యలో ఓ ఆలోచన. అవతల ప్రక్క రోడ్డులోనే శ్యామం ఇల్లు. వెడదామనుకుంది. కాని, మనస్సు ఒప్పుకోలేదు. అయినా, అప్రయత్నంగా కాళ్ళు అటువైపుకే నడిచాయి. వెళ్ళింది. శ్యామం ఇల్లు వచ్చింది. గేటు త్రోసుకుని లోపలికి ప్రవేశించింది.

శబ్దం విని శ్యామం బయటకు వచ్చాడు సరోజను గుర్తుపట్టాడు.

'సరోజా, త్వరగా రా లోపలికి.. ' పిలిచాడు బిగ్గరగా శ్యామం.

తడి బట్టలు నీళ్ళు కార్చుతోంటే, గుమ్మంలో అడుగు పెట్టింది వర్ధనమ్మ లోపలవుంది. సరోజ వచ్చిన విషయం ఆమెకు తెలియదు.

శ్యామంతో అంది సరోజ–

'మానాన్నగారు మిమ్మల్ని చూడాలంటున్నారు. ఒకసారి వస్తారా?'

శ్యామం ఆశ్చర్యపడ్డాడు. తనను రోడ్డుమీద పట్టుకుని లేనిపోని మాటలు అన్న విషయం వెంటనే జ్ఞాపకం వచ్చింది. అయినా, ఆ విషయాలేవీ ప్రస్తావించకుండా...

'చూడట మేమిటి ఇంత రాత్రివేళ వర్షంలో ఎందుకు బయలుదేరినట్టు?'

'నాన్నగారి పరిస్థితి బాగోలేదు మాకు చాలా భయంగా వుంది. అక్కడ ఏమైందో ఏమో రండి త్వరగా.'

'డాక్టర్ని తీసుకొచ్చారా?'

'ఆయన దగ్గరికే బయలుదేరాను'.

'మంచి పనే చేశావు. ముందు డాక్టర్ని తీసికెళ్ళకుండా నాదగ్గర కొచ్చావా వెళ్ళు త్వరగా '

'అయితే, మీరు?'

ఈసారి సరోజ వదనంలో విషాదం గూడుకట్టుకుంది శ్యామం ఒక్క క్షణం మవునంగా వున్నాడు తలవంచి.

సరోజ రెండు చేతులు జోడించి నమస్కరిస్తూ–

'నేను మిమ్మల్ని ఏమి కోరడం లేదండీ... దణ్ణంపెట్టి ప్రాధేయ పడుతున్నాను. దిక్కులేని వాళ్ళమయ్యాము. ఒక్కసారి రండి నాకేదో భయంగావుంది...' ఆమె కంఠస్వరం గాద్గధికమైంది

శ్యామం తలయెత్తి, సరోజ కళ్ళల్లోకి సూటిగా చూశాడు. ఎందుకోగాని తటపటాయిస్తున్నాడు. అందుకేపెదవి ఇంకావిప్పలేదు

సరోజ మరింత దిగజారి పోయింది. దుఃఖాన్ని ఆపుకోలేక పోయింది రుద్ధకంఠంతో మళ్ళీ అంది.....

'శ్యామంగారు, మీరు తప్పక వస్తారన్న ఆశతో వచ్చాను. పోనీలెండి. .. ఆ భగవంతుడే వున్నాడు... ' అంటూ ముకుళిత హస్తాలతో నే వెనుదిరిగింది






'ప్చ్..... ఇదేన్యాయం.... ఇదే ప్రపంచం' అని తనలో తాను వాపోతూ గేటుదాటింది. చీకట్లో కలసిపోయింది.

వర్ధనమ్మ కొడుకుదగ్గరకు వచ్చి

'గేటు తీసి వుందేమిరా, ఎవరొచ్చారేమిటి ?' అని అడిగింది.

'సరోజ'....

'సరోజా, దేనికి ఇంతరాత్రి వేళ?'

'నేను , సుబ్బారావుగారింటికి వెళ్తొస్తాను.'

'దేనికి ? '

'ఆయనకు జబ్బుగా వుందట. పరిస్థితి బాగోలేదట.'

'రేపు వెళ్ళొచ్చుగా, ఈ వర్షంలో దేనికి'

శ్యామానికి కోపం వచ్చి వెంటనే అన్నాడిలా–

:నువు కాస్త నోరుమూసుకుని లోపలికి పో. నీతో వాదించడానికి ఇది సమయం కాదు. అవతల , ఆయన పరిస్థితి బాగోలేదని చెబితే అర్థంకాలేదా?'

శ్యామం, తల్లితో ఇంత కటువుగా ఎప్పుడూ మాట్లాడలేదు.

'ఏంరా, నీకు మతిగానీ పోయిందా' వర్ధనమ్మగారు పౌరుషంతో రెట్టించింది.

'షటప్, మీరు మనుషులు కారు. ఇంగిత జ్ఞానం కూడా లేదే....' అంటూ శ్యామం ఆ పళాన చెప్పులు వేసుకుని, వెనుదిరిగి చూడకుండా, ఆ వర్షంలో నే వెళ్ళి పోయాడు. స్కూటర్ మీద వెడదామని గాని, గొడుగు అవసరమని గాని ఆ సమయంలో అతనికి తట్టనే లేదు.

కొద్దిదూరం వెళ్ళేసరికి వర్షం కుంభవృష్టిగా మారింది. రిక్షాకోసం చూచాడు. ఒక్కటీ కనిపించలేదు . తుఫానులా హోరు మంటూ గాలులు వీస్తున్నాయి. శ్యామం ముద్దలా తడిచి పోయాడు. ఎంత పెద్ద అంగలు వేద్దామన్నా, హోరుగాలులు వెనుకకు నెట్టి వేస్తున్నాయి. మెరుపు మెరిస్తే తప్ప త్రోవ కనిపించడం లేదు.

ఆ కుంభవృష్టి జోరు, గాలుల హోరు భీకరంగా వినబడుతోంది. చెవులు దద్దరిల్లిపోతున్నాయి. ఈ హోరు గాలులధ్వనిలో నే సరోజ అన్న రెండుమాటలు తన చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి.

'నేను మిమ్మల్నేమీ కోరడం లేదండి.... దిక్కులేని వాళ్లమయ్యాము... ప్రాధేయ పడుతున్నాను....'

సుదూరాల నుంచి శరవేగంతో వస్తున్న ఈ ధ్వని తరంగాలు సుడులు తిరుగుతూ వచ్చి అతని చెవుల్లో మార్మోగుతున్నాయి. ఇవి వినపడే కొద్దీ సరోజ పెద్దగా అరుస్తున్నట్లు, పరుగెడుతున్నట్లు అతడికి తలపించింది. భయపడ్డాడు. నడక వేగం హెచ్చింది.

ఇప్పుడతడు పరుగెడుతున్నాడు. ఆ పరుగులోని అడుగుల ధాటికి నీళ్ళు చ్రేలి, అతనిమీద త్రుళ్ళుతున్నాయి. శరీరాన్ని ఛెళ్ళున కొడుతున్నాయి.

ఇంకా సుబ్బారావుగారి ఇల్లు దూరానే వుంది.

★ ★ ★ ★ ★ ★ ★

సరోజ డాక్టరుగారితో పాటు కారులో కూర్చుని ఇంటికి వెళ్ళింది. కుండపోత వర్షం వల్ల ఇల్లంతా బురద మయమైంది. మంచం పైగా కట్టబడిన చాప పూర్తిగా తడచి పోయినందువల్ల సుబ్బారావు గారి శరీరం మీద నీటి చుక్కలు పడుతున్నాయి. భార్య ఏమి చేయలేకపోయింది. అక్కడవున్న మంచాన్ని కదిపితే మరెక్కడైనా నీటిధారలే. అది ఇల్లు కాదు. పేరుకు మాత్రమే ఇల్లు. సామగ్రి అంతా తడిచిపోయింది. సుబ్బమ్మ గారు కూడా తడిచి ముద్దయింది.

డాక్టరుగారు వచ్చారు. సుబ్బారావుగారిని పరీక్షించారు. ఇంజక్షన్ ఇవ్వడానికి ఉద్దేశించి, చేతిమీద వున్న చీర మడతను, దాని క్రిందవున్న దుప్పటిని తొలగించ బోయారు. నిట్టాడి స్తంభానికి వున్న గుడ్డిదీపం వెలుతురులో సుబ్బారావు గారి ముఖాన్ని ఓ సారి చూచి ఆగిపోయి లేచి నిలబడ్డారు. మణికట్టు పట్టుకుని చూచి, క్షణంసేపు ఆగి, ఆ చేతిని వదలిపెట్టారు.

'డాక్టరుగారూ.... ఇంజక్షన్ చేయలేదేం....?' సుబ్బమ్మగారు అడిగింది ఆందోళనతో .

'అవసరం లేదమ్మా,' డాక్టరుగారి ముక్తసరి సమాధానం.

'ఎందుకనండీ.... '

ఈసారి ఆయన సరోజ వైపు చూచి ఇలా చెప్పారు–

'అమ్మా, సరోజా, మీ బంధువులకు కబురు చేయవచ్చు. నేనిక్కడకు రాకముందే..... ' ఇకాతర్వాత ఆయన మాట్లాడలేదు. అక్కడనుంచి వెళ్ళిపోయారు.

ఈ మాటలు చెవిని పడగానే సుబ్బమ్మ గారి మతి భ్రమించింది. రెండు చేతులతోను తల మీద ఎన్నోసార్లు బాదుకుంది. ఆ వెంటనే భర్త పాదాల మీద పడిపోయి రోదిస్తూ, మంచంపట్టిమీద కూడా నుదుటిని కొట్టుకుంది.

ఇక సరోజ......

'అమ్మా, నాన్నా.....' అంటూ ఏమిచేయాలో తోచక మంచందగ్గరకు వచ్చి, నాన్నను తాకి, అమ్మను తాకి, గుమ్మానికి ఢీ కొని, గోడకు కొట్టుకుని, నేల మీద రొచ్చులో జారి పడింది. లేచి నిలబడ బోతూ మళ్ళీ పడింది. ఈ సారి తల్లి పాదాల మీద పడింది. తండ్రి పాదాలు మరోసారి తాకింది. కళ్లకు అద్దుకుంది... తూలుతూనే నిలబడింది.....

తలుపులు, గాలివేగానికి దభీమని కొట్టుకున్నాయి.

'సరోజా!....' ఎవరో అరిచారు పెద్దగా.






# సాగర్ స్కిమ్ మిల్క్‌తో ఆతిథ్యం

మీ యింటికెవరైనా రాగానే, గడపతొక్కి లోపలికి రాగానే, మీ అతిథులకి మీరు చేసే సత్కారం ఏమిటి? ఓ చిరునవ్వు, ఓ కప్పు టీ—అవునా? మరి పరంపరాగతంగా వస్తూన్నదది—మీ సంప్రదాయం, సంస్కృతి, ఆదరణ-వీటి చక్కని పరిణామ స్వరూపం.

మరి వాళ్ళొచ్చేసరికల్లా మీ యింట్లో పాలు అయిపోయాయనుకోండి. మీకెలాగో యిబ్బందిగా అనిపించదూ? ఇక అప్పుడి కప్పుడు ఉన్న పళంగా పాలు రమ్మంటే ఎలా వస్తాయి గనక? సాగర్ స్కిమ్ మిల్క్ పౌడర్, మరి మీ అమ్మగారి, అమ్మమ్మగారి నుంచీ తరతరాలుగా వస్తూన్న ఆ చక్కని సంప్రదాయాన్ని నిలబెడుతుందిక. అది గూడా, పొదుపుగా, త్వరగా, తేలికగా. ఇక తీపి పదార్థాలూ, పుడ్డింగులూ అవీ చేసుకోవడానికి యిదెందో బాగుంటుంది.

ఆకర్షణీయమైన కొత్త ప్యాక్‌లో




ASP/SMP/5/84 R

## సాగర్
### స్కిమ్ మిల్క్ పౌడర్

పాలలోని మంచిదనాన్నంతా యిస్తుంది, కొవ్వు పదార్థాలు లేకుండానే.



మార్కెట్ చేసేవారు:
గుజరాత్ కోపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్
పోస్ట్ బాక్స్ 10, అనంద్ 388 001. గుజరాత్.

'సరోజా!!' పిలిచారు మళ్లీ. ఎవరు? ఎవరూ కాదు. మరి?.... తన మనసే. ఎందుకు?.... 'సరోజా! నీకిలోకంలో స్థానం లేదు. నీ కారణంగా తండ్రి మరణించారు. కుటుంబం నాశనమైంది. నీవు పాపాత్మురాలివి. నీకి ఇంట్లో చోటు లేదు.. లేదు.... ఫో. . ఫో...'

'అమ్మా!' అని సరోజ కీచుగొంతుతోనే కేకపెట్టింది. అదొక వెర్రికేక. రొప్పుతూ, రోజుతూ, గుమ్మందాటి బయట పడింది. నాలుగు అడుగులు వేసి రోడ్డు మీద నీళ్లల్లో పడింది ... లేచింది.

'ఫో... ఫో... ' 'పోతున్నా.... ' 'నేనిక బ్రతకను... ' మళ్లీ పెద్దగా కేక. భయంకరమైన కేక. వణికిపోతోంది. శరీరం పోతోంది... ఎక్కడికి... ?

శ్యామం వస్తున్నాడు. వేగంగా వస్తూ, కేకలు వినబడిన వైపు చూచి పరుగెత్తాడు. తూలిపడిపోతున్న అమ్మాయిని పట్టుకున్నాడు.

ముఖం చూడగా– సరోజ.

'సరోజా!' శ్యామం అన్నాడు. ఆ వర్షంలో పెద్దగా అన్నా వినబడదు. సరోజ పలకలేదు. మూతపడుతున్న కళ్లు తెరిచింది. శ్యామాన్ని చూచింది. గుర్తుపట్టింది. శరీరం మళ్లీ గగుర్పొడిచింది. రెండు చేతులూ జోడించి నమస్కరించింది

'నాకెవ్వరూ లేరు. నేను మహాపాపిని. దయచేసి నన్ను విడిచి పెట్టండి. మీ. పాదాలకు మొక్కుతాను .. '

'సరోజా! ఏమిటి మాటలు... ఏమైంది?'

'నేనేమి చెప్పలేను. మానాన్నగారు లేరు. చచ్చిపోయారు. నేనూ లేను. బ్రతికున్నా శవాన్నే. నన్ను వదలండి. బాబూ నన్ను పోనివ్వండి.... '

శ్యామం కళ్ల వెంబడి నీళ్ళు ధారకట్టినా, వర్షపు ధారల్లో అవి కలసిపోయాయి.

'సరోజా, ఇంటికి పద.... ఊ.... ' ఈ సారి గద్దించక తప్పలేదు.

సరోజ ఆగింది శ్యామం ఆమెచేయి పట్టుకుని నడిపించాడు. ఇల్లు చేరారు

భర్త పాదాల మీద సుబ్బమ్మగారి శిరస్సు వాలిపోయి వుంది. ఆమెకు స్పృహ లేదు కాబోలు. శ్యామం, సరోజ కలసి ఆమె తలకు గుడ్డ కట్టారు.

తడి నేల మీదనే, తడి చాపమీదనే బొంత వేసి , చీరపరచి మెల్లగా తల్లిని పడుకోబెట్టింది సరోజ.

అప్పటికిక చేసేది లేక శ్యామం, సరోజ ఓ అరగంట సేపు వణుకుతూనే నిలబడ్డారు.

## పానశాలలే!

పూబోణుల పెదవులు
ఉన్నత పదవులు
పానశాలలే!
సమస్త సౌఖ్యాల్ని
కరతలా మలకం గావించి
మత్తును కలుగచేస్తుంటాయి
పిచ్చి పిచ్చిగా వాగింప జేస్తుంటాయి!

— కె. కిశోరుబాబు
—కె. అశోకుబాబు

వర్షం తగ్గింది. కొద్దిసేపటికి వెలిసింది.

బావురు కప్పల అరుపులు ప్రారంభమయ్యాయి. అప్పుడే పరుగున వచ్చిన పిల్లి పిల్ల ఆ పూరింటిలో ఓ మూలన చేరి చలికి తాళలేక వణికిపోతూ అరుస్తోంది. దండేం మీద వ్రేలాడుతున్న గుడ్డలు, పీలికలు సన్నని గాలికి ఊగిసలాడుతున్నాయి. వర్షం ఆగిపోయినా, తాటాకులలో నుంచి, లయబద్ధంగా నీటి చుక్కలు పడి చప్పుడు చేస్తున్నాయి. నిట్టాడి స్తంభానికి తగిలించిన దీపపు బుడ్డి పొగచూరిన చిమ్మిలోంచి వెలుగును ఇవ్వలేక సతమత మవుతోంది.

సుబ్బారావుగారి భవుతిక దేహం మంచంలో పడివుంది. చెంపలు లొట్టలు పడ్డాయి. కనురెప్పలు సగంవాలివున్నాయి.

స్వాతంత్ర్య సమరయోధుడు, త్యాగమూర్తి, ఆపద్బాంధవుడు, నిరాడంబరుడు, జాతీయవాది,–అయిన శ్రీ సుబ్బారావు గారు మరి లేరు.

ఆయన ఈ లోకం దృష్టిలో అనామకుడే అయినా.... నిజానికి అమరజీవే.

శ్యామం వెళ్ళి సుబ్బారావు గారి కొడుకులకు టెలిగ్రామ్‌లు ఇచ్చి వచ్చాడు. మరుసటి రోజున ఊళ్లోవున్న బంధువులు కూడా వచ్చారు. కొడుకులు, కోడళ్ళు రాగానే అంత్యక్రియల తతంగం పూర్తి చేశారు.

## 12

శ్యామం మనసు చికాగ్గా వుంది. ఆఫీసు రూములో కూర్చున్నాడు. ఏ ఆలోచనలు రాకపోయినా, ఆలోచిస్తున్నట్టుగానే వుంది అతడి ముఖం చూస్తే. ఇంతలో ఫోను రింగ్ అయింది. మొదట రిసీవరు ఎత్తలేదు. స్పృహలోకి వచ్చాడు కాబోలు. వెంటనే రిసీవరు తీసి చెవికి ఆనించుకున్నాడు. ఎవరిదో కంఠస్వరం గాద్గదికంగా వుంది.

'బాబు, మీరేనా శ్యామంగారు!'

'అవునండీ ... మీరు ...?'

'నేనే బాబు అభాగ్యుణ్ణి ... మాధవరావుని ...'

'మీరు, శోభారాణి ...'

'అవును నాయనా ... ఇంకెక్కడ శోభారాణి. అందర్నీ విడిచి వెళ్లిపోయింది. మీరు తప్పకుండా రావాలని కోరుతున్నాను. నేను వచ్చే స్థితిలో లేను. దయవుంచి రండి ...' మరుక్షణంలో లైన్ కట్ అయింది.

శ్యామం చేతిలోని రిసీవర్ అలాగే వుంది. చేయితోపాటు అది కూడా కంపించింది. క్రెడిల్ చేశాడు దాన్ని మెల్లగా.

అతనికేమి తోచలేదు. అతని జీవితంలో ఎన్నడూ లేనంతగా బాధపడుతున్నాడు. శోభతో సంబంధాలు తెగిపోయి చాలా రోజులైంది. ఆకస్మికంగా ఇప్పుడీ విషాద వార్త విన్నాడు. ఇంతకుముందే, ఆప్తుడైన సుబ్బారావుగారి మరణం కళ్లారా చూచాడు. ఇప్పుడు మళ్లీ ఈ పిడుగులాంటి వార్త. జాతస్య మరణం ధ్రువం, అన్న సూక్తి ఆకస్మికంగా మనసులో మెదిలింది. అయోమయ స్థితిలో, ఆఫీసు గదికి తాళం వేయడం కూడా మరచిపోయి, స్కూటర్ ఎక్కి వెళ్లిపోయాడు.

మాధవరావు ఇంటిముందు కార్లు బారులు తీరి వున్నాయి. ఆ పేటలోని జనమంతా గేటు బయట నిలబడి చూస్తున్నారు. బంధువులు, మిత్రులు లోపలకు వెడుతున్నారు. శ్యామం నేరుగా లోపలికి వెళ్లాడు. సింహద్వారం నుంచే కనపడుతోంది పుష్పాలంకృతమై శోభాయమానంగా వున్న శోభ ...

ఆమె మంచం చుట్టూ సుమారు పది అడుగుల పరిధి ప్రదేశం ఖాళీగా వుంది. బంధు, మిత్రులు ఆ పరిధికి వెలుపల చుట్టూ నిలబడి వున్నారు.

అప్పటికి మధ్యాహ్నం ఒంటి గంట దాటింది. మాధవరావు నాయుడుగారు శ్యామాన్ని చూచి, దగ్గరకు వచ్చారు. నోట మాట లేదు ... శ్యామం కూడా మాట్లాడలేదు.

తనదే లోపమని నాయుడుగారి బాధ.

తనదే లోపమని శామం వ్యథ.

కొద్ది క్షణాల ఆగి నాయుడుగారు ఒక లేఖను శ్యామం చేతికి ఇచ్చి, రెండు చేతులు పట్టుకుని,, తల వంచారు. అప్పటికే ఆయన కళ్లలో నీళ్ళు ఇంకిపోయాయి.

'క్షమించరాని నేరం చేశాను. నా జీవితానికిక నిష్కృతిలేదు ...' 'అనీ చెప్పాలన్నదే ఆయన తపన.

శ్యామం మరింత దిగజారిపోయాడు. తన వస్తువును పోగొట్టుకున్నట్టు, అది ఇక శాశ్వతంగా లభించదన్నట్టు, అమాయకంగా చూస్తున్నాడేగాని, పెదవి విప్పి ఒక్క అక్షరం కూడా పలకలేకపోతున్నాడు.

ఓ ప్రక్కగా తప్పుకుని ఉత్తరం తెరచి చదివాడు. అది బాగా నలిగిపోయినట్టుంది. గబగబ చదివాడు. సగం చదివిన తరువాత కన్నీళ్ళు అడ్డు రాగా, కొద్ది క్షణాలు ఆగి కళ్ళు మూసుకున్నాడు. కళ్ళు తెరచి మళ్ళీ చదివాడు. వెంటనే ఆ ఉత్తరానికి తిరిగి జాబు రాద్దామనుకున్నాడు. ఏమిటీ వెర్రి ఆలోచన ... తలయెత్తి చూస్తే శోభ కనపడుతోంది.

ఓ పూలమాలను ఎవరో అందించారు. అందుకుని ప్రక్కకు తిరిగి చూశాడు. ఆమె సరోజ.విషణ్ణ వదనంతో వుంది. తనకంటే ముందు కొందరు శోభ భౌతికదేహంపై దండలు వుంచారు. వారు ఆమె మెడలో వేశారు.

శ్యామం చేతిలో దండ వుంది. మెల్లగా అడుగులు వేసి, తలవైపు వెళ్ళడానికి బదులు, కాళ్లవైపు వెళ్లాడు.

శోభ వదనంలోకి చూస్తూ, తన చేతిలోని దండను ఆమె పాదాల మీద వుంచాడు. అంతేకాదు. ఆ సుకుమారి పాద ద్వయాన్ని తాకాడు.

నిద్రమాత్రలు లెక్కకు మించి ఒకేసారి వేసుకున్నందువల్ల ఆమె ముఖం ఉబ్బి ఉంది. శరీర ఛాయ బంగారు వన్నెకు బదులు నీలి రంగులోకి మారింది. తల ప్రక్కకు వాలి వుంది. కళ్ళు మూతలు పడే వున్నాయి. సుఖంగా నిద్రపోతున్నట్టుంది.

శ్యామం కళ్ళు గట్టిగా మూతలుపడ్డాయి. ఆ ప్రేమమూర్తి పాదద్వయాన్ని అతని చేతులు మరోసారి తాకాయి. కన్నీళ్ళు జలజల రాలి ఆమె పాదాలను అభిషేకించి, తమ రుణం తీర్చుకున్నాయి. ఆ సమయంలో శ్యామ్ మనోనేత్రాల ముందు శోభ ప్రత్యక్షమైంది ... 'శ్యామ్! నిన్ను చేరలేక, పొందలేక దూరాలకు, సుదూరాలకు వెళ్ళిపోయానని బాధపడుతున్నావు కదూ ...'!? అన్నట్టుగాను, ఆవేదనతో చూస్తున్నట్టుగాను తలపించింది. శ్యామం కడుపు తరుక్కుపోయింది. అతని ప్రమేయం లేకుండానే, అతని మనసు ఇలా పలికింది-'

"శోభా! పార్డన్ మి. ఐ కన్ఫెస్ మై గిల్ట్. బట్ ఐ సిన్సియర్‌లీ లవ్డ్ యూ. ఇట్ ఈజ్ ట్రూ. ఐ ప్రామిస్, దట్ ఐ వొబే యువర్ విల్ ...."

ఇదే అతని శ్రద్ధాంజలి ... ఇదే అతని బాష్పాంజలి. ఇదే అతని ప్రేమాంజలి. మరొక్కసారి కళ్ళు తెరచి శోభ వదనాన్ని చూచాడు. అదే ఇక, అతని కడసారి చూపు. వెనుదిరిగాడు. కాళ్ళు మెల్లగా అడుగులు వేశాయి ... వెళ్ళిపోయాడు. శ్యామం వెంట, సరోజ కూడా వెళ్ళింది. ఇదేమీ గమనించలేదు శ్యామం. అతడు ఇంటికి చేరిన కొద్దిసేపటికి, సరోజ వెళ్ళింది.

శోభ ఉత్తరాన్ని సరోజ చేతికి ఇచ్చాడు. ఆమె కూడా చదివింది. అది ఇతరులకు ఉత్తరం కావచ్చు. కాని శ్యామం దృష్టిలో మాత్రం అది శోభ వీలునామా ...

సరోజను చూస్తూ అన్నాడు శ్యామం -

'సరోజా! ఈ రోజు నుంచి నీవు నా సహధర్మచారిణివి. అంగీకరిస్తావు కదూ. ఇది శోభ వీలునామా. నేను పాటించక తప్పదు. ఆ దేవత ... ఆ దేవత ...'

ఇంకేమీ చెప్పలేకపోయాడు.

సరోజ గుండె నీరైంది.

'మరి పసిపిల్లవాడిలా ఏమిటండీ ... ఊరుకోండి ...', అంటూ శ్యామం రెండు చేతులు పట్టుకుంది. ఒక చేతో తల నిమురుతూ, మరో చేతో కన్నీళ్ళు తుడిచింది.

'ఏమండీ! ఇటు చూడండి .... నాలోకి చూడండి.'

శ్యామం చూచాడు అలాగే.

'నాలో మీకు శోభ కనపడుతోంది కదూ! ...'

అవునన్నట్టు తల వూపాడు.

శ్యామం తదేకంగా చూస్తూ అన్నాడు. -

పవిత్రమైన ప్రేమకు ఆహుతైపోయింది శోభ.

పవిత్రమైన జీవితానికి బలిదానమయ్యారు సుబ్బారావుగారు. ఆ పవిత్రమూర్తులిద్దరికీ నా బాష్పాంజలి.

★ ★ ★ ★ ★

చివరగా ఓ మాట ...

శోభకు శ్రద్ధాంజలి ఘటిస్తూ 'ఐ కన్ఫెస్ మై గిల్ట్ ...' అన్నాడు శ్యామం. అయితే తప్పును ఒప్పుకున్నంత మాత్రాన, తప్పు, తప్పు కాకుండా పోదు. ఎంత చదువుకున్నవాడైనా శ్యామం కూడా సామాన్య వ్యక్తే. ఇతరులు తొందరపాటులోను, ఆవేశంలోను వచ్చే నిర్ణయాలకు శ్యామం బాధ్యతకూడా వుంది. ఎదుటివారి నిర్ణయాలకు తాను ఆలంబనం కావడమూ, తావివ్వడమూ అతను చేసిన పొరపాటు. సున్నిత హృదయం కలవారితో ముఖ్యంగా, వయసొచ్చిన ఆడపిల్లలతో, యువకులు ఎంతో జాగ్రత్తగా మాట్లాడాలి. రూపం యొక్క ఆకర్షణే గాక, మాటల ప్రభావం కూడా ఎంతో బలంగా పనిచేస్తుంది. శ్యామం, ఆవేశంలో 'ఐ లైక్ యూ ...' అన్న మాట, చివరకు ఎలాంటి విషాదకర పరిణామాలకు దారితీసిందో బోధపడుతోంది.

★ సామాజిక సంబంధాలు కొన్ని కట్టుబాట్లను నిర్దేశిస్తే, ఆర్థిక సంబంధాలు మన జీవితాలను శాసిస్తాయి.

అంతేకాదు -

ప్రతి మనిషి సహజంగానే ఉన్నతుడు కాకపోవచ్చు. కాని ఔన్నత్యం సాధించడానికి ప్రయత్నించాలి. ఉదాత్తమైన సంస్కృతి - విజ్ఞానం. ఇవి రెండూ రెండు నేత్రాలు. ఈ నేత్రాలతో సమాజాన్ని చూచి, అర్థం చేసుకోగలగడమే విజ్ఞత అవుతుంది. ఇదే వ్యక్తికీ, సమాజానికీ కూడా వెలుగుబాట చూపుతుంది

(అయిపోయింది)



# ఏకాకి

## ఇందూ రమణ

కార్తీకమాసం!

తొలి వారం. తెల తెలవారుతుండగనే నిద్ర లేచాను. పిల్లలు గాఢ నిద్రలో ఉన్నారు. శకుంతల ఆదమరచి నిద్రపోతోంది.

గావంచా పట్టుకుని కోనేరుకు బయల్దేరాను.

మూడు దాటి నాలుగ్గంటలు కావస్తోంది. కొండ పైకి వెళ్ళడానికి 'అర్చకులు అందరూ బస్సు స్టాండ్‌లో మూగి ఉన్నారు. దేవస్థానం బస్సు ఇంకా షెడ్డు నుండి పైకి రాలేదు.

'అర్చకులు' కొండ పైకి వెళ్ళి సింహాద్రప్పన్నకు 'మేలుకొలుపు' పాడి కోవెల్ని సంప్రోక్షన చేసి అప్పుడు లోకానికి శుభోదయం పలుకుతారు.

ఉదయం ఆరోగంటకు 'దైవ దర్శనాలు' ప్రారంభమౌతాయి.

కార్తీక మాసం అంటే పిక్‌నిక్‌ల మాసం. అదీ మొదటి ఆదివారం కావడం చేత విశాఖ నుండి.... చుట్టుప్రక్కల గ్రామాల నుండి అందరూ ఇక్కడికే వస్తారు. ఒకవిధంగా మా వూరు పుణ్యక్షేత్రం కావడమే అందుకు కారణం. అదీగాక అడవి ప్రాంతం కూడా!

నేను బజార్లో కొచ్చేసరికి అప్పటికే ఎక్కడెక్కడి నుండో వచ్చిన వాళ్ళు తోటలు వెదుక్కోవడానికి తమ సరంజామాతో అటూ ఇటూ తిరుగుతున్నారు అయోమయంగా.

బజార్లోని 'టీ' దుకాణాలన్నీ రెండు గంటలకే తెరుస్తారు రోజూ !

నేను 'చెఱువు'ను చేరుకొనే సరికి దేవస్థానం వారి 'కఛేరి'లో నాలుగు గంటలు కొట్టారు. 'నాలుగయిందన్న మాట! అనుకుంటూ చెఱువులోకి దిగాను. స్నానం ముగించుకొని సంధ్యావందనం చేసి తిరుగు ముఖం పట్టాను.

యాత్రీకులు తండోప తండోలుగా చెఱువుకు వెళుతున్నారు.

ఆ రోజు –

నాకు రచయితల పిక్‌నిక్ తగిలింది. పాతిక మందికి వంట చెయ్యాలి. ఏభై రూపాయలకు ఒప్పందం. వాళ్ళు ఉదయం అయిదో గంటకి వచ్చేస్తామన్నారు. అందుకే నా పని ముగించుకొని సిద్ధంగా ఉంటే మంచిదని సంసిద్ధున్నవుతున్నాను.

నేను తిరిగి కోనేరు నుండి బజార్లో కొచ్చేసరికి అయిదయిపోయింది. ఆకాశం తెలతెల్లగా అప్పుడే విచ్చుకోబోతున్న మల్లిలా ఉంది.

బజారంతా యాత్రీకులతోనూ... పిక్నిక్ వాళ్ళతోనూ రద్దీగా... మహాసందడిగా ఉంది. వ్యాపారస్థులంతా ఎవరి 'యావ'లో వాళ్ళున్నారు.

కొండ మీద దేవాలయంలో సుప్రభాతం వేసినట్టుంది. పైనుండి క్రింది వరకూ దారి పొడుగునా 'మైక్‌లు' అమర్చడం వలన సుశీల పాడిన సుప్రభాతం శ్రావ్యంగా వినిపిస్తోంది.

సింహగిరి పర్వతాల్లో ప్రతిధ్వనించి గాల్లో కలిసిపోయి క్రింద వూరు వూరంతా ఆక్రమించుకుంది సుప్రభాతం.

సుప్రభాతం వింటూ నడుస్తోంటే హాయిగా ఉంది.

ఇంటికి వెళ్ళేసరికి శకుంతల లేచి వరండాలో కూర్చొనుంది. పిల్లలిద్దరూ ఇంకా నిద్రావస్థ నుండి మేల్కోలేదు. చలమయ్య శాస్త్రి వాలు కుర్చీలో కూర్చొనున్నాడు.

చలమయ్యశాస్త్రి!

రాజమండ్రి దగ్గరున్న వేమగిరి నుండి వచ్చాడు. మా స్వస్థలం వేమగిరే!! కానీ, చలమయ్యశాస్త్రి ఇంత హఠాత్తుగా రావాల్సిన అవసరం ఏమిటి? తనకి ఎప్పుడైనా అవసరమొచ్చి... తనకి బిజీగా ఉంటే సహాయానికి రావాల్సిందిగా తనే ముందు ఉత్తరం వ్రాస్తే వచ్చే వాడు చలమయ్యశాస్త్రి! కానీ.....?!

శకుంతల తన మానాన తను గోడకు జేరగిలబడి ఉంది. ఆమెలో ఎక్కడా చైతన్యం లేదు. చలమయ్యశాస్త్రి ఏదో పోగొట్టుకున్న వాడిలా కూర్చున్నాడు.

నన్ను చూస్తూనే చలమయ్యశాస్త్రి కుర్చీలో నుండి లేచాడు.

శకుంతల మాత్రం నేను వచ్చానన్న విషయం కూడా గ్రహించకుండా అలాగే చతికిలబడి కూర్చొని ఉంది. కానీ, లేవలేదు.

చలమయ్యశాస్త్రి మాకు దూరపు బంధువు. ఏదైనా పనుంటే అప్పుడప్పుడూ వస్తుంటాడు. నాకు అతనితో పనుంటే ముందుగా ఉత్తరం వ్రాస్తాను. పెళ్ళిళ్ళు నేను అంగీకరించను. నా దగ్గర కొచ్చే పెళ్ళిళ్ళ శాస్త్రి చేత చేయిస్తుంటాను. నేను వంట బ్రాహ్మణుడిని కనుక వంటకే పరిమితం. ఎందుకో రెండు గుఱ్ఱాల మీద స్వారీ చెయ్యటం నాకిష్టం ఉండదు.

ఎక్కడెక్కడి నుండో వచ్చి ఇక్కడే పెళ్ళి చేసుకుంటారు. చలమయ్యశాస్త్రి లాంటి వాళ్ళు ఎందరొచ్చినా గిరాకే! ఒకొక్కరూ ఒకే ముహూర్తానికి ఒకే దగ్గర మూడు ...నాలుగు జంటల్ని కూర్చోబెట్టి తాళి కట్టించేస్తుంటారు.

నాలా వంటకే పరిమితం అయిన వాళ్ళు చాలా మందున్నారు. కొందరు ఇద్దరు... ముగ్గురు కలిసి పార్టీలు అంగీకరిస్తుంటారు. నేను ఒక్కడ్నే కనుక పెద్ద పార్టీ అంగీకరిస్తే మా ఆవిడ్ని కూడా తీసుకెలుతుంటాను.

నాకు సంవత్సరమంతా ఏదో పార్టీ తగులుతూనే ఉంటుంది. శుభా.... అశుభ కార్యాలని లేదు. ఏ కార్యానికైనా 'వంట' చేయడానికి అంగీకరిస్తుంటాను.

ధనమూలమ్ ఇదం జగత్ అన్నారు. కానీ, నాకు నా భార్యా పిల్లలే ముఖ్యం. ఆచారం కోసం మడికట్టుకు కూర్చుంటే నా వాళ్ళందరూ అర్ధాకలితో బ్రతకాలి.

ఎవరు ఏం చేసి ఎలా బ్రతకాలని వ్రాసి ఉందో?! అంతా దైవేచ్ఛ! బహుశా చలమయ్య అక్కడ పని లేక ఇక్కడికొచ్చుంటాడు.

"కూర్చో! ఏమిటి విశేషాలు?" నన్ను చూసి లేచిన చలమయ్యశాస్త్రిని కూర్చోమని సైగ చేస్తూ అన్నాను.

"......." నా ప్రశ్నకు మౌనమే సమాధానం అనుకున్నాడు. ఏదో చెప్పాలని ..... ఎందుకో సంశయిస్తున్నట్టున్నాడు చలమయ్యశాస్త్రి.

ఏమిటి?

"చలమయ్యా! చెప్పు! ఏమిటి అలా ఉన్నావు" దగ్గరగా వెళ్ళాను.

ఇంతలో మా ఆవిడ బిగ్గరగా గొంతు చించుకొని ఏడుపు మొదలు పెట్టింది. "శకుంతలా?!" అప్రయత్నంగా అన్నాను.

శకుంతల వూరికనే ఎందుకేడుస్తోంది?

"శకుంతలా? శకుంతలా?! ఏమిటి శకుంతలా? ఏమైంది? ఎందుకా ఏడుపు. ఏమైందో చెప్పు." ఆత్రంగా.... అయోమయంగా అన్నాను. శకుంతల దగ్గరకు వెళ్ళి కూర్చొని ఆమె బుజాలు రెండూ పట్టుకొని వూరడిస్తున్నట్టు కుదుపుతూ ప్రశ్నించాను.

"బావగారూ!.... మీ చెల్లెలు... మీ చెల్లి చనిపోయింది!" చలమయ్యశాస్త్రి చెప్పలేక ...చెప్పలేక చెప్పాడు.

శకుంతలని బుజ్జగిస్తున్న వాడ్ని చలమయ్య శాస్త్రి చెప్పినది విని అలాగే క్రింద చతికిలబడి పోయాను.

నా మెదడులో ఏదో తెలీని స్తబ్దత!

శకుంతల ఆడది కనుక గుండె దిటవు చేసుకోలేక.... తెలిసిన నిజాన్ని భరించలేక ఏడుస్తోంది.

తనూ? తను గొంతు పెగిల్చి ఏడవగలడా? చెల్లెలు.... ఒక్కగానొక్క చెల్లెలు.... పెళ్ళి చేసి అత్తారింటికి పంపించవలసిన చెల్లెలు చనిపోయిందంటే తానెలా ఏడవకుండా ఉండగలడు? బావురుమని క్రిందపడి గుండెలవిసేలా ఏడ్వాలనుకుంటే గొంతు పెగలటం లేదు.

నాన్న! నాన్న ఏమైపోతాడు? చెల్లెల్ని పెట్టుకొని

ఎప్పుడో రాని 'పౌరోహిత్యం'తో దినాలు ఎలాగో గడుపు కొస్తున్నారు. తనే తన దగ్గరున్నప్పుడు పదో-పరకో పంపించేవాడు.

ఇప్పుడు తండ్రిని ఆదరించి అమ్మలా అన్నం పెట్టే తల్లెవరు?

"చాన్నాళ్ళుగా మీనాన్నగారి ఆరోగ్యం బాగ్వులేదుట. ఇంట్లో గడవటం కష్టంగా ఉందని మీ చెల్లెలు ఎవరిదో పొలం పనికి వెళ్ళిందట నిన్న. పొలంలో ఏదో పురుగు కరిచిందేమో! ఇంటికొచ్చిన ఆమె కూర్చున్నది కూర్చున్నట్టే చచ్చిపోయింది. అక్కడి ఇబ్బందులు నీకు తెలియజేస్తే నువ్వెన్ని ఇబ్బందులు పడతావోనని మీ చెల్లే నీకి విషయాలు తెలియజెయ్యనివ్వలేదట. నాకూ నిన్న మీ చెల్లి పోయిందాక ఏ విషయాలూ తెలియవు!"

చలమయ్యశాస్త్రి ఏదో చెప్తున్నాడు కానీ, నాకు ఏమీ విన్పించటం లేదు.

ఇప్పుడేం చేయాలి? చేతిలో చిల్లిగవ్వ లేదు. తామిద్దరూ వెళ్ళాలంటే ఎలాగ లేదన్నా ఏభై రూపాయలుండాలి. ఎలా?

చలమయ్యశాస్త్రి!..... చలమయ్యశాస్త్రి దగ్గరున్నాయో? లేదో?

"చలమయ్యా! నీ దగ్గర.... నీ దగ్గర ఎంతుంది?" అన్నాను.

"నా దగ్గరేం వుంది? మీ నాన్న దగ్గరున్న ఇరవై రూపాయలు ఇస్తే నా దగ్గరున్న అయిదు రూపాయలతో వచ్చాను. దార్లో మిగిలిన మూడు రూపాయల చిల్లరా ఖర్చయిపోయింది. ఇట్నుండి నువ్వే ఎలాగో చూస్తావుగా! అని మీనాన్న పంపాడు బ్రతిమలాడి." చలమయ్యశాస్త్రి చెప్పాడు.

నాకు ఏం చేయాలో తోచటం లేదు

పనుందని.... క్షణంలో వచ్చేస్తానని చెప్పి బజార్లో కొచ్చాను.

తన మీద నమ్మకంతో... విశ్వాసంతో ఎవరు అప్పిస్తారు?

వంట బ్రాహ్మణులందరూ ఓ 'టీ' కొట్టు దగ్గర నిలబడి 'టీ' త్రాగుతున్నారు. వాళ్ళలో ఎవర్ని అడిగినా ఒకటే! అందరూ తనలాంటి వాళ్ళే! ఏం చేయటం? ఎవర్నడిగితే తన మర్యాద చిక్కుతుంది.

తనకందరూ కొత్తే! తనీ వూరొచ్చి రెండేళ్ళు కూడా కాలేదింకా. బ్రతుకు తెరువు వెదుక్కుంటూ 'పుణ్యక్షేత్రం కదా పుణ్యంతో పాటూ పురుషార్థం కూడా దక్కుతుంది' అని ఇక్కడ స్థిరపడ్డాడు

'సంసారం' గడవడానికి ఏనాడూ ఇబ్బంది ఎదురవలేదు కానీ, ఏభైనా 'సమస్య' ని ఎదుర్కోవడమంటేనే ఆర్థిక స్తోమతు చాలటం లేదు. తాను సీజన్లో ఎంత వెనకేసినా రెండు మూడు నెలల్లో ఏదో విపత్కర పరిస్థితి ఎదురవుతూనే ఉంది!

"ఏమండోయ్! పంతులు గారూ?"

ఎవరో వెనుక నుండి కేక వేస్తున్నారెవర్నో అక్కడ.... ఆ 'టీ' కొట్టు దగ్గరున్న అందరూ మావాళ్ళే! ఎవర్నో అనుకున్నాను. ఆలోచిస్తూ బల్ల మీద కూర్చున్నాను.

అతను నా దగ్గరకే వచ్చి పిలిచాడు. ఉలిక్కి పడ్డాను.

అతను ఆ వూరి అబ్బాయే! ఈ రోజు 'నా' పిక్నిక్ పార్టీ వాళ్ళదే! నేను వంట చేయడానికి అంగీకరించిన పార్టీ కుర్రాడు.

"మీ కోసం పిచ్చి కుక్కలా తిరుగుతున్నానండి బాబూ! కర్రలు... సామాన్లు.... పాత్రలు అన్నీ బండిలో తీసుకెళ్ళి 'రావన్న చెఱువు' దగ్గరుండే సరుగుడు తోట. అక్కడే పడేసాం. అదే పిక్నిక్ స్పాట్ మీరొస్తే వంట వేగం ప్రారంభించాలి



మావాళ్ళందరూ వచ్చేసరికి టిఫిన్ అయితే బాగ్వుంటుంది." అతను ఆయాసంతో చెప్పుకు పోతున్నాడు.

నిజమే! వాళ్ళ బాధ వాళ్ళది. తన యాతన తనది.

మూడు జిల్లాల నుండి వస్తున్నారట వాళ్ళు రచయిత మిత్రులు. సంవత్సరానికోసారి నానా తంటాలు పడి ఏర్పాటు చేస్తుంటారట పిక్నిక్. ఎందుకో? ఏం ప్రయోజనం ఆశించో!

అది ఇప్పుడు తన వలన విఫలమయితే ఏమన్నా ఉందా?

అదిగాక, పాపం! సామాన్లు... సరంజామా అంతా రెడీ చేసుకున్నారు అందరూ ఊసరికి

నాకేం చేయడానికి తోచటం లేదు.

"నేను రావడానికి కుదరదు బాబూ!" అన్నాను నెమ్మదిగా.

"అదేంటండి! మీరిప్పుడు రానంటే ఎలా కుదురుతుంది. మొన్న చెప్పినప్పుడు ఎందుకు ఒప్పుకున్నారు. ఇప్పటికప్పుడు ఎవడొస్తాడు కోపంగా అరుస్తూ అన్నాడా కుర్రాడు.

బయల్దేరేసే ఉంటారు. ఇతనిది ఈ వూరు కనుక ఏర్పాట్లన్నీ ఈ కుర్రాడొక్కడే చూస్తున్నాడు.

అయితే – తనేం చేయాలి?

"పోనీ, ఎవరినన్నా ఇంకొకళ్ళని పంపుతాను. అభ్యంతరం లేదు కదా!"

"అదేదో త్వరగా చేసి పుణ్యం కట్టుకోండి. మీరే రావాలని కాదు. కానీ, మా పిక్నిక్ మాత్రం సక్సెస్ కావాలి. మాకు కావాల్సింది వంట పంతులుగారు. దట్సాల్!" అతను ఉద్రేకంగా అన్నాడు. రచయిత లక్షణాలు కొట్టొచ్చినట్టు కన్పిస్తున్నాయ్.

'టీ' త్రాగుతున్న మా వాళ్ళ దగ్గరకు వెళ్ళి నా అవసరం... పరిస్థితి చెప్పాను. దయచేసి ఎవరో ఒకరు ఆ పార్టీ పని చేయవలసినదిగా కోరి ప్రార్థించాను.

"అదేటి గురూ? నువ్వింతలా బ్రతిమలాడి చెప్పాలా? కానీ, నువ్వే ఆలోచించు. ఇదే కదా మనకి సీజను. మరి, మాకెక్కడ కాళీ ఉంటుందంటావ్!? నువ్వే ఎలాగో మధ్యాహ్నం వంట చేసేసి వెళ్ళు. మా పార్టీ వాళ్ళని మేం మోసం చెయ్యలేం కదా!"

అందరూ అలాగే అన్నారు.

నిజమే! వాళ్ళ వాదనా కరక్టే! కానీ, తన వేదన ఎవరు వింటారు?

తనే తన సమస్యకు పరిష్కారం ఆలోచించాలి. తనే తన పరిస్థితి చక్కబెట్టాలి. ఇటు ఆర్థిక ఇబ్బంది... అటు మాటిచ్చిన పార్టీ పని జరుగుతుంది.

తనకిప్పుడు డబ్బు ముఖ్యం.

ఎలాగలేదన్నా డెబ్బది అయిదు రూపాయిలుంటే చాలు!

"నేనే వస్తాను బాబు! కానీ, మధ్యాహ్నం వంట అయిన వెంటనే నన్ను వదిలెయ్యాలి. సాయంత్రం కాఫీ చెయ్యలేను" అన్నాను.

కానీ, నా ఆలోచన నన్ను అతలా కుతలం చేస్తూనే ఉంది.

ఈ వూర్లో – ఈ మనుషులు తనకు సహాయం చెయ్యరు? సహాయం చెయ్యడానికి ఎవరు తనకి తెలిసిన వాళ్ళున్నారు?

తానొప్పుకున్న ఈ పార్టీ పని ముగించేస్తే ఏభై రూపాయలు దొరుకుతాయి. మిగతా పాతిక రూపాయలు ఎల్లాగో పుట్టించాలి. దాని కోసం తర్వాత ఆలోచించొచ్చు. ముందు ఏభై సంపాదిస్తే కొంత ధైర్యం!

"అలాగే రండి! వేగంగా మీ పని కానిచ్చేస్తే మీరు వెంటనే వచ్చెయ్యొచ్చు." అతను తొందర చేస్తూ అన్నాడు.

మరిక, ఇంటికి వెళ్ళడానికి అవకాశం ఎక్కడిది?

అతని వెంట అలాగే వెళ్ళాను.

ఎనిమిదయేసరికి అందరూ వచ్చారు.

అసరికే 'టిఫిన్' పూర్తయింది. కాఫీ కాస్తున్నాను. వంట చేస్తున్నానన్న మాటే గాని నా కళ్ళల్లో చెల్లే మెదుల్తోంది. పదహారేళ్ళ పిల్లకి ఎన్ని సమస్యలు?

తానా వూర్లో పనీపాటూ లేక బ్రతక లేక వాళ్ళనలా అక్కడ ఒంటరిగా వదిలేసి పెళ్ళాం పిల్లలతో

## ఏకాకి

ఈవూరొచ్చాడు. తమ్ముడు కూడా తనలాగే ఇంట్లో ఉండి దరిద్రాన్ని అనుభవించలేక పెళ్ళికాక ముందే ఎటో వెళ్ళిపోయాడు. ఏదో వూర్లో... ఎక్కడో శివాలయంలో పూజారిగా చేరాడని గాలి వార్త.

కనీసం, ఆ తర్వాత వాడు తన కంటూ ఓ బాధ్యత ఉందని... ఎవరూ లేని అనాథల్లా తండ్రీ – చెల్లెలు అక్కడ పడి ఏడుస్తున్నారని ఆలోచించలేదు. అయినా అక్కడ వాడి పరిస్థితి తనలాగే ఉందేమో?! ఏమో?!

ఇద్దరు... ముగ్గురు అందరికి టిఫిన్లు సర్వ్ చేస్తున్నారు. నేను కాఫీ వడకట్టి పంచదార కలుపుతున్నాను.

"థూ!" అందరూ ఒక్కసారే అన్నారు.

అదిరి పడ్డాను. నాతో పాటూ టిఫిన్ సర్వ్ చేసిన ముగ్గురు కుర్రాళ్ళూ అవాక్కయిపోయారు.

"ఏం? వంట పంతులూ? నీకు మతిగాని పోయిందా? అస్సలు ఇందులో.... ఈ ఉప్మాలో కనీసం ఒక్క ఉప్పు రవ్వైనా వేసావా?" టిఫిన్ తిన్న వాళ్ళందరూ నానా రకాలు అన్నారు.

నిజమే?! తనకు మతి ఉంటేనా?! తన మెదడు.... మనసు అంతా పోయిన తన చెల్లి చుట్టే పరిభ్రమిస్తున్నాయి.

అనాథల్లా ఎన్ని అవస్థలు పడ్డారో తండ్రి.... చెల్లీ!

ఇప్పుడో?!

కూతురి శవాన్ని ముందరేసుకొని విలపిస్తూ తమ కోసం ఎదురు చూస్తుంటాడు తండ్రి. నిన్న చనిపోయిన చెల్లి శవాన్ని తమ కోసం దహనం చెయ్యకుండా ఇంకా ఉంచుతారా? వూర్లో వాళ్ళు వూరుకుంటారా?

"ఏయ్! పంతులూ! నిన్నే, నీ పరధ్యాన్నంతో మమ్మల్ని చంపుతున్నావ్! ఇది ఉప్మా! పాడా?!" అంటూ ఒక వ్యక్తి చేతిలో అరిటాకుతో ఉన్న ఉప్మాని నేలకేసి విసిరికొట్టాడు.

ఆ హఠాత్పరిణామానికి అదిరిపడ్డాను.

నన్ను వంటకి కుదిర్చిన అబ్బాయి వాళ్ళని శాంత పరచి నా దగ్గరకు వచ్చాడు. "మీరు తొందరగా వెళ్ళిపోదామన్న ఉద్దేశ్యంతో ఇలా మమ్మల్ని ఇబ్బంది పెట్టడం ఏం బావులేదు. పంతులుగారూ? కొంచెం శ్రద్ధగా ... జాగ్రత్తగా మీ పని కానిచ్చేసి వెళ్ళిపొండి. నేనేం కాదన లేదు కదా!" అన్నాడా కుర్రాడు నొచ్చుకుంటూ.

పాపం!

ఆ అబ్బాయికేకదా చెడ్డపేరు!

కాఫీ కలిపి ఇచ్చాను. బావులేకపోయినా పర్లేదన్నారు అందరూ.

మధ్యాహ్నం వంట పూర్తయ్యేసరికి ఒంటిగంట దాటిపోయింది.

అందరికి ఆకులు వేసి వడ్డన నేనే చేసాను. తొందర తొందరగా నా కార్యక్రమాన్ని పూర్తి చేసి నా పని ముగిసిందని చెప్పడానికన్నట్టూ చేతులు కడుక్కున్నాను.

నాకు తొందరగా ఉంది. ఎంత వేగం ఇంటికి వెళ్ళాలా? ఎంత వేగంగా ప్రయాణమవ్వాలా? అని. ఎలాగ లేదన్నా ఇంకో గంట పడుతుంది తాము ప్రయాణమయ్యేసరికి. మిగతా పాతిక రూపాయలు ఎవరి దగ్గరో ముష్టెత్తాలి. ఇంటి ఓనర్ని అడుగుదామంటే ఇస్తాడో? ఇవ్వడో?

ఉంటే – శకుంతల దగ్గరే పది... పాతిక చిల్లరుండొచ్చు. అది ఫలమయ్యశాస్త్రి వచ్చాడని ఖర్చు చేసేస్తుందేమో!?

ఈ లోపల వంట బ్రాహ్మణులు అందరూ పనులు ముగించుకు రావచ్చు. వాళ్ళ నెవర్ని అడిగినా ఇస్తారు.

ఆలోచిస్తున్నాను.

అందరూ భోజనాలు చెయ్యడానికి ఉపక్రమించారు. ఎవరూ ఇంకా ఆకుల్లో చెయ్యి పెట్టలేదు. కథల గురించి... నవలల గురించి మాట్లాడుకుంటున్నారు. బహుమతి కథల గురించి... ఆ రచయితల గురించి ముచ్చటించుకుంటున్నారు.

నెమ్మది... నెమ్మదిగా యాంత్రికంగా కలుపుతూ దృష్టి... ధ్యాస సంభాషణ మీద కేంద్రీకరించి నోట్లో ముద్దలు పెట్టుకుంటున్నారు.

నేను నన్ను కాంట్రాక్ట్ చేసిన కుర్రాడి దగ్గరకు వెళ్ళాను.

ఇంతలో ఒకతను అన్నాడు.

"ఛీ! ఇదా భోజనం. ఏం వంటయ్యా ఇది." విసురుగా లేచి చేతిలో ఉన్న అన్నం ముద్దని నా మీదకు విసిరాడు.

అతను అలా అరిచే సరికి అందరూ తమ చేతుల్లో ఉన్న ముద్దల్ని నోట్లో వేసుకొని తుపుక్కున ఉమ్మేసారు.

ఏమైంది?.... ఏమైంది?

నా గుండెల్లో ఆతృత.

"అన్నం ముద్దయిపోయింది. జావలాగా ఉంది" ఒకతను.

"కూరలో ఉన్న కారమంతా వేసేసారా? గొడ్డుకారం. అబ్బ!" అంటూ ఇంకొకతను ముందర గ్లాసుడు నీళ్ళూ నోట్లో పోసుకున్నాడు.

"ఇది పప్పా! మా ఖర్మ! ఉడకలేదు సరిగ్గా. ఏం వంటయ్యా బాబూ!" ఇంకొకతను.

"ఆ సాంబారు చూడండి ఎలా ఉందో? అదన్నా బావుందో? లేదో?" ఒకతను లేచి సాంబారు దగ్గరకు వెళ్ళాడు.

నేను సిగ్గుతో తల వంచుకున్నాను.

నా జీవితంలో మొట్టమొదటి సారి తలవంచుకున్నది ఈ రోజే!

ఏనాడూ.... ఏ పార్టీచేతా తాను మాటపడలేదు.

తన వంట రుచి చూసిన వాళ్ళందరి చేతా ప్రశంసలు అందుకున్నాడు. గానీ, ఇలా పరిహాస్యాలకు తల ఒగ్గలేదు.

నన్ను కుదిర్చిన కుర్రాడి మొహం కోపంతో ఎర్రగా

# ఇదిగో, వాడడానికి సులభమైన హేర్-డై.
# ఎంతో తక్కువ ధరకు.

గోద్రెజ్ పౌడర్ హేర్ డై కాంసెంట్రేట్ మీ కోసమే ప్రత్యేకంగా రూపొందించబడినది.

ఇది భారతదేశపు ఏకైక తనంతటతానే వ్యాపించే పౌడర్ హేర్ డై కాంసెంట్రేట్. అందుకే, మీరు దీనిని ఎంతో తక్కువ పరిమాణంలో వాడుకోవచ్చు!

అన్నిటికంటే ముఖ్యం, ఇది మీకు నమ్మశక్యం కానంత తక్కువ ధరకు లభిస్తుంది!



**కలపడం సులభం:**
కొద్దిపాటి నీటిలో పౌడర్‌ను కలపండి. అంతే, అది వాడడానికి తయారు!



**వాడడం సులభం:**
జుత్తుకు కాస్త పట్టించి నెమ్మదిగా లోపలికి రాయండి. అది తనంతటతానే మెత్తగా, అంతటా సమానంగా వ్యాపించి మీ జుత్తును యౌవ్వనవంతంగా చేస్తుంది!






భారతదేశపు ఏకైక తనంతటతానే వ్యాపించే పౌడర్ హేర్ డై.

**Godrej**

**పౌడర్ హేర్ డై కాంసెంట్రేట్**

**మీరు కోరే నాణ్యత. మీరు ఇష్టపడే ధర.**

CLARION/GS/11/244 TEL




**కె. ఎస్ – కరీంనగర్**

నాకు 26 సం.లు. 6 నెలల నుంచి తుమ్ములు, ముక్కు నుంచి నీళ్ళు కారడము, చీము రావటము జరుగుతుంది. ఈ మధ్య ఇ. ఎన్. టి. డాక్టరుకు చూపిచ్చినాను. ఎక్స్–రే, రక్త, మూత్ర పరీక్షలు చేయించినాను. ఎక్స్–రేలో నా ముక్కు ఎడమ రంధ్రములో ఎముక, మాంసము పెరిగినట్లు డాక్టరు చెప్పారు. చాలా మందులు వాడినాను. ఫలితము లేకండ పోయినది. బ్రతుకు మీద విరక్తి కలుగుచున్నది. ఆత్మహత్య చేసుకోవాలని అనుకొనుచున్నాను.

ఈ మాత్రం దానికే ఆత్మహత్య అవసరం లేదు!

అలా పెరిగిన కండను తప్పకుండా ఇ. ఎన్. టి. వైద్యులు శస్త్రచికిత్స ద్వారా తీసివేస్తారు. దీనివల్ల ఏ ప్రమాదమూ లేదు.

**ఏ. ఏ. ఎస్ – కాకినాడ**

నా వయస్సు 29 సం.లు. 6 నెలల నుంచి కాంటాక్టు లెన్సు వాడుతున్నాను. రెప్పలు మూసి తెరచిన వెంటనే మసకగా వుంటుంది. మళ్లీ వెంటనే "సొల్యూషన్" లో కడిగి పెట్టుకున్నంతనే చూపు బాగుంటుంది. కళ్ళు కూడా ఒక్కొక్కసారి మంటగా ఎర్రగా వుంటున్నవి. నాకు ప్రిస్క్రిప్షన్ వ్రాసిన డాక్టరు డ్రాప్స్ వాడమన్నారు. కానీ ఎరుపుదనము వస్తున్నది. మసక లేకుండా వుండటానికి ఎరుపు, మంట లేకుండా వుండటానికి ఏమి చెయ్యాలి. ఈ వూరిలో నాకు ప్రిస్క్రిప్షన్ వ్రాసిన డాక్టరు ఒక్కరే కాంటాక్ట్ లెన్సు ఇస్తున్నారు.

మీకు కాంటాక్ట్ లెన్సుల వల్ల అసౌకర్యంగా ఉన్నప్పుడు ఆ నేత్రవైద్యునికే చూపించి సలహా పొందటం ఉచితం. అలా వీలులేని పక్షంలో మరో నేత్రవైద్యుని సలహా ప్రకారం, కాంటాక్ట్ లెన్స్ తీసివెయ్యటమో, వేరే డ్రాప్స్ వాడటమో చెయ్యవలసి ఉంటుంది.

**కె. ఎస్. ఆర్. జి – అవనిగడ్డ**

నాకు అధికముగా ఆలోచనలు. మనస్సు నిలకడగా ఉండదు. ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్ కూడా వున్నది. అందువల్ల "సైక్రియాట్రిస్టు" లకు చూపించుకొనవలెనని ఉన్నది. సైక్రియాట్రిస్టులు విజయవాడలో ఉన్నారా? లేక హైదరాబాదు వెళ్ళవలెనా?

విజయవాడ వంటి చోట్ల సైకియాట్రిస్టులు తప్పకుండా ఉంటారు.

**ఆర్. హెచ్. ఎల్. ఆర్ – చినవంక**

నాకు ఆరు మాసముల నుండి కన్ను రెప్పల మీద కురుపులు అవుతున్నాయి. మందులు వాడాను కానీ ఇంతవరకు కురుపులు పోలేదు. ఏమి మందులు వాడవలెను.

కళ్ళను పరిశుభ్రంగా ఉంచుకోక పోవటం, సూక్ష్మక్రిముల ప్రవేశం, విటమిన్ "ఎ" లోపించటం, మొదలయినవి వ్యక్తిగత అపరిశుభ్రతతో బాటుగా ఇలా కురుపులు రావటానికి కారణాలవుతాయి.

ఆ కురుపులలో చీము ఉంటే చీముని పరీక్షింప చేసి తగిన మందులు వాడాలి.

హోర్డియోలం ఇంటర్నమ్ అనే కురుపులకి చిన్న శస్త్రచికిత్స అవసరం అవుతుంది. □

## ఏకాకి

కందిపోయింది.

"పంతులుగారూ! ఇదేంవిటండి! మీ స్వార్థం కోసం మా సరదాని ఏడాదికోసారి సందడిగా.... సంతోషంగా గడపాలనుకున్న మా కార్యక్రమాన్ని విచ్ఛిన్నం చెయ్యడం భావ్యమా?!"

అతని కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. పరువు పోయిందన్న బాధ అతనిది.

కానీ, అతనికి తెలీదు. తా నెటువంటి పరిస్థితిలో ఉన్నాడో? తానతనికంటే ఎంత ఘోరాతి ఘోరంగా విలపిస్తున్నాడో అతనికేం తెలుసు?

తాను చేసింది పొరపాటే!

తన స్వార్థం కోసం తానీ పనికి అంగీకరించటం నేరమే!

అసలు తను వంట చెయ్యడానికి అర్హుడా? తన చెల్లిపోయిన విషయం వీళ్ళకి తెలిస్తే తనని ఉండనిస్తారా? తనని వంట చెయ్యనిస్తారా?

"ఏయ్! విష్ణువరాజ్! అతనికి ఎమౌంట్ పే చెయ్యకు. నో! మనల్ని ఇంత నష్టపెట్టిన అతను కూడా నష్టపోవాలి. అతని కూలీ నష్టపోవడమే ధర్మం!" ఒకతను కోపంగా లేచి అన్నాడు.

ఒక్కసారి ఉలిక్కిపడ్డాను. క్షణం ఆలోచించాను. తర్వాత నవ్వుకున్నాను. ఇంకా పగలబడి నవ్వాలనుకున్నాను. కానీ, మళ్ళా ఆలోచించాను. నా తప్పు నాకు తెలుసు. నేను చేసిన తప్పువలన ఎంత మంది అవస్థలు పడుతున్నారో తెలుసు.

నిజమే! అతను అన్నట్టు తన చేసిన తప్పుకు తను కూడా శిక్ష అనుభవించాలి.

మరిక, అక్కడ ఉండకుండా వెను దిరిగాను.

అక్కడి నుండి వూళ్ళోకి వెళ్ళాలంటే మూడు కిలో మీటర్లు నడవాలి. నడుస్తున్నాను. నా ఆలోచనన్నీ నా చెల్లి చుట్టే!

ఈసరికి చెల్లిని మట్టిలో కలిపేసుంటారు.

తండ్రి ఒక్కడూ.... ఒంటరిగా.... దిక్కుతోచని ఆలోచనతో ఎడారిలాంటి బ్రతుకును తలచుకొని రోదిస్తూ ఉంటాడు.

ఇక తను వెళ్ళాల్సింది పోయిన చెల్లి కోసం కాదు. ఏకాకిగా ఎటూ దిక్కుతోచక అలమటించే తండ్రి కోసం!

ఇంటికి వెళ్ళేసరికి నాకోసం భార్య.... చలమయ్య శాస్త్రి ఎదురు చూస్తున్నారు ఆతృతగా. అప్పటికి ఉదయం నుండి నాకోసం చలమయ్యశాస్త్రి వూరంతా గాలించాడట.

నా కళ్ళల్లోకి క్షణం తేరపారా చూసాడు చలమయ్యశాస్త్రి.

"బావా! నువ్వింతలా అప్పుకోసం వూరంతా తిరిగే బదులు ఇంటికే వచ్చెయ్యలేక పోయావా? నీ దగ్గరుంటుందేమో అనుకున్నా గాని, నువ్వింత ఇబ్బంది పడతావనుకోలేదు. పదండి. వేగంగా వెళ్దాం."

ఆ మాటలు అంటున్న చలమయ్య కళ్ళల్లోనూ తడి మెదిలింది.

"మరి.... మరి...." నా గొంతు నిండా ఆర్థిక సంక్షోభం.

"ఇదిగో బావా! ఈ చేతిని ఆపదలో ఆదుకోవడానికి ఉంగరం ఉంది. ఏదో చేద్దాం. ముందు బయల్దేరండి!"

"చలమయ్యా!"

ఇంకా మానవత్వం చావలేదు.

ఇంకా మనుషులు అక్కడక్కడా ఉన్నారు.

తాను ఏకాకి కాడు. తన కండగా చలమయ్య శాస్త్రుల్లాంటి వాళ్ళెందరో ఉన్నారు. హాయిగా.... ధైర్యంగా గుండెల్నిండా గాలి పీల్చుకున్నాను. □

# ఇదిగో ! మీ వంటగదికి
# శోభను చేకూర్చే విలువైన కానుక.
## అత్యంత నాణ్యమైనది, మరింత మన్నికైనది.

# మౌలిమెక్స్®
## కెన్‌మోర్
## మిక్సర్-కమ్-గ్రైండర్




మౌలిమెక్స్ కెన్‌మోర్ మిక్సర్ - కం - గ్రైండర్ – మీ వంటగదికి ఒక నాణ్యమైన కానుక. మౌలిమెక్స్ ప్రత్యేకమైన పర్యవేక్షణలో ఖచ్చితమైన నాణ్యత సంతరించేలా తయారు చేయబడుతుంది గనుక మీకు ఎలాంటి ఇబ్బందులు ఉండవు.

మౌలిమెక్స్ ధృడమైన కవచం గలది, అంటే లోపలి భాగాలకు పూర్తి రక్షణ. క్షణాల్లో రుబ్బడానికి, చిలకడానికి, ముక్కలు తరగడానికి, పొడిచేయడానికి సామర్థ్యంగల నాలుగు బ్లేడ్లు. ఇవి మార్చుకొనేటందుకు అనుకూలమైనవి. అంతేకాదు పండ్లరసాల కోసం ప్రత్యేకమైన అదనపు అమరిక విడిగా లభిస్తుంది.

18 నెలల గ్యారంటీతో పాటు దీని జీవితకాలమంతా ఉచిత రిపేరు సదుపాయం.


పండ్లరసాలకు
అదనపు అమరిక

మీరు చేయవలసిందల్లా దీని పనితనం చూసి ఆశ్చర్యపోవడమే !













ఆంధ్రప్రదేశ్‌లోని
ముఖ్య గృహోపకరణముల
డీలర్లందరివద్దలభించును.

మార్కెట్‌చేయువారు :

**బొలాకి ట్రేడింగ్ కంపెనీ ప్రై.లి.,**

నాంపల్లి స్టేషన్ రోడ్, హైదరాబాదు - 500 001

ఫోన్ : 222048 223206

TARA/BTC/56/85






డాక్టర్ ముదిగొండ శివప్రసాద్

(గత సంచిక తరువాయి)

భవభూతి చలించిపోయాడు. అందులోను గిరిజ అని కాక నీరజ అని అంటుంది. దీంతో తను చేసిన పొరపాటు ఏమిటో భవభూతికి తెలిసిపోయింది. గురుపాదస్వామి తనకు రాసిన ఉత్తరాన్ని చదివిన వెంటనే చించి వేస్తే బాగుండేది. అలా కాక పరధ్యానంతో దానిని నాట్యామృతం నోట్‌బుక్‌లో పెట్టాడు. అది ఆమెకు చేరింది. దీంతో కథ కొత్త మలుపు తిరిగింది. గురుపాదస్వామి, ప్రతిభల గూర్చి 'సుధారాణి చెప్పిన కథ మొత్తం సారభూతంగా తళుక్కున అతని మనస్సులో మెరిసింది. "అవును. నీకు చెప్పలేదు. నీరజ నా కూతురు. నా భార్య చనిపోయింది. ఆమెను గురుపాదస్వామి వద్ద నాట్యం నేర్పించే నిమిత్తం చేర్పించాను" అన్నాడు తల వంచుకొని ఏదో తప్పు చేసిన వాని వలె.

"చాల మంచి పని చేశారు కవిగారు. ఆయన గొప్ప నాట్యాచార్యుడు. అంతటి మహాపురుషుని వద్ద విద్య నేర్చుకోవడం అందరికీ సాధ్యమయ్యే విషయం కాదు. అందుకు ఏ పూర్వజన్మ అదృష్టమో ఉండాలి. మీరు తీసుకున్నది సరియైన నిర్ణయం."

ప్రతిభ గొప్ప నర్తకి. ఆంగిక వాచకాల్లో ఆరితేరింది. అందువల్ల ఈ మాటలలో వాచ్యం వ్యంగ్యం పోల్చుకోవడానికి భవభూతికి సాధ్యం కాలేదు.

"నా వ్యక్తిగత జీవితంలోని అనేక రహస్య విషయాలు మీతో చెప్పుకోదగిన సాహసమూ, చనువు నాకు లేకపోయాయి. క్షమించాలి" అన్నాడు భవభూతి.

"నిజమే! చనువు కన్నా సాహసం లోపించింది. హైదరాబాదులో మిమ్మల్నందరు బ్రహ్మచారి అనే భావిస్తున్నారు. మీకు వివాహమైనట్లు భార్య పోయినట్లు ఎవరూ చెప్పలేదు. అలాంటిది అకస్మాత్తుగా మీరు కుమార్తెను గురించి చెప్తే నమ్మశక్యం గాదు. నేను మిమ్మల్ని ఒక కళాకారునిగా గాక అంతకన్న ఎక్కువగా గౌరవించాను. కాని మీరా గౌరవాన్ని నిలబెట్టుకోలేదు. మీ జీవిత గ్రంథం నా వద్ద మూసి వేసే వుంచారు. మీ వలెనే నాకు ఒక కథ ఉన్నది. దానిని స్వయంగా మీతో చెప్తే అందులో ఔచిత్యం లోపిస్తుంది. ఎందుకంటే ఎవరు తమ తల్లిదండ్రుల శృంగార గాథలను తమ నోటితో చెప్పకూడదు. మా తల్లి పేరు ఆనందవల్లి. ఆమె ఒకనాటి మహానర్తకి. ఈ విషయం చాలా మందికి తెలియదు."

"నాకు తెలుసు." అన్నాడు భవభూతి.

"ఏం తెలుసు? ఆమె ఒకనాటి మహానర్తకి అనే విషయమా? ఈమెకు తల్లి అనే విషయమా?" -ప్రతిభ తలవంచుకొని కూర్చున్నది. కొన్ని క్షణాలు ఇరువురి మధ్య నిశ్శబ్దం. తర్వాత ప్రతిభే ఇలా అన్నది.

హైదరాబాదు వచ్చిం తరువాత ఒక రకంగా అదృష్టవంతురాలిని మరొక రకంగా దురదృష్టవంతురాలిని కూడా అయ్యాను. మీ వంటి మహాపురుషులతో స్నేహాన్ని సంపాదించడం అదృష్టం. ఆండాళ్ లాంటి వారితో అనవసరంగా శత్రుత్వం పెరగడం దురదృష్టం. వ్యక్తిగతంగా నన్నెవరైనా తిడితే నాకు బాధ లేదు. కాని కళాత్మకంగా ఎవరైనా నన్నవమానిస్తే నాలో కోపం బుసకొడుతుంది. దానితో. భావోద్రేకం పెరుగుతుంది. అది ఒక్కొక్కపుడు అభినయంగా మారుతుంది."

"అవును. మీరు ఉద్విగ్న నర్తకీమణులని నాకు తెలుసు."

"మీరు ఆండాళ్‌కు రామ కథను నృత్యరూపకంగా వ్రాసిస్తున్నారని విన్నాను. నిజమేనా?"

"ప్రతిభ ఏమి మాట్లాడలేదు. భవభూతికి ఆ నిశ్శబ్దం మరి భరించరానిదిగా ఉంది. ఇప్పుడు తాను రెండు తప్పులు చేశాడు. ఆమెకు శత్రువైన గురుపాదస్వామి వద్ద నీరజను నాట్యాభ్యాసానికి ప్రవేశ పెట్టడం మొదటిది. వాత్స్యాయన శర్మ మీద అభిమానంతో ఆండాళ్‌కు రామకథను వ్రాసివ్వడానికి అంగీకరించడం రెండవది. ఈ రెండు తప్పకుండా ఆమె మనస్సును బాధిస్తుండవచ్చు. అందుకు తన నిరసన తెలియచేసే నిమిత్తమే తనను పిలిపించి వుండవచ్చును. భవభూతి తను చేసిన పనికి క్షమాపణ చెప్పుకొని నీరజను తీసుకొని వచ్చి ప్రతిభ వద్ద చేర్పిస్తాడని, ఆండాళ్ చేసిన అపకారానికి

**జరిగిన కథ–18:** భవభూతి, ప్రతిభ వివాహం చేసుకుంటారనే పుకారు బయలు దేరుతుంది. తన గూర్చి అతని అభిప్రాయమేమని ప్రతిభ భవభూతిని అడుగుతుంది. ప్రతిభ స్త్రీ రూపంలో నున్న నటరాజ స్వామి అయితే తానొక భక్తుడిని మాత్రమే అని భవభూతి చెపుతాడు. అది విన్న ప్రతిభ చివాలున లేచి వెళ్లి పోతుంది. భవభూతి ప్రతిభ దగ్గరకి ఇక వెళ్ల కూడదని అనుకుంటాడు. అరంగేట్రం ఆండాళ్ భవభూతికి, ప్రతిభకి అక్రమ సంబంధం ఉందని ప్రచారం చేస్తుంది. భవభూతి గిరిజ తన కూతురని గిరిజ ఉండే స్కూలు వాళ్లతో చెప్పి ఆ అమ్మాయిని తనతో పంపించమని అడుగుతాడు. ప్రిన్సిపాల్ అంగీకరిస్తాడు. గిరిజకు గురుపాదస్వామి వద్ద నాట్యం చెప్పించాలను కుంటాడు భవభూతి. గిరిజకు నాట్యం చెప్పడానికి గురుపాదస్వామి అంగీకరించాడు. గురుపాదస్వామి వలన ప్రతిభకి ఒక సోదరి ఉందని తెలుసుకున్న భవభూతి ఈ విషయం పూర్తిగా తెలుసుకోవాలనే ఉత్సాహంతో హైదరాబాదు బండి ఎక్కాడు. గురుపాదస్వామి గిరిజ పేరు నీరజగా మార్చాడు. నాట్యామృతం అనే "డ్యాన్స్ థెరఫీ" పుస్తకం వాత్స్యాయన శర్మ ద్వారా భవభూతి ప్రతిభకు పంపిస్తాడు. తనకు నీరజ అనే పుత్రిక ఉన్నట్లు భవభూతి తనకి చెప్పలేదని ప్రతిభ నిష్ఠూరం ఆడుతుంది.

పతిక్రియగా రామకథ వ్రాసివ్వడం మానుకుంటున్నానని చెప్పుతాడని ప్రతిభ శించిందా? భవభూతి అలా చేయకపోయే సరికల్లా ఆమెకు మనస్సులో ఘాను చెలరేగిందా?

"నన్నెందుకు రమ్మన్నారట."

"ఏమి లేదు. ఇప్పుడే మీరు నన్ను కలుసుకోవడం పూర్తిగా మానివేశారు. ఇక ఎద ఆసలే కలుసుకోక పోవచ్చు. అలాంటప్పుడు క్షీరసాగర మథనాన్ని నాకు రాసిచ్చిన పెద్దలు నాట్యామృతాన్ని నా కందజేసిన హితైషులు ఒకసారి ృతజ్ఞతలు చెప్పుకుందామని రమ్మన్నాను. నేనే మీ కవుల కాలేజీకి ద్దామనుకున్నాను. కాని బావుండదని ఊరుకున్నాను."

"కృతజ్ఞుణ్ణి" అన్నాడు. అంతకంటే ఏమనాలో తెలియక.

ప్రతిభ భవభూతి వైపు ఒకసారి సాభినయంగా చూసింది. సాలోచనగా నురెప్పలను అల్లార్చింది. ఉన్నట్టుండి లేచి నిలబడింది. అంటే తనను ళ్ళమని అర్థమా? భవభూతి ఏం మాట్లాడాలో తెలియక నిరుత్తరుడయ్యాడు. తిభ తన నాట్య మందిరంలోకి వెళ్ళిపోయింది. శిష్యురాండ్రు, విద్యార్థులు స్తున్నారు. లోపల గజ్జెలు, మద్దెలలు ప్రాణం పోసుకుంటున్నాయి. ఒక పాప పలి నుండి వచ్చి మా టీచర్ గారు క్లాసు మొదలు పెట్టారు. ఆ మాట మీతో ప్పమన్నారు అంది.

భవభూతి మాట్లాడకుండ తలవంచుకొని నాట్యాలయం నుండి బయటికి చ్చాడు. అతను అభినయ సుందరితో గల అనుబంధపు ముడి డివడిపోయింది. ఇప్పుడు భవభూతి మళ్ళీ వెనకటి భవభూతియే. అతడు తిభకు ఏమి కాడు. పైగా తానిప్పుడు ఒక బిడ్డ తండ్రి. ప్రతిభ ప్రేమకు అభిమానానికి దూరమైన వ్యక్తి. సూర్యుడు తన వాడి మయూఖములతో జగత్తును చైతన్యవంతంగా నర్తింప చేస్తున్నారు. భవభూతి ఎండలో పడి ముందుకు సాగిపోయాడు.

## 15

కళాకారుల జీవితాలు చాల విచిత్రంగా ఉంటాయి. అవి వర్ణించిన విస్తర్లో లేక గ్రీష్మరుతువులోని మరీచికలో చెప్పడం కష్టం. కీర్తి ఉంటే ఐశ్వర్యం ఉండదు. కీర్తి, ఐశ్వర్యం ఉంటే మనశ్శాంతి ఉండదు. కీర్తి , ఐశ్వర్యం, మనశ్శాంతి ఉన్నా కొందరు భ్రష్ట జీవితాన్ని గడుపుతారు. సమాజం ముందు వారెటువంటి ఆదర్శాన్ని ప్రతిపాదించలేరు. నాట్యామృతము పుస్తకం ప్రతిభ చేతిలోకి రావడంతో ఆమె జీవితం సంపూర్ణంగా ఒక కొత్త మలుపు తిరిగింది. ఆమెకు కీర్తి ఉంది, ధనం ఉంది. కాని మనశ్శాంతి లేదు. భవభూతి సాహచర్యంతో దానిని పొందాలనుకొన్నది. కానీ భవభూతి ఇప్పుడు తనకు దూరమైనాడు. లేదా తనే భవభూతిని దూరం చేసుకొన్నది. తనకు భవభూతి మీద లౌకికమైన దృక్పథం ఉంది. అతడు తనకు భర్తగా యోగ్యుడని తాననుకొన్నది. కాని అతనికి తన మీద కేవలం ఒక దేవతా రూపమైన ఆరాధనం మాత్రమే ఉన్నదని గ్రహించడం ఆమెకు కష్టమైంది. దాని మీద భవభూతికి వివాహమైందని, ఆతనికో కూతురుందని తనకిప్పుడే తెలిసింది. అందులోనూ ఆమె గురుపాదస్వామి వద్ద నాట్యం అభ్యసిస్తున్నది. గురుపాదస్వామి ఒక విధంగా తనకు గురువు. మరొక విధంగా శత్రువు. ఆ తర్వాత ఆ పాపను అతని వద్ద నాట్యానికి ఎందుకు పెట్టాలి. గురుపాదస్వామి విశ్వవిఖ్యాతి గాంచిన నాట్యాచార్యుడు. ఆయనకు ప్రతిభకు పడదన్న విషయం భవభూతి కెలా తెలుసు? ఈ కారణం చేత భవభూతి తన కుమార్తెను గురుపాదస్వామి వద్ద నాట్యవిద్యను అభ్యసించడానికి చేర్పించడం తప్పని తానెలా అనగలదు.



ఏమైనప్పటికీ మొత్తానికి ప్రతిభకు మనశ్శాంతి లేకుండా పోయింది. ఈ లోపల ఆమెకు సుధారాణి వద్ద నుండి జాబు వచ్చింది. సుధారాణి విదేశాలలో తనకు వచ్చిన అవకాశాలు సద్వినియోగం చేసుకుంది. భారతీయ నాట్యకళా సౌందర్యాలకు విదేశీయుల చేత శృంగార నీరాజనాలు పట్టించింది.

"అక్కా! నా కళావిజయాలను గురించి నీకు వివరంగా మళ్ళీ జాబు వ్రాస్తాను. కాగా మనం అనుకొన్న కార్యక్రమాల్లో మరొకటి మిగిలిపోయింది. అది గూడ త్వరలోనే నిర్వహించి నీ రుణం నేను తీర్చుకుంటాను" అని జాబు వ్రాసింది. ఆ మిగిలిపోయిన కార్యక్రమం ప్రతిభ నేతృత్వంలో ఆయా దేశాల్లో కళా కేంద్రాలు స్థాపించడం. దీని వల్ల ఇటు తన నాట్య విద్యను వ్యాప్తిలోకి తీసుకొని రావడంతో పాటు అటు గురుపాదస్వామి ప్రారంభించిన సంస్థలకు పోటీగా పని చేసి అతని మీద దెబ్బ తీయడం కూడ ఆమె ఆశించిన మరొక ప్రయోజనం. ఈ ఉత్తరం చూచిన తర్వాత ప్రతిభ మనస్సులో తిరిగి క్షీరసాగర మథనం ప్రారంభమైంది. అమృతము హాలాహలము వెంట వెంట పుట్టాయి. తనను నటయోగినిగా భవభూతి భావిస్తున్నాడు. రాగద్వేషాలకు అతీతంగా నృత్యాన్ని ఒకసాధనంగా చేసుకొని ఆత్మసాక్షాత్కారాన్ని పొందడం నటయోగుల లక్షణం. గురుపాదస్వామి తనకు తీరని ద్రోహమే చేసి వుండవచ్చు. కాని అందుకు తాను ప్రతీకారం తీర్చాలనుకోవడం యోగుల లక్షణమా? తాను ప్రతిభ గల నర్తకి కావచ్చు కాని యోగినని మాత్రం కాదు. ఈ భావం ఆమె మనస్సు పెనుతుఫానుకు ఊగిన పూదోటవలె విచలితం అయింది. తనలో సద్గుణాలున్నా లేకున్నా భవభూతి తనను యోగినిగా భావిస్తున్నాడు కాబట్టి అతని విశ్వాసాన్ని వమ్ము చేయకుండా వుండడం కోసమైనా తాను నాట్య తపస్విని అయితే ఎంత బావుండును అనుకొన్నది ప్రతిభ. ఆమెకు సికింద్రాబాదులోని ఒక విద్యాసంస్థ వారు సన్మాన సభ నిర్వహించారు. అందులో కొన్ని వేల మంది విద్యార్థినీ విద్యార్థులున్నారు. సన్మానసభ ప్రార్థనా గీతంతో మొదలైంది. ప్రార్థనను ఆశాలత అనే ఒక అమ్మాయి పాడింది. ఆమె తొమ్మిదవ తరగతి చదువుతున్నది. ఆ పాప కంఠ మాధుర్యానికి ప్రతిభ ఆశ్చర్యపోయింది. ఆశాలతను దగ్గరికి రమ్మని పిలిచింది. ఆమె కుంటుకుంటూ వచ్చింది. ఆశాలతకు పోలియో అన్న విషయం తెలిసి ప్రతిభ ఖిన్నురాలయింది. ఈ పాప పేరు ఆశాలత. మేజర్ మహేంద్రనాథ్ గారి కూతురు. కోకిల కంఠం. మా సంస్థలో పాటలన్నీ ఈమె చేతనే పాడిస్తాం అన్నది ప్రక్కనే కూర్చున్న ప్రిన్సిపాల్ ప్రతిభతో, మేజర్ మహేంద్రనాథ్ పేరు వినేసరికల్లా ప్రతిభ మనస్సులో సుమలత స్ఫురించింది. సుమలత ఇంటర్ చదువుకుంటున్న విద్యార్థిని. మేజర్ మహేంద్రనాథ్‌గారి కూతురు. ఆమె ప్రతిభ వద్ద డ్యాన్స్ నేర్చుకుంటున్నది. సుమలత నీకేమవుతుంది అని ప్రశ్నించింది ప్రతిభ. "ఆమె మా అక్క" అని చెప్పింది ఆశాలత. సుమలత నా దగ్గర డ్యాన్స్ నేర్చుకుంటుంది నీకు తెలుసు కదా! "అవును తెలుసు."

"అయితే నీ వెప్పుడూ మీ అక్కతో నాట్యాలయానికి వచ్చినట్లలేదే, అసలు తనకొక చెల్లెలున్నట్లు ఆమె నాతో ఎప్పుడు చెప్పి వుండలేదే."

"కావచ్చు. నాకు అలాంటి చోట్లకు రావాలంటే కొంచెం సిగ్గండీ. పైగా అది నాట్యవిద్యాలయం కదా! నా బోటి కుంటి వారు, గ్రుడ్డివారు అలాంటి దేవాలయాలకు రావడం తప్పు." ఈ మాట అన్నపుడు ఆమె ముఖంలోని హావభావాలను బట్టి ఆశాలత మానసికంగా ఎంత క్రుంగిపోయిందో ప్రతిభ తేలిగ్గానే ఊహించుకోగలిగింది. ఈ మాట లకస్మాత్తుగా ఆవిడ అన్నవి కావు. బహుశా ఈ విషయం వాళ్ళింట్లో చాలసార్లు చర్చకు వచ్చి ఉంటుంది. అక్కతో పాటు తాను కూడా డ్యాన్స్ నేర్చుకోవాలని ఆశాలత తన కోర్కెను వ్యక్తం చేసి వుంటుంది. అది నాట్యదేవాలయం. అందులోనికి కుంటివాళ్ళు,గ్రుడ్డివాళ్ళు పోగూడదని మహేంద్రనాథ్‌గారో ఆయన భార్యో కుమార్తెను మందలించి వుంటారు. దానితో ఆశాలత శారీరకంగానే గాక, మానసికంగాను నిహతురాలైంది బహుశః ఇంట్లోని ఆ మాటల ప్రతిధ్వనులే ఆమె ఇప్పుడు తనతో చేసిన సంభాషణ. ప్రతిభ కన్నులు చెమర్చాయి. ఆమెలో మాతృత్వం పెల్లుబికింది. ఆశాలతను దగ్గరికి తీసుకొంది. మృదువుగా తన చేతో ఆమె శరీరాన్ని స్పృశించింది ఆశాలత అంగ ప్రత్యంగము తాకుతున్నప్పుడు ప్రతిభలో ఏదో ఒక మనోజ్ఞమైన భావస్పందన కలిగింది. ఆశాలత తల్లి స్థానంలో తాను ఉన్నట్లయితే ఎలా వుండేదో క్షణ కాలం పాటు ఊహించుకొంది. అప్పుడు జీవితానికి అర్థం పరమార్థం స్త్రీ జన్మకు సార్థక్యం ఏమిటో ప్రతిభకు తెలిసింది. ఆశాలత తన కుమార్తెయే అయి వున్నట్లయితే తానెలా స్పందించేది. తానొక సుప్రసిద్ధ నర్తకి అయితే తన కుమార్తె ఒక అవిటిదా? ఎంత దారుణం. మొగ్గలోనే రేకులు రాలిన పూవు ఆశాలత. ఈ సృష్టికి అర్థమేమిటి? ఈమె నీ ప్రకృతి వైపరీత్యం నుండి కాపాడగల్గే వారే లేరా? లేకేం. నాట్యామృతం ఉన్నది కదా! అన్నది ప్రతిభ మనస్సు. అవతల ప్రతిభకు సన్మానం జరుగుతుంది. సంస్థ అధ్యక్షురాలు ఇతర వక్తలు ప్రతిభను ప్రశంసిస్తున్నారు. పూలదండలు వేస్తున్నారు. శ్రోతలు చప్పట్లు కొడుతున్నారు. సభా వాతావరణ మంతా ఉద్విగ్నంగా ఉంది. కాని ప్రతిభ మనస్సు అక్కడ లేదు. ఇది నాట్యామృతానికే కాదు తనకూ పరీక్ష అనుకున్నది ప్రతిభ. భవభూతి మీద తనకున్న అభిమానం ప్రాచీన ఋషుల తాళపత్ర గ్రంథాలపై తనకున్న భక్తి నటయోగిని కావాలన్న తన వాంఛ, ఆశాలత మీద ఉన్న జాలి. అన్నీ ఇప్పుడు తాను చేయబోయే ప్రయోగంమీదనే ఆధారపడి వున్నాయి. సభ ముగిసిపోయింది ఒక కాగితం మీద ఆశాలతను రేపు సుమలతతో పాటు తమ నాట్య విద్యాలయానికి పంపించవలసిందిగా మహేంద్రనాథ్‌గారి కొక ఉత్తరం వ్రాసి ఆ జాబును






# ఆదా అలవరచుకోండి అది ఆదుకొంటుంది మిమ్మల్ని.



చేతిలో డబ్బులు ఇట్టే ఖర్చయిపోతాయి.
మొదటి తారీఖు జీతం తీసుకుంటే, ఎలా ఖర్చయిందని తెలియకముందే అది చేతిలోంచి మాయమవుతుంది.
అందుకే జీతంలోనే కొంత ఆదా చేయండి. అది ఆదుకొంటుంది మిమ్మల్ని జీవితాంతం.
దానికి అనువైన పథకం
'పేరోల్స్ సేవింగ్స్ పథకం'.

## సురక్షిత పొదుపు పథకం

ఒక వేళ డిపాజిట్టు దారు రెండేళ్ళ తర్వాత మరణించిన పక్షంలో ఐదు సంవత్సరాలు కట్టినట్టుగా భావించి, ఆ మొత్తం అతని నామినీకి వెంటనే చెల్లించబడుతుంది. వారసత్వపు పత్రం లాంటి బాదర బందీ ఉండదు.

మీరు, మీ కార్యాలయంలో గ్రూప్ లీడరు.

## పేరోల్ సేవింగ్స్ పథకంలో చేరండి.

* మీ జీతంలోంచి రూ 5, 10, 15, 20, 25 ప్రతి నెలా తగ్గించి. 5 సం ల రికరింగ్ డిపాజిట్ అకౌంట్‌లో

  లేదా

* 10 సం ల సి.టి.డి అకౌంట్‌లో జమ చేయడానికి మీ 'ఎంప్లాయర్'కి అంగీకార పత్రాన్నివ్వండి.

* రూ. 50/- డినామినేషన్‌కు మించని అకౌంట్లకు రక్షిత పొదుపు పథకాన్ని, 5 సం ల రికరింగ్ డిపాజిట్ పథకంలో పొందండి.

మీరు కాని మీ కార్యాలయంలోని గ్రూప్ లీడరు కాని పోస్టాఫీసుకు వెళ్ళకుండా మీరు చేసే ఆదా ప్రతి నెలా పోస్టాఫీసులో జమ అయ్యేటట్లుగా ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఏర్పాటు చేసింది.

మీ కార్యాలయంలోని గ్రూప్ లీడరు జమ చేయించే మొత్తంలో 2 1/2 శాతం కమీషన్ లభిస్తుంది.
పది మంది కలిసి ఏ కార్యాలయంలోనైనా ఈ ఏర్పాటును చేసుకోవచ్చు.





దికమీషనర్ ఆఫ్ స్మాల్ సేవింగ్స్
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

జాతీయ పొదుపు సంస్థ.

హిమాయత్‌నగర్, హైదరాబాదు 500 029.

Breeze/NSO/8534

# ప్రతిభ

ఆశాలతకిచ్చి "పాపా! ఇంటికి పోగానే దీనిని మి నాన్నగారి కివ్వు. రేపొకసారి అర్జెంటుగా నీవు మా నాట్యాలయానికి రా" అని చెప్పింది. ప్రతిభ తిరిగి సభానంతరం తన కళాకేంద్రానికి వచ్చింది. ఆనాడామె క్లాసు తీసుకోలేదు. సీనియర్ విద్యార్థినులే జూనియర్స్‌కు ప్రాథమికమైన పాఠాలు నేర్పారు. రాత్రి బాగా పొద్దుపోయిన తర్వాత ఆమె నాట్యామృతాన్ని పరిశీలించసాగింది. అందులో ఉషాదేవతను స్తోత్రం చేసే వేదరుక్కు ఒకటి వుంది. అలాగే అగ్నిని, వరుణుని, ఇంద్రుని నటరాజస్వామిని ప్రార్థిస్తున్న శ్లోకాలు ఉన్నాయి. కొన్ని వేదమంత్రాలు మరికొన్ని వేరే శ్లోకాలు. ఎక్కడివో తెలియవు. వాటికి అభినయం కూర్చి నర్తించినంత మాత్రాన రోగాలు నయమవుతాయా? అలా అయితే అందరూ ఈ పని చేయవచ్చుగదా! ప్రతిభకు వున్నట్లుండి మరొక శాస్త్ర రహస్యం అకస్మాత్తుగా స్ఫురించింది. ఈ మంత్రాలు ఎప్పుడు పడితే అప్పుడు ఫలించవు. వీటికి కాలనియమం ఉంది. సంగీతంలోని రాగాలు కూడ ఎప్పుడు పడితే అప్పుడు వాయిస్తే అవి వికసించవు. ప్రత్యేకంగా వాటికి నియమిత సమయాలు కూడ శాస్త్రజ్ఞులు నిర్దేశించారు. "భూప్" వంటివి తెల్లవారు జామున వికసిస్తే, మరికొన్ని అర్ధరాత్రి రసార్ద్రతకు దోహదం చేస్తాయి. బహుశా ఈ నాట్యామృతంలోని మంత్రాలు కూడ అలాంటివే అయివుండవచ్చు. అలాగే ఇందులోని ఒక్కొక్క మంత్రం ఒక్కొక్క జబ్బును నయం చేస్తుండవచ్చు. ఆ మంత్రం శాస్త్రజ్ఞుల చేత నిర్దేశించబడిన ఆ ప్రత్యేక సమయంలో నర్తించినప్పుడే, అభినయించినప్పుడే అది ఫలప్రదాయిని కావచ్చు. ఇది ఇందులో ఉన్న రహస్యం. ఈ జటిలత మాట ఎలా వున్నప్పటికి

ప్రతిభ ఆశాలత మిద ముందుగా నాట్యామృతాన్ని ప్రయోగించాలనుకుంది. మర్నాడు ఉదయం ఆశాలతతో పాటు ఆమె అమ్మకూడ వచ్చింది. "అమ్మాయినెందుకో మిరు అర్జెంటుగా రమ్మన్నారట. ఏమి కారణమో తెలుసుకొందాం" అన్నది ఆశాలత తల్లి కొంచెం గాభరాగ. అప్పుడు ప్రతిభ తాను చేయబోయే ప్రయోగాన్ని గూర్చి చంద్రావతితో వివరంగా చెప్పింది. అది విని చంద్రావతి ఆశ్చర్యపోయింది. నిజంగా ఇలాంటిది ఉంటుందంటారా? అని అపనమ్మకంగా ప్రశ్నించింది. "ఆశాలతను వాళ్ళ నాన్నగారు చాలమంది వైద్యులకు చూపించారు. కాని ప్రయోజనం లేకపోయింది. నిజంగా మి పుణ్యాన మా పాపకు నయమయితే మి రుణాన్ని మేం ఈ జీవితంలో తీర్చుకోలేం" అని ఆమె కంటతడి పెట్టుకున్నది. ప్రతిభ బరువుగా నవ్వి "చంద్రావతిగారు! ఇది కేవలం ఒక ప్రయోగం మాత్రమే. ఇందులో నేను విజయాన్ని సాధిస్తానని నమ్మకం ఏమిలేదు. కాకుంటే ఆశ మాత్రం ఉంది. భగవంతుని మిద పరిపూర్ణ విశ్వాసం వుంది. ఇక పాప అదృష్టం. నటరాజస్వామి వారి దయ. ఆశాలతపైనా ప్రయోగం చేయడానికి మీరనుమతించండి".

"అంతకన్నానా తల్లీ" అంటూ చంద్రావతి దాదాపుగా ప్రతిభ కాళ్ళకు నమస్కారం చేసినంత పనిచేసింది. ఆశాలతను ప్రతిభ తన వద్దనే ఉంచుకొనేందుకు ఏర్పాట్లు జరిగాయి. వెంటనే ఒక మంచి రోజు చూసి ప్రతిభ, ఆశాలత సుస్నాతులైనారు. నటరాజస్వామిని అర్చించారు. నీరాజనాన్ని కళ్ళకద్దుకున్నారు. అగ్ని మీళే పురోహితమ్ అన్న వేదంలోని మొదట రుక్కును ప్రతిభ అభినయించింది. ఆ మంత్రానికి అభినయం తానే సమకూర్చుకొన్నది. ఆశాలత ఆ నృత్యాన్ని చూస్తుండాలి. ఇది ఒక రకమైన వైద్యం. అలా చూడడం వల్ల ఆమె మనస్సులో కల్గిన స్పందనలు శరీరమంతా వ్యాపించి సర్వాంగములలోను ఒకానొక విద్యుత్తు ప్రవహిస్తుంది. అదే ప్రాణశక్తి. చైతన్యమూర్తి. "డ్యాన్స్ తెరఫీ"లో ఇదొక భాగం. ఆ తర్వాత ఆశాలతకు సంగచ్ఛధ్వం అనే మంత్రం నేర్పింది. "ఆశా ఈ మంత్రాన్ని నీవు విడువకుండా ఇరవైనాలుగు గంటలు అభ్యాసం చేస్తుండు. ఈ మంత్రం ఏ ముహూర్తంలో వికసిస్తుందో మరే ముహూర్తంలో ఫలిస్తుందో మనకు తెలియదు. అందువల్ల ఆది తెలిసేవరకు నీవు విశ్రాంతి లేకుండా అన్ని వేళల్లోను నీవు దీన్ని సాధన చేస్తుండాలి. అవిరామంగా రోజంతా నర్తించడం సాధ్యపడదు. కాబట్టి ఇవ్వాళ ఉదయం నుండి మధ్యాహ్నం దాక సాధన చేయి. రేపు మధ్యాహ్నం సాయంత్రం వరకు నర్తిస్తుండు

ఎల్లుండి సాయంత్రం నుండి అర్ధరాత్రి వరకు నర్తించు. ఆ మర్నాడు అర్ధరాత్రికి మొదలుపెట్టి సూర్యోదయం వరకు నర్తించు. నీతోపాటు నేను కూడ మేలుకొని వుండి నిన్ను పరిశీలిస్తుంటాను. ఏదైన ఒక ముహూర్తంలో నీలో ఏదైన ఒక ప్రత్యేకమైన స్పందన కల్గినట్లయితే విశేషమైన అనుభూతి గోచరించినట్లయితే వెంటనే నాకు చెప్పు" అంది ప్రతిభ. ఆశాలత మంత్రాన్ని నేర్చుకొంది.

"సంగచ్ఛధ్వం సంవదధ్వం సంవో యనాంసి జానతాం. దేవాభాగం యథాపూర్వే సంజానానా ఉపాసతే". ఈ మంత్రం ఆశాలత తన కోకిల కంఠంతో నాట్యాలయంలో గానం చేస్తున్నది. భిన్న భిన్న కాలంలో ఆ మంత్రానికి ప్రతిభ నిర్దేశించిన పద్ధతిలో ఆశాలత అభినయిస్తుంది. ముందుగా ఆమె సిగ్గుపడింది. చాల భయపడింది. అయితే ఈమె అభినయ మంతా మిగిలిన విద్యార్థులెవ్వరూ చూడకుండా జరుగు తుండేది. కాబట్టి ఆమెకు కొంచెం ధైర్యం వచ్చింది. తన వికలాంగంతో అభినయించడం కష్టంగాను, అవమానంగాను ఉండేది. అయినా అలా యాంత్రికంగా నర్తిస్తూనే వుంది. ఏమి ఫలితం కనిపించలేదు. ఆశాలత తల్లిదండ్రులు వారానికోసారి వచ్చి ఆశాలతను చూచి వెళ్తున్నారు. వారిలో ఏవో కొత్త ఆశలు చిగురించాయి. కాని చేయగా చేయగా ఆశాలతలో విసుగు, ప్రతిభలో కొంచెం నిస్పృహ మొదలయ్యాయి. వారాలు, నెలలు గడుస్తున్నాయి. మంత్రం ఏమి ఫలించ లేదు. ఇక భవభూతి తన కిచ్చిన నాట్యామృతం మిద






ప్రతిభ ఆశలు వదులు కొంది. "క్షమించండి. నేనీ ప్రయోగంలో విఫలమయ్యాను. మి అమ్మాయిని మి ఇంటికి పంపించేస్తున్నాను." అని ప్రతిభ ఆశాలత తల్లిదండ్రులకు చెప్పాలనుకొంది. కాని ఈ మాట చెప్తే వారొక్కసారి క్రుంగిపోయి కుప్పకూలి పోయేలా వున్నారు. మామూలుగా వుంటే వారు ఆశాలత దురదృష్టానికి జీవితంలో సమాధాన పడేవారే. కాని తానిప్పుడు వారిలో లేని ఆశలు కల్పించింది మహా వైద్యులు, విదేశీ సర్జన్లు చేయలేని ఒక మహాద్భుత మేదో తన వల్ల జరగబోతున్నట్లు వారు అనవసరంగా ఊహించుకొని మానసికంగా రంగుల కలలు కంటున్నారు. నేడు గాకుంటే రేపైనా ఈ కల కరిగిపోక తప్పదు. తమ కూతురు జీవితాంతం అవిటిదిగా ఉండాలనే విషయం ఒక కఠోర సత్యమై వారి ముందు నిలవక తప్పదు. అలాంటప్పుడు మరికొన్నాళ్ళు వారిని మిధ్యలోనే బ్రతకని, కూతురుకు నయం కాబోతున్నదన్న ఆశలోనే ఆసత్యంలో వారినొక తృప్తిని పొందని," అనుకున్నది ప్రతిభ. అందువల్ల ఆశాలతను ప్రతిభ వారి ఇంటికి పంప లేదు. ఒకనాడు సంధ్యా సమయం అయింది. ఆ రోజు నాట్య విద్యాలయానికి సెలవు. అందువల్ల నాట్యాలయంలో ఎవరూ లేరు. పరిచారికలు గూడ ఏదో పని మీద బయటికి వెళ్ళారు. నటరాజ స్వామి విగ్రహం ముందు ప్రతిభ, ఆమె కెదురుగా ఆశాలత కూర్చుని వున్నారు. అటు నాట్యం కోసం వంచిన నటరాజస్వామి పాదాలను ఇటు వంగిన ఆశాలత పాదాన్ని ప్రతిభ మార్చి మార్చి చూస్తున్నది. ఆమె కన్నులు అశ్రుపూరితా లయ్యాయి. ఉన్నట్లుండి ఆమె తనకు తెలియని ఒక అర్ధ సుషుప్త్యావస్తలోకి వెళ్ళి పోయింది. అది యోగావస్థకు తొలి మెట్టని ఆమెకు అప్పుడు తెలియదు. చైతన్యం పూర్తిగా లేని ఆ దశలోనే ప్రతిభ ఆశాలత తలను తన కుడి చేతితో స్పృశించింది. అప్పటికి సంధ్యాసమయం దాటింది విశ్వనర్తకుడైన నటరాజు తాండవం చేస్తున్న దివ్యముహూర్త మది. ఆనాడు మాస శివరాత్రి. బ్రహ్మ, విష్ణువు, ప్రమధగణము నట్టువాంగం నిర్వహిస్తుండగా విశ్వనర్తకుడు త్రికాలాబాధితమైన విశ్వనర్తనం చేస్తున్నాడు.

ఆశాలత మెల్లగా లేచి నిలబడి నటరాజస్వామి ముందు మోకరిల్లి తిరిగి తన నాట్యం మొదలు పెట్టింది. సంగచ్ఛధ్వం సంవదధ్వం సంవే యనాంఽ జానతాం – అభినయం సాగిపోతున్నది. ఉన్నట్లుండి ఆశాలత రెండు పాదాల్లోను స్పందన ప్రారంభమైంది. పాదంలో మరణించిన జీవకణాలు తిరిగి వికసించడం మొదలు పెట్టాయి. ఒక అపూర్వమైన విద్యుత్తు, చైతన్యం ఆశాలతలో ప్రవహిస్తున్నది. అది బయటి నుండి వచ్చిందో తనలోనే ప్రాదుర్భవించిందో తనకు తెలియదు. ఒక చెట్టుకు ఉన్న పుష్పం నిజానికి రాత్రి నుండే వికసించడం ప్రారంభిస్తుంది. ఆ వికాసక్రమం తొలి దశలో కనబడదు కాబట్టి ఏమి లేనట్లే, జరగనట్లే అనిపిస్తుంది. ఏ సూర్యోదయం వేళకో పూర్తిగా వికసించినపుడు అది అకస్మాత్తుగా వచ్చిందని చూచిన వారిక అనిపిస్తుంది. కాని దానిలో ఒక క్రమ పరిణామం ఉందన్న విషయం చాల మందికి తెలియదు. ఆశాలత పాదానికి ఈ సంధ్యాసమయంలో చైతన్యం వచ్చింది. పూర్తిగా వికసించింది. నిజానికి చైతన్యం ఆమె సాధన మొదలు పెట్టిన తొలినాడే అంతరాంతరాల్లో సూక్ష్మాతి సూక్ష్మంగా ప్రారంభమైంది. ఈ విషయం ఆ పాపకు తెలియదు. ఆశాలత ఇప్పుడు పూర్తిగా ఆరోగ్యవంతురాలు. ఆమె కాలు చాల లాఘవంగా, సునాయాసంగా నర్తిస్తున్నది. ప్రతిభ కళ్ళు తెరిచి తన ముందు జరిగిన ఈ అద్భుతాన్ని చూచింది. ప్రాచీన మహర్షుల దివ్య విద్యలు మరొక్కసారి ఆమె నాట్యాలయంలో తమ విజయ పతాకాన్ని ఎగుర వేశాయి. ప్రతిభ సాధించిన విజయం క్షణాల మీద మహేంద్రనాధ్‌కు, చంద్రావతికి తెలిసపోయింది. ఆశాలత జన్మించినప్పటి కన్నా తిరిగి ఈ పునర్జన్మ నాడు వారెక్కువ ఆనందం పొందారు.

ప్రతిభకు ఇప్పుడు తన జీవితం ఎలా సాఫల్యం చేసుకోవాలో తెలిసింది

ఇన్నాళ్ళు తాను గూడ దాదాపు బాహ్యస్పృహ వదిలిపెట్టి ఏదో యాంత్రికంగా జీవిస్తున్నది. ఈ లోపల సమాజంలో ఎన్నో మార్పులు జరిగి వుండవచ్చు ఆమెకు ముందుగా భవభూతి గుర్తుకొచ్చాడు. అతనికీ వార్తను చెప్తే చాల సంతోషిస్తాడు. అతనిని చూడడమా? మానడమా? భవభూతికి కబురు పంపింది ప్రతిభ. భవభూతి నగరం విడిచి కొంత కాలమైందని, ఎక్కడికి వెళ్ళాడో ఎవరికీ తెలియదని సమాచారం వచ్చింది.

(ఇంకా ఉంది)

# నిషా

టి.ఎస్.ఎ. కృష్ణమూర్తి



మద్రాసు -హవురా నేషనల్ హైవేలో ఒక చోట తుఫాను తాకిడిలో కొట్టుకుపోయిన ఓ పెద్ద బ్రిడ్జి యొక్క రికన్‌స్ట్రక్షన్ వర్కు జరిపించడానికి అత్యవసరంగా డిప్యుటేషన్ మీద వెళ్ళినప్పుడు నేను కొన్ని సమస్యలు ఎదుర్కోవాల్సి వచ్చింది. ముఖ్యంగా దాదాపు వారం రోజుల పాటు సైట్‌లో నే రెసైడ్ అయిపోవాల్సి వచ్చింది.

టార్పాలిన్ క్లాత్‌తో వేయబడ్డ చిన్నడేరా నా రెసిడెన్సీ అయింది. అందులో కూర్చోడాన్కి ఓ గాడ్రేజ్ కుర్చీ, పడుకోవడాన్కి ఓ క్యాంప్‌కాట్ ఉండడం ఓ ఘనతగా భావించాల్సి వచ్చింది ఆ ప్రదేశంలో ఆ పరిసరాలలో.

చుట్టుప్రక్కల ఎటుచూసినా అద్భుతమైన ప్రకృతి సౌందర్యం, విపరీతమైన చలిగాలులు నా మనసునూ, శరీరాన్ని క్రొత్త, క్రొత్త కోరికలతో నింపేశాయి. చెట్టులేని ప్రదేశంలో ఆముదపు చెట్టే మహావృక్షం అన్నట్టు ఆ కీకారణ్యం లాటి ప్రదేశంలో రాత్రింబవళ్ళు కష్టపడుతున్న ఆ నిర్భాగ్య జీవుల మధ్యన ఉన్న ఆ తెల్లటి గిరిజన యువతి నా కళ్ళకు అప్సరసలా కన్పించడం మొదలు పెట్టింది.

వైజాగ్‌లో నాకు మామూలుగా కన్పించే అందమైన ఆడవాళ్ళతో పోల్చితే ఈ యువతి అనాకారే నిశ్చయంగా. కానీ నా భార్యతో పోల్చి చూసుకుంటే మాత్రం ఈమె మంచి అందగత్తె అనుకోవచ్చు ఖచ్చితంగా.

నా పెళ్ళినాడు నా శ్రీమతి ప్రఫుల్లముఖిని చూసినప్పుడు నా మిత్రులంతా ముక్కుల మీద వేళ్ళేసుకున్నారు. ఒకరిద్దరయితే రహస్యంగా అడగనే అడిగారు. అప్పటికప్పుడే "ఈమెను ఏం చూసి చేసుకున్నావురా వెధవా?" అని. నేను చిన్నగా నవ్వి మౌనం వహించాను. మా మామగారు నిండుకుండ. అందుకే తన ఘనతను మా పెళ్ళిలో ఎంత మాత్రమూ కన్పరచలేదు. చాల మామూలుగా సర్వసాధారణంగా జరిగింది మా వివాహం. అందుకే చాలమంది నేను ప్రఫుల్లముఖిని ఏం చూసి చేసుకున్నానో సరిగా అర్థం చేసుకోలేకపోయారు.

దాదాపు ఏడు సంవత్సరాలుగా జూనియర్‌గా కాలం గడిపిన నేను నా పెళ్ళయిన తరువాత మూడు నెలల లోపే అసిస్టెంట్ ఇంజనీరుగా ప్రమోషనును పొందాను మా మామగారి కృషి వల్ల. ఆరు నెలలు పూర్తి కాకమునుపే విశాఖపట్నానికి బదిలీ అయింది నాకు. విశాఖపట్నంలో ప్రఫుల్లముఖి పేరిట బీచ్ రోడ్డులో చిన్న బంగళా ఉంది. విశాఖపట్నం చేరుకోగానే ఆ బంగాళా ముందు మామగారు నాకు ప్రజంట్ చేసిన మారుతి కారు తళతళలాడుతూ కన్పించింది.

నా జీతం మొత్తం బ్యాంకులో పడేసుకోవడం తప్ప ఇంటి ఖర్చంటూ నాకేమి ఉండదు సామాన్యంగా. నేనేది కోరుకున్నా గంటల మీద నాకు లభిస్తుంది. ఎందరో సీనియర్లని తోసిరాజని నన్ను ఎగ్జిక్యూటివ్‌ను చేస్తారు పైవాళ్ళు త్వరలో.

ప్రఫుల్లముఖిని వివాహం చేసుకోవాలని నిశ్చయించుకున్నప్పుడు నేను వేసుకున్న ఎస్టిమేట్సులో ఒక్కటీ కాన్సిల్ కాలేదు. అందుకే నాకు ప్రఫుల్లముఖి ఏనాడూ వికారంగా కన్పించలేదు. నిజానికి కూడా నేను నా భార్యను చాల ప్రేమించాను, ప్రేమిస్తున్నాను. బహుశా నాలాంటి వాళ్ళ ప్రేమ డబ్బుతో ముడిపడి వుండి సౌకర్యాలతో, ఆనందాలతో పెరుగుతుందేమో తెలియదు.

నన్ను కొలాప్స్ అయిన బ్రిడ్జి పనికి డిప్యూటీ చెయ్యగానే మా మామగారికి ట్రంకాల్ చేసి ఓ మాట చెప్పి వుంటే గంటల మీద నా డిప్యుటేషన్ కాన్సిల్ అయి వుండేది. కానీ నేనా పని చెయ్యలేదు. రొటీన్ లైఫ్‌తో డల్ అయిపోయి వున్నందున కాస్త థ్రిల్ వెతుక్కుంటూ వచ్చేశాను ఇక్కడికి.

కటిక చీకటిలో, పరమ చలిలో క్యాంప్‌కాట్ మీద సరయిన నిద్ర లేకుండా రెండు రాత్రులు గడిపాక ఆ గిరిజన యువతి పొందు లేకుండా అక్కడ చీకటిరాత్రులు గడపడం అసంభవం అనిపించింది.

ప్రతి పనికి ఓ మార్గం ఉంటుంది. అయితే నాలాంటి అనుభవ రహితునికి.... అలాంటి వాటిలో మార్గం లభించడం కష్టమైన పని. అందుకే ఆ మారుమూల ప్రదేశంలో నా కోరిక తీర్చుకోవడానికి సరయిన మార్గం నాకు లభ్యం కాలేదు. అక్కడ ఎదుటి వారి అవసరాలను చూపులతోనే గ్రహించేసి మార్గం చూపగల ఖరీదైన బ్రోకర్లు కానీ, ఖరీదైన అమ్మకందార్లు కానీ లేరు.

నేను చెయ్యదలచుకున్న పని వర్క్ ఇన్స్‌పెక్టర్లకూ, మేస్త్రీలకూ, కంట్రాక్టర్లకూ తెలియకుండా జరగాల్సినది. ఎందుకంటే అన్నిటి కన్నా ముఖ్యమైనదైన ప్రెస్టేజిని కోల్పోరాదు.

మూడవ నిద్రలేని రాత్రి కూడా గడచిపోయాక నాకు ఒక మార్గం దొరికింది. ఆ మార్గాన్ని పట్టుకుంటే నా పని జరగవచ్చుని అన్పించింది. ఆ మార్గం ...లేదా ఆ మార్గదర్శకుడు కళాసీ బాబు. కళాసిబాబు కంట్రాక్టర్ల పనికి పనివాళ్ళను తీసుకువచ్చి జరిపించే వ్యక్తి. అందంగా, హుషారుగా ఉండే ముప్పయి యేళ్ళ యువకుడు.

కళాసీబాబు అసలు పేరేమిటో నాకేకాదు అక్కడున్న వాళ్ళ కెవరికీ తెలిసినట్లు లేదు. ఆ మూడు రోజుల ముఖ పరిచయంతో నేను అతన్ని గూర్చి తెలుసుకున్న దాన్ని బట్టి అతను బాగా చదువుకున్నవాడే! మరే ఉద్యోగమూ దొరకక కంట్రాక్టర్లకు పనివాళ్ళను తెచ్చి పని చేయించే సబ్ కాంట్రాక్టరుగా జీవితం నెట్టుకొస్తున్నాడు. రోజు కూలీ తనే చెల్లించి పనివాళ్ళను తెచ్చి పనులు చకచకా జరిపించడం అతని పని. పని ముగిసిన తరువాత మొత్తం పనికి కంట్రాక్టర్ల వద్ద డబ్బు తీసుకుంటాడు. సామాన్యంగా అతను నవ్వపోవడమంటూ ఉండదు. మనిషి సదా నవ్వుతూ, సునిశితమైన హాస్యంతో ఇతరులను నవ్విస్తూ ఉంటాడు. మంచి కలుపుగోరు మనిషి అతను.

నెమ్మదిగా అతనితో మామూలు సంభాషణలతో పరిచయం కాస్త పెంచుకుని సాయంకాలం అయిన తరువాత ఈవినింగ్ వాక్ వెళ్ళినట్లు అలా వెల్తూ అతన్ని వెంట రమ్మని పిలిచాను. వచ్చాడు!

దాదాపు అరమైలు పిచ్చాపాటి మాట్లాడుతూ నడచి వరదలలో కొట్టుకుపోకుండా నిలబడ్డ ఓ గట్టి బ్రిడ్జి గోడ మీద కూర్చున్నాను. అతను తటపటాయిస్తోంటే "పరవాలేదు కూర్చో!" అంటూ ప్రక్కలో కూర్చోబెట్టుకున్నాను.

అక్కడ, అప్పుడు నెమ్మదిగా సున్నితంగా విప్పి చెప్పాను నా కోరికను గూర్చి.

అతని కళ్ళలో కన్పించీ కన్పించనట్లుగా నా మీద అసహ్యంలాంటి భావమేదో కదిలింది.

"ఎవరు బాబూ, పెద్దగంగు మీదనా మీ దృష్టి పడ్డది?!"

కొద్దిగా కరకుగానే అయినా నవ్వుతూనే అడిగాడు. అతను అడిగిన విధానానికి కొద్దిగా హర్టు అయినా పైకి కన్పరచలేదు నేను ఆ విషయాన్ని.

"పెద్ద గంగో, చిన్న గంగో పేరు తెలియదు నాకు. తెల్లగా, సన్నగా, పొడుగ్గా వుంటుందే.... ఈ రోజు ఎఱ్ఱగళ్ళ చీర కట్టుకుని పని చేస్తోందే... ఆవిడ!" అన్నాను.

"ఆ! ఆమే పెద్దగంగు!"

"అయితే ఆమెను.. ఈ రోజు రాత్రి పది గంటలు దాటిన తరువాత నెమ్మదిగా, రహస్యంగా నా టెంటులోనికి వచ్చేయమని చెప్పు. డబ్బు ఎంత కావాల్సినా ఇస్తానులే!" అన్నాను. నేను క్యాంపుకాట్‌కూ నాకూ మధ్యన నా చేతులలో ఆమెను ఊహించుకుంటూ ఎటూ బయటపడిపోయాను కాబట్టి కళాసీబాబు ముందు నేను సిగ్గు పడలేదు.

"అసంభవం బాబూ.. అది మాత్రం కానిపని మరెవర్నైనా చూపించండి.. ప్రయత్నం చేస్తాను. ఆమె మాత్రం తన ఎత్తు బంగారం రాశి పోసినా ఎవరి వద్దకూ చచ్చినా రాదు!" అన్నాడు.









"నిజంగానా?"

"అవును బాబూ!"

"ఎలా తెలుసు?"

"స్వానుభవం!"

నేను నమ్మలేనట్లు చూశాను. కళాసీబాబు చెప్పడం మొదలు పెట్టాడు.

* * * *

దాదాపు ఏడు సంవత్సరాల క్రితం సంగతి బాబూ.... నేను అప్పుడప్పుడే పనివాళ్ళను కంట్రాక్టర్లకు సప్లయి చేసి పెట్టడం నేర్చుకుంటున్నాను.

ఒక సిమెంటు రోడ్డు వెయ్యడానికి చాల పెద్ద సంఖ్యలో పనివాళ్ళు కావాల్సి వచ్చినప్పుడు నేను పనివాళ్ళ పల్లెలకు స్వయంగా వెళ్ళి చార్జి డబ్బులు కాక రోజువారి కూలీ తలకు రెండ్రూపాయలు ఎక్కువ ఇస్తానని ఆశపెట్టి మనుషులను తీసుకు వచ్చే ప్రయత్నంలో ఉన్నప్పుడు మొట్టమొదటిసారి చూశాను ఆమెను... అంటే పెద్దగంగును.

ఆమె అన్న పెద్దరంగుడు చాలసార్లు నేను పంపించిన ప్రదేశాలలో పని చేశాడు అప్పటికే. అయితే వాడికి అంత అందమైన చెల్లెలుందని నేను ఎలా అనుకోగలను?

ఇప్పుడు ఆమెలో ఏం అందముందని? అప్పుడు.... అంటే- నేను తొలిసారి ఆమెను చూసిన రోజులలో ఎంత అందంగా ఉండేదో మాటలతో చెప్పలేను నేను.

నాకు అప్పటికే పెళ్ళయింది. నాకు స్త్రీ వ్యసనమూ లేదు ఎప్పుడూ. అయినా పెటపెటలాడిపోతున్న ఒంపులున్న పెద్దగంగును చూడగానే నాలో వ్యామోహం ఉప్పెనలా పొంగింది.

ప్రతిరోజూ మంచి సోపుతో స్నానం చేయించి, మంచి పోషణలో వుంచి, మంచి సిల్కు చీరలు కట్టబెడ్తే ఎలా ఉంటుందో ఊహించడాన్కి ప్రయత్నాలు చేశాను వచ్చిన పని మరచిపోయి. 'ఈమెను పొందలేనిజన్మ నిరర్ధకం' అని కూడా అనుకున్నాను.

ఎకువ మంది మనుషులు అర్జంటుగా కావాలి రోజుకి మూడు రూపాయలు. ఎక్కువ కూలీ ఇస్తానని చెప్పేసరికి పెద్దరంగడు గంగును కూడా పనిలోకి తీసుకు వచ్చాడు. పని జరుగుతున్న రోడ్డు వద్ద అటూ ఇటూ తిరుగుతూ ఆమెను చూస్తూ ఉండేవాడ్ని.

పెద్ద, గొప్ప అట్రాక్షన్ ఉండేది నాకు ఆమెలో.

రోజులు, వారాలు, నెలలు గడచిపోయాయి. నా కోరిక మాత్రం తీరలేదు. ఎన్ని రకాలుగా, ఎందరి ద్వారా ప్రయత్నించినా కూడా ఒకే మాట జవాబుగా లభించేది.

"అది నిప్పు నాయనా! ఆ పని మాత్రం కానిపని... అలాంటి ఆలోచనే పెట్టుకోకు!"

ఎందరు నిరుత్సాహ పరచినా నాకామె మీద ఏర్పడిన భ్రమ తగ్గలేదు. "ఆఫ్టాల్ ఒక గిరిజన పిల్ల... ఇంకాస్త ప్రయత్నం చేస్తే ఏదో ఒక చోట, ఏదో ఒక ఆశకు పడిపోక ఏం చేస్తుంది?" అనుకుంటూ కోరికలు పెంచుకోసాగాను. చివరికి నా స్థితి ఎలా తయారయిందంటే... నా భార్యతో సన్నిహితంగా, ఏకాంతంగా ఉన్న సమయాలలో సైతం కళ్ళ ముందు పెద్దగంగు రూపమే మెదులుతూ ఉండేది. ఆమెతో కలసి ఒక్కరోజయినా శారీరక సౌఖ్యం అనుభవించకపోతే కాలం ధుర్లభం అయిపోతుందనిపించింది.

చివరికి ఒకనాడు ఆమెను ఏకాంతంగా కలుసుకుని ఆమె మీద నాకెంత ఇష్టం వుందో తెలిపి నా కోరిక తీర్చమంటూ ఆమె చేతులు పట్టుకుని ప్రాధేయపడ్డాను. ఆమె కాదంటే క్రింద పడవేసి బలవంతంగా అయినా నా కోరిక తీర్చుకోవాలి అనేంత వాంఛతో ఉన్నాను అప్పుడు.

"రెండు నెలలలో నా మనువయ్యా!" అంది ఆమె.

"అయితే ఏమిటి? ఒక్కసారికి ఏమవుతుంది?" చాల తమకంగా అన్నాను.

"నీవు ఎంగిలి చేసిన ఎంగిలి కూడు నన్ను మనువాడినోడికి పెట్టమంటావయ్యా?"

ఎందుకో చాచి చెంప మీద కొట్టినట్లయింది. నన్ను ఆవహించిన మత్తు ఒక్కసారిగా వదిలిపోయినట్లయింది క్షణాల మీద. నేను తేరుకునేసరికి నా ముందు ఆమె లేదు... ఎందుకో? వళ్ళు జలదరించింది.

కొద్దిరోజులు గడిచిన తరువాత ఆమెకు పెళ్ళయింది. ఆమె కూలి పనికి రావడం మానేసింది. ఆమె భర్త, ఆమె అన్న తరచుగా నా వద్దకు పనులకు వస్తుండేవారు.

మూడు సంవత్సరాలు గడిచాయి. ఆమె మీద నాకు ఉండిన కోరిక పూర్తిగా తగ్గిపోయింది క్రమక్రమంగా. ఆమెకు ఇద్దరు పిల్లలు పుట్టారని తెలుసు... అయితే ఆమె పెళ్ళయిన తరువాత ఆ మూడేళ్ళలో నేను ఆమెను చూడలేదు.

నిర్మాణంలో వున్న ఓ వాటర్ ట్యాంకు క్రింద నిలబడి ఏదో పని చేస్తున్న పెద్దగంగు భర్త నెత్తి మీద పైనుండి బరువైన మట్టిగడ్డలు జారి పడడంతో దుర్మరణం పాలయిపోయాడు ఒకనాడు హఠాత్తుగా. అతను చనిపోయిన తరువాత కొంత కాలానికి పెద్దగంగు మళ్ళీ పనిలోకి రావడం మొదలు పెట్టింది.

ఆమె శరీరంలో మునుపటి మెరుపులు లేవు. ఆమె ముఖంలో విషాదపు మరకలు తప్ప తళుకులులేవు. ఆమెలోని వంపులూ, సొంపులూ అన్నీ కరిగిపోయాయి ఎప్పుడో. అయినా నాలో ఆమె పట్ల 'ఆ కోరిక' అధికం అవసాగింది మళ్ళీ. వంటరితనంతో మగ్గుతున్న మనిషి తోడు కోసం ఎదురు చూస్తుంది అనే వింత భ్రమ కారణం.

నాకు అప్పటికి ఒక విషయం అనుభవంలోకి రాలేదు. మళ్ళీ ఒకసారి అవకాశం కల్పించుకుని ఆమెను నిలేశాను.

"ఆడు తిని వదిలేసి పోయిన ఎంగిలి కూడు నీవు తింటావయ్యా?"

ఆ ప్రశ్న తిరుగులేని రిటార్ట్ అయింది నాకు. నా మీద నాకే చాల అసహ్యం కలిగింది. తరువాత ఆమె మీద నాకు కోరిక కలగలేదు ఎప్పుడూ. ఆమె చుట్టూ సంచరించడం కూడా మానేశాను.

ఒకసారి పెద్దరంగడు పనిలోకి వస్తే యదాలాపంగా అడిగాను. "రంగా నీ చెల్లికి మళ్ళీ పెళ్ళి చెయ్యరాదా?" వాళ్ళ ప్రాంతంలో మళ్ళీ పెళ్ళి

# "ఈనాటి నా ఈ సౌభాగ్యం జై కిసాన్ ఎరువుల వరం"

"నా పాలిట జైకిసాన్ పేరు సుఖసౌభాగ్యాలకు మారు పేరు. ఎందుకంటే, శక్తివంతమైన జైకిసాన్ ఎరువులు నీటిలో ఇట్టే కరుగుతాయి, మొక్కలకు వెంటనే అందుతాయి. ప్రతి నేలకూ, ప్రతి పంటకూ అనువైన ఈ ఎరువులు పొలంలో బంగారం పండిస్తాయి."

**జైకిసాన్ యూరియా 46.4% నత్రజని,**
**జైకిసాన్ సంపూర్ణ 19:19:19,**
**జైకిసాన్ సామ్రాట్ 18:46:0.**

ఈ ఎరువులు మీకు అన్ని గ్రామాల్లోనూ వ్యాపించి వున్న జువారి వారి ప్రకాశవంతమైన పసుపుపచ్చ దుకాణాల్లో దొరుకుతాయి. సుశిక్షితులైన డీలర్లు పుష్కలమైన పంట పండించడానికి మీకు అన్ని విధాలైన సేవా సహకారాలనూ అందిస్తారు.

---

సరైన సంతులిత ఎరువులు వాడితే అత్యధిక లాభాలు చేకూరుతాయి. జువారి వారి ఉచిత భూసార పరీక్షా సేవను వినియోగించుకొని ప్రయోజనం పొందండి.

---













## జై కిసాన్ రాజ్యం—ధాన్యలక్ష్మి సామ్రాజ్యం

జువారి అగ్రో కెమికల్స్ లిమిటెడ్, గోవా.

ప్రాంతీయ విక్రయ కార్యాలయాలు: సికింద్రాబాద్, విజయవాడ, బెంగుళూరు, హుబ్లి, నాగ్‌పూర్, పుణె, ఇందోర్, ఆగ్రా, జువారినగర్.

LINTAS ZUA 135 2317 TL

## నిప్పు

చేసుకోవడం అంటే వారి తెగలో ఎవరితో నైనా కలసి ఉండిపోవడం అంతే!!

"అది ఒప్పుకోలేదయ్యా!"

"ఏమట?"

"దానికున్నది నేనొక్కడే అన్న బాబు! తను ఎవరితో నైనా మళ్ళీ కలిస్తే పదిమంది నన్ను చూసి 'వాడి చెల్లెలు పలానా వాడితో వుంది' అని అనుకుంటారటయ్యా! నా మరియాద కోసం అది చచ్చినా అలాంటి పని చేయనంది. అదిగాక చచ్చినోడి మీద దానికి చెడ్డ భ్రమయ్యా! అది బిడ్డల్ని చూసుకుని కాలం గడిపేస్తుంది తప్ప తప్పటడుగు వెయ్యదు!" అన్నాడు పెద్దరంగడు కళ్ళు తుడుచుకుంటూ. వాడి కంఠ స్వరంలో ఎంత గర్వమో? ఎంత సంబరమో?

దీక్ష పుచ్చుకున్న యోగులూ, తపస్సు చేసుకునే ఋషులూ మాత్రమే కాదు సామాన్య మానవులలో ని అతి సామాన్యులు సైతం కొందరు శారీరక సుఖాలను తేలికగా విస్మరించి జీవించగలరు అన్న సంగతి నాకు ఆనాడే అనుభవంలోకి వచ్చింది.

కళాసీబాబు చెప్తున్న సంగతులు వింటున్న నేను ప్రక్కకు తిరిగి నా కంటిలో సుడి తిరిగిన కన్నీటికి కళాసీబాబు చూడకుండా కొనగోటితో సుతారాంగా చెరిపేసుకున్నాను.

"ఆ నాటి నుండి నేను ఆమె వైపు కన్నెత్తి చూడలేదు బాబూ.... ఎందుకో? తెలుసా? భయం... పాపభీతి! ఆమె నిజంగా అగ్గిలాంటిది. ఆమెను పొందడం అసాధ్యం. మీకు కావాలంటే రాత్రికి మరెవర్నైనా ఏర్పాటు చేస్తాను. పెద్ద కష్టం కాకపోవచ్చు!" అన్నాడు.

ఒక నిముషం ధీర్ఘంగా ఆలోచించాను.

"ఒద్దు!" అన్నాను తరువాత సిన్సియర్‌గా, ఖచ్చితంగా.

స్త్రీ వ్యసనం నాకూ లేదు. నా భార్య ప్రఫుల్లముఖిని తప్ప మరో స్త్రీని తాకి ఎరుగను నేను. ఒక రకమైన వింత వాతావరణంలో విశృంఖలంగా నాలో కోరికలు పుట్టుకు వచ్చాయి. అయితే ఆ గిరిజన యువతిని గూర్చి పూర్తిగా తెలుసుకున్నాక నా మీద నాకే జుగుప్సలాటిది కలిగింది. నాలో కలిగిన వింత కోరికలన్నీ నాకే వికృతంగా అన్పించ సాగాయి తలచుకుంటే.

ఆ రోజు రాత్రి నా టెంట్‌లో క్యాంప్‌కాట్ మీద ఎలాంటి వికారాలూ లేకుండా గాఢంగా నిద్రపోయాను.

* * * *

సి. సి. మిక్చర్ మిషన్ వద్ద నుండి కూలీలు సిమెంటు కాంక్రీటు మిక్స్‌ను ఇనుప బొప్పులతో ఒకరికి ఒకరు అందించుకుంటున్నారు వరుసగా. బ్రిడ్జి మీదకు నిరవధికంగా సాగిపోతున్నాయి. ఇనుప బొచ్చెలు సిమెంటు కాంక్రీటు మిక్స్‌ను మోసుకుంటూ తన కుడిచేతి వైపున వ్యక్తి చేతులలోంచి వచ్చి పడే ఇనుప బొప్పెలను అందిపట్టుకుని తన ఎడం చేతి వైపున్న యువతి చేతులలోకి విసుర్తూ యంత్రంలా పని చేస్తున్న పెద్దరంగను సన్ గ్లాసెస్‌లోంచి పరీక్షగా చూశాను.

నేను పాలిటెక్నిక్ కాలేజిలో చదివే రోజులలో పెద్దక్కయ్య మా ప్రక్క ఇంటి ముస్లిం యువకుడితో వెళ్ళిపోయి బెంగుళూరులో అతన్ని వాళ్ళ ఆచారం ప్రకారం నిఖా చేసుకుంది. చాల రోజుల వరకూ నన్ను చూసి కాలేజిలో యల్. వి. డి. బి. (లేచిపోయిన దాని బ్రదర్) అనుకుని నవ్వుకునే వారు కొందరు ఆకతాయి వెధవలు.

చిన్నక్కయ్య పెద్దక్కయ్య కేమి తీసిపోలేదు. ప్రేమించాను అంటూ రాజారావును పెళ్ళి చేసుకుని సంవత్సరం అయినా తిరగక మునుపే అతనితో

తెగదెంపులు చేసుకుని జాన్‌ని మళ్ళీ పెళ్ళి చేసుకుంది ఓ చర్చిలో.

వాళ్ళకున్నది ఒకే ఒక తమ్ముడు. నేను ఎంత హర్ట్ అవుతానో, ఎంత షైఫీల్ అవుతానో అని నన్ను గూర్చి వాళ్ళు ఏ కోశానా ఆలోచించలేదు. వాళ్ళలో లేని ఆలోచనా, హృదయ వైశాల్యమూ, సంస్కారమూ చదువనేదే ఎరుగని ఈ గిరిజన యువతిలో స్పష్టంగా కన్పిస్తున్నాయి.

పెద్దక్కయ్య కూతురూ, చిన్నక్కయ్య కొడుకూ ఇద్దరూ మా అమ్మా నాన్నల దగ్గరే పెరుగుతున్నారు. పిల్లల్ని చూసుకునే తీరికా, ఓపికా అక్కయ్యలకి లేదు నిజానికి తోడులేని జీవితం గడుపుతూ శరీరం అరిగిపోయేలా కూలి పని చేస్తూ పిల్లల కోసమే బ్రతుకుతోంది ఈ అట్టడుగు ప్రజానీకంలోని ఓ పెద్ద యువతి.

ఉత్తర దక్షిణాల మధ్య ఎంత తేడా? ఎంత దూరం?

అమ్మకు పెద్దక్కయ్య మీదా, నాన్నకు చిన్నక్కయ్య మీదా విపరీతమైన ప్రేమ ఉండడంతో నన్ను గూర్చి సరిగా పట్టించుకొనే లేదు. నా తల్లిదండ్రులు. నాకూ కొన్ని ఇష్టాలూ, అయిష్టాలూ ఉంటాయన్న సంగతే ఎవరూ గుర్తించలేదు. కాలేజి ఫీజులు కూడా ఎన్నో పర్యాయాలు కొందరు మిత్రుల దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి చెల్లించుకున్న నాకు డబ్బంటే విపరీతమైన వ్యామోహం ఏర్పడడంలో తప్పేముంది?

* * * *

పెళ్ళయిన తరువాత నా అందానికి గానీ, నా తెలివితేటలకు గానీ ప్రఫుల్లముఖి ఇంప్రెస్ కాలేదు. నన్ను తను ప్రాణాధికంగా ఆరాధించడానికి కారణం నా శీలసంపద. నన్ను అంతగా ప్రేమించే నా భార్యకు ద్రోహం చెయ్యలేదన్న తృప్తి మిగిల్చుకున్నాను. అయితే నా గొప్పదనం ఏమీలేదు అందులో.

నేను ఆ తీవ్రతలో కోరుకున్న స్త్రీ ఒక గొప్ప మనిషి కాబట్టి నా శీలసంపద ముక్కలు పోకుండా నిలచింది. అలా కాక ఆ స్త్రీ సామాన్యురాలయి వుంటే నా క్యారక్టరనే తెల్లకాగితం మీద చిరస్థాయిగా నల్లని మరకలు చెరగని ముద్రల్లా పడిపోయి వుండేవి.

"అన్నా" అని పిలిచే అమ్మాయితో 'ఆ' సాంగత్యం కోసం ఆరాట పడే యువకులూ, "సోదరా" అని సంభోదించే వ్యక్తితో 'ఆ' సాంగత్యాన్నే కోరుకునే యువతులూ, "అమ్మా" అని సంభోదిస్తూనే పాపపు చూపులు ప్రసరించే ప్రముఖులూ పుష్కలంగా ఆత్మవంచన చేసుకుంటూ బ్రతికేస్తున్న ఈ సమాజంలో పెద్దగంగు లాంటి వాళ్ళు చాల తక్కువ శాతం మాత్రమే.

పెద్దగంగు ఓ గొప్ప క్యారెక్టరు నిజానికి. అయితే ఆమె క్యారక్టర్ని గుర్తించగలిగిన వారు ఎవరు? అంత ఓపికా తీరికా ఈ సమాజంలోని మనుషులకు ఉండదు.

మానవ నిర్మితమైన ఈ సమాజపు గోడల మధ్యన ఈ గిరిజన యువతికి ఓ స్థానమంటూ ఉండకపోవచ్చు... కానీ నా జ్ఞాపకాల పొరల మధ్యన ఈమె కెప్పటికీ ఓ ఉన్నత స్థానం వుండిపోతుంది శాశ్వతంగా!

కొందరికి కొన్ని అయాచితంగా లభిస్తాయి అంతే!!

* * * *

బహుశా ఇక జీవితంలో పెద్దగంగును మళ్ళీ చూసే అవకాశం నాకు రాకపోవచ్చు. అయితే ప్రఫుల్లముఖిని తప్ప మరో స్త్రీని కోరుకునే ధౌర్భాగ్యం మాత్రం నాకు ఇక సంప్రాప్తించదు. పెద్దగంగుతో నాకు ఏర్పడిన పరోక్షపు పరిచయం నాలో ఆ ఔన్నత్యాన్ని తెచ్చిపెట్టింది.

జీవితంలో ఒకోసారి ఎదురయ్యే చిన్న చిన్న సంఘటనలు శాశ్వతమైన పరిణామాలను తెచ్చిపెట్టగలవు.

వర్కు ఆఖరిసారి చెక్ చేసే నెపం మీద స్పాటుకు వెళ్ళి ఆఖరిసారి పెద్దగంగును కూడా చూసి వచ్చాను.

జీపు ఎక్కే ముందు కళాసీబాబును ప్రక్కకు పిలచి అతని చేతిలో ఐదు వంద రూపాయల నోట్లు ఉంచి అన్నాను. "పెద్దగంగుకూ, ఆమె పిల్లలకూ బట్టలు తీసి ఇవ్వు!"

కళాసీబాబు విచిత్రంగా చూశాడు నాకేసి. తరువాత కొంత చనువు తీసుకుని నా డబ్బు నా షర్టు జేబిలో ఉంచేశాడు.

"కష్టం బాబూ! పెద్దగంగు పది నయాపైసలు కూడా ఉచితంగా తీసుకోదు! ఇవ్వాలని అనుకోవడం అవివేకం. ఒక విషయం చెప్పనా? ద్వేషంతో తాకినా, కోరికతో తాకినా, ప్రేమతో తాకినా... నిప్పును ఎలా తాకినా కూడా చెయ్యి కాలుతుంది బాబూ! క్షమించండి!!" అన్నాడు.

అర్థం చేసుకున్నాను.

అతనితో హృదయపూర్వకంగా కరచాలనం చేసి వెనక్కి తిరిగాను. నేను ఎక్కి కూర్చోగానే జీపు కదిలింది.

ఒక్కసారి కూడా వెనక్కి తిరిగి చూడలేదు నేను. నా కళ్ళలో తిరిగిన నీళ్ళు నిజాయితీ పరుడైన కళాసీబాబుకు కన్పిస్తాయని మాత్రం కాదు. . □

## మనిషి – ఊహ

రుధిరం కదనం అనిపలికితే
అది విప్లవం
అధరం మధురం అని వ్రాస్తే
అది కవిత్వం
జాతి, జీవనం అని అరిస్తే
అది నాస్తికత్వం
దేశం అభ్యుదయం అంటే
అది పిచ్చితనం
శిక్ష క్రమశిక్షణ అని వాదిస్తే
అది నిరంకుశత్వం
స్వాతంత్ర్యం, స్వేచ్ఛ అని
మౌనం వహిస్తే
అది చేతకాని దనం

— వై. ఆర్. ముదిగొండ






# హైదరాబాదు నోట్‌బుక్

## తొలి తెలుగు గ్రంథం కవిజనాశ్రయం:-

నన్నయ భట్టారకునికి వంద సంవత్సరాలకు ముందే తెలుగు కవిత గ్రంథరూపం దాల్చింది. ఈ గ్రంథం రేచనకృతమైన కవిజనాశ్రయమని చెప్పక తప్పదు – అని డాక్టర్ పుచ్చా పరబ్రహ్మశాస్త్రి అక్టోబర్ రెండవ ఆదివారం జరిగిన తెలుగు గోష్ఠిలో పరిశోధన వ్యాసం చదువుతూ సూచించారు. కవిజనాశ్రయ తాళపత్ర ప్రతులు పధ్నాల్గు లభించాయి. వాటిలో 'జ' అనే గుర్తుగల తాటాకు ప్రతిలో మాత్రమే అవతారిక పద్యాలున్నాయి. జయంతి రామయ్య పంతులుగారు తొలి పీఠికలో వేములవాడ భీమకవి ఈ గ్రంథాన్ని రచించాడనడానికి ఆధారాలు లేవంటూనే ఈ అవతారికను తర్వాత ఇచ్చి, భీమకవిదన్నారు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, చాగంటి వారు మున్నగువారు భీమ కవికృతం కాదనే శంకించారు. కాని, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు మాత్రం భీమనకృతమన్నారు. 13 ప్రతులలో లేని అవతారిక ఒక దానిలో వున్నప్పుడది కల్పితమనుకోక తప్పదు. అంతే కాక అక్షర స్వరూపం మొదలయిన చర్చలలో చాల ప్రక్షిప్త పద్యాలున్నట్టు తోస్తుంది. ఇది భీమకవి కృతం కాదనడానికి, జైనుడైన రేచనే రచించాడనడానికి కొన్ని కీలకాలు మూలంలో వున్నాయి. మొదట సరస్వతీ ప్రార్థన జైన సంప్రదాయం. ఆంధ్ర పద భక్తి మెయిన్ అనడానికి జినేంద్ర పద భక్తి మెయిన్ అని, జితేంద్ర పదభక్తి మెయిన్ అని పాఠాంతరాలున్నాయి. యాచకా భరణునికి వాచకా భరణుడనే పాఠాంతరముంది. వాచకాభరణుడనే బిరుదు జైనులది. జైనులు ధర్మప్రవర్తకులను వాచకులని, బౌద్ధులు ధర్మ-ప్రవర్తకులను ధర్మకేథికులని వ్యవహరించడం సంప్రదాయం. వాడకాభరణుడనేది బిరుదు ధర్మ ప్రవర్తకులకు ఆభరణ ప్రాయుడని అర్థం. ఈ బిరుదు పంప మహాతమ్ముడైన జినవల్లభునికి – వాచకా భరణుడని – ఉంది. ఇతడు వేయించిన గంగాధర కన్నడ శాసనంలో తనను వాగ్వధూ వల్లభుడు, భీమతనూజుడు, పంపానుజుడు, వాచకాభరణుడు మొదలయిన విశేషణాలతో వర్ణించుకొన్నాడు. జిగవల్లభుడు తన శాసనం చివర కన్నడ సంప్రదాయంలో తెలుగు కందపద్యాలూ రచించాడు. దానిని బట్టి తెలుగు కవిత ప్రచురంగా వుండేదన్నది స్పష్టం. అప్పటి-వారికి ఛందో గ్రంథాలు రచించడం ఒక విలాసం. కన్నడంలో అదివరకే ఛందో గ్రంథాలున్నాయి. రేచన కూడ ఆ పద్ధతికి తెలుగులో తొలి ఛందో గ్రంథం, తొలిగ్రంథం రచించాడు. ప్రకరణాంతాలలో "వాదీంద్ర చూడమణి చరణ సరసీరుహ మధుకరాయమాన శ్రావకా భరణాంక విరచితంబైన కవిజ నాశ్రయంబను ఛందంబున" అని చెప్పు-కొన్నాడు. సంజ్ఞా ప్రకరణం రెండవ పద్యంలో

'పరగిన వినుల యశోభా
సురచరితుడు భీమనాగ్ర సుతుడఖిల కళా
పరిణతుడయ్యును భూసుర
వరప్రసాదో దిత ధ్రువశ్రీయుతుడై.

అని వుంది. వాదీంద్ర చూడామణి, మొదట జైనుల బిరుదు. యశాస్తిలకచంపూ రచయితయిన సోమదేవ సూరికి వాదిభాషంచానన బిరుదుంది. అతని శిష్యులకు వాది భీసింహ, వాది రాజ, వాది ఘరట్ట మొదలయిన బిరుదులున్నాయి. పై పద్యంలోని భీమ నాగ్రసుతుడు పంపడు కావచ్చు. రేచన అంత్యప్రాసోదా హరణంలోనూ

జననుత భీమత నూజా,
సునయార్పిత విభవతేజ సుభగ మనో జా
వినుత విశిష్ట సమాజా
యన నంత్యప్రాసమగు నహర్పతి తేజా

అని భీమ తనూజుని పేర్కొన్నాడు. తమిళ ఛందో గ్రంథం యాప్పిరంగం కారికైలో రేచియార్ సెయ్ద వడూగుఛందం అని ఉదాహృతం. రేచియార్‌కు వాచియార్ అనే పాఠాంతరమూ వుంది. ఈ కారణాలను బట్టి వేములవాడలో రేచన పంప మహాకవి జినవల్లభుల తోడ్పాటుతో నో, ఆదరణతో నో కవిజనాశ్రయం రచించాడు. – అని డాక్టర్ పరబ్రహ్మశాస్త్రి తమవాదం ప్రతిపాదించారు. ఈ చర్చలలో శ్రీయుతులు వై. అంజనేయులు, ముదిగొండ వీరభద్రశాస్త్రి, టి. వి. జి. శాస్త్రి, చింతా వేంకటేశ్వర్లు, చీమకుర్తి శేషగిరిరావు, ఎన్. మార్కండేయ శర్మ, పాతూరు శ్రీరామ శాస్త్రి, అవధానుల విజయ కుమార్‌బాబు, తిరుమల రామచంద్ర పాల్గొన్నారు.

## యక్ష సంస్కృతి:-

నవంబర్ రెండవ ఆదివారం జరిగిన తెలుగు గోష్ఠిలో బిర్లా పురా తత్త్వ పరిశోధన కేంద్రం డైరెక్టర్ డాక్టర్ టి. వి. జి. శాస్త్రి యక్ష సంస్కృతిని గురించి ప్రామాణికమైన పరిశోధన వ్యాసం చదివారు. ఒకప్పుడు, – బౌద్ధ సంస్కృతికి ముందు – యక్షనాగరకతా సంస్కృతులు భారత దేశమంతా వ్యాపించి వున్నట్టు వివిధ వాస్తు శిల్పాలను బట్టి, గ్రంథాలను బట్టి తెలుస్తున్నదని, మంగోలియాలోని యక్క అనే జాతికి ఈ యక్షులకు సంబంధం వుండవచ్చని డాక్టర్ శాస్త్రి అన్నారు. యక్షులు వృక్షాదులను పూజించేవారని, వారి నాగరికత వైదిక నాగరికతలో లీనమైపోయిందని, వాటి చిహ్నంగా కుబేర, వైశ్రవణ మున్నగు పూజలలో కానవస్తున్నదని అన్నారు. ఈ చర్చలో శ్రీయుతులు పాతూరు సీతా రామాంజనేయులు, ముదిగొండ వీరభద్రశాస్త్రి, టి. వి. జి. శాస్త్రి, అవధానుల విజయకుమార్, చీమకుర్తి శేషగిరిరావు, పాతూరి శ్రీరామశాస్త్రి, టి. వి. శర్మ, బి. ఎన్. శాస్త్రి, తిరుమల రామచంద్ర మున్నగువారు పాల్గొన్నారు.

## ఉపశ్రుతి:-

దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి పాటలంటే నాకు చాల ఇష్టం – అన్నారు మిత్రులు నిడుదవోలు సర్వేశ్వరరావుగారు. చాల మందికి ఇష్టమే – అన్నాను. చాలమంది సంగతి నాకెందుకూ? నాకు 'పదములె చాలు' అనే పాట మరి ఇష్టం. నేను ఎప్పుడు గుర్రప్పందేలకు వెళ్ళినా, ఆ పాటే పాడుకుంటాను – అన్నారు సర్వేశ్వరరావు.

—తిరుమల రామచంద్ర



శ్రీ రాజాలక్ష్మి ఫౌండేషన్‌వారి 1984 అవార్డును శ్రీమతి టంగుటూరి సూర్యకుమారి నవంబరు 19న మదరాసులో శ్రీమతి మహా లక్ష్మి రాజా నుంచి అందుకుంటున్న దృశ్యం.

# ఉత్తరాలు.....

## ముగింపు బాగుంది

"మలుపు" పెద్దకథ ముగింపు చాలా బావుంది. అడది అంటే జయరాంలాంటి మగాళ్ళు ఆడించినట్లల్లా ఆడే బొమ్మకాదని తెలియజెప్పేలా ఉదయ తీసుకున్న నిర్ణయం అభినందించదగినది.

కొండమూరి శ్యామ, గుత్తి నదివి

* * *

1-7 నవంబరు 85 ఆంధ్ర సచిత్రవారపత్రికనందు ప్రచురించిన కథలు చాలా బావున్నాయి. ఆదూరి సావిత్రిగారి "మలుపు" పెద్దకథ ముగింపు నాకు నచ్చింది.

పి. మాలతి, ఆమదాలవలస

## సీరియల్స్

అందాలతార "శ్రీదేవి" ముఖచిత్రంతో వెలువడిన "ఆంధ్రసచిత్ర వారపత్రిక" దీపావళి సంచిక ఎంతో బాగుంది. "త్రివేణీ సంగమం" మమ్మలన్నీ మొదట్లోనే ఆకట్టుకుంది.

యరబోలు చిట్టిబాబు,
పట్నాల వసంతరావు, ఆకివీడు

★ ★ ★

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో సీరియల్స్ అన్నీ బాగున్నాయి. త్రివేణీ సంగమం వాటన్నిటిలో ఒక ప్రత్యేకమైన స్థానం సంపాదించుకుంది అని అనడంలో అతిశయోక్తి కాదేమో. ఈ నవలలోని అరుంధతి, వనజ, మాల జీవితాలు మూడూ మూడు రకాలుగా ఎంతో ఆశక్తికరంగా చిత్రించబడ్డాయి. ఏది ఏమైనా ఈ నవల చాలా వెరైటీగా ఉంది.

జి.పావని, నెల్లిమర్ల

* * *

సీరియల్స్‌లో త్రివేణీసంగమం చాల ఇంటరెస్టింగుగా సాగుతోంది. వనజ పాత్రపై మాకెంతో సానుభూతి కలుగుతోంది. ఆమె జీవిత పరిష్కారానికి నడుంకట్టుకున్న అరుంధతి పాత్ర ఎంతో హర్షదాయకం. పాత్ర చిత్రణ ఎంతో సహజంగా ఉంది.

డి. విజయ, విజయనగరం

## ఆనందదాయకం

మా అందాల నటి శ్రీదేవి ముఖచిత్రంతో వెలువడిన దీపావళి సంచికలోని నటి శ్రీదేవి టపాకాయల వ్యాసం, జయసుధ, జయప్రదల సినిమా కబుర్లు చాల ఆనందదాయకంగా ఉన్నాయి.

యల్.సి.హెచ్. రాజేంద్రరాజు, పాపినేనివల్లి

## చాలా బాగుంది

అందాలతార, మందారమాల, గులాబిమొగ్గ అయిన, మా అభిమానతార 'శ్రీదేవి' ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాలా బాగుంది.

'టపాకాయల కోసం' శ్రీదేవి అనుభవం, 'ప్రేలని ఆటంబాంబ్!' జయప్రద తమాషా పని, జయసుధగారి 'మళ్ళీవచ్చే దీపావళి' చాలా బాగున్నాయి.

పి. దశరథ రామారావు, న్యూపాల్వంచ

## న్యూఢిల్లీ లేఖ

25–31 అక్టోబరు ఆంధ్ర సచిత్ర వారపత్రికలో "అధికార వికేంద్రీకరణే అసలైన విప్లవం" వ్యాసం (న్యూఢిల్లీ లేఖ)లో డాక్టర్ జయ్‌దుబాషి గారు చక్కని విషయాలు తెలియ జేశారు.

పడాల బులివీర్రెడ్డి, కొరికుదురు

* * *

అక్టోబర్ 25–31 "ఆంధ్రపత్రిక" లోని న్యూఢిల్లీ లేఖ శీర్షికన డా. జయ్‌దుబాషి గారు "అధికార వికేంద్రీకరణే అసలైన విప్లవం" అనే వ్యాసంలో అధికార వికేంద్రీకరణ ఎంతో అవసరమని నొక్కి వక్కాణించడం ప్రశంసనీయం.

ఐ. ఎల్. ఎన్. చంద్రశేఖర్, పోరుమామిళ్ళ

## సద్విమర్శ చేయాలి!

అమెరికా వారికో, మరెవ్వరికో జాతీయ భావము బాగా వున్నట్లు, మనకు లేనట్లు డా. జయ్ దుబాషి గారు సెలవిచ్చారు. కారణం.... మన దేశంలో విప్లవాలు జరుగలేదని వ్రాశారు. 1857 నాటి విప్లవము, సుభాష్, అల్లూరి సీతారామరాజు నేతృత్వాన జరిగినవి పోరాటాలు కావా? సత్యాహింసలే ఆయుధాలుగా సాగిన భారత జాతీయ స్వాతంత్ర్య సంగ్రామము "ప్రపంచంలోనే" ఒక విశిష్టమైన విప్లవం కాదంటారా?

అమెరికాలో నీగ్రోలు కూడా వేరే దేశం కావాలనరు. మనలో కొందరు అలా అంటున్నారు. అంటే అమెరికాలో కంటే మన దేశంలో ఎక్కువ స్వేచ్ఛ ఉన్నట్లే కదా! అలా కొందరు అనుటకు కారణం మన రాజకీయాలు, విదేశీ కుట్రలకు మన వారు దోహదపడటమే కదా!

ఇక రీగన్ సెంట్రల్ పార్కును, థాచర్ ఇళ్ళ కేటాయింపులకు అజ్ఞలు జారి చేస్తారా? అని ప్రశ్నించారు. చేయరు. ప్రపంచంలో అభివృద్ధి చెందిన, ఘనత వహించిన గ్రేట్ బ్రిటన్, అమెరికాలులో అటువంటి అవసరమే లేదు. కాని, మన దేశంలో ఏదో మన ప్రధానికి అలాంటి చిన్న విషయాలు సైతం దృష్టికి వచ్చి చర్య తీసుకుంటే ప్రశంసకు బదులు విమర్శయా? మేధావులు జాతీయ, అంతర్జాతీయ సమస్యలను చక్కగా అవగాహన చేసుకొని సద్విమర్శలు చేయాలి. చక్కని సూచన లివ్వాలి. అంతేకాని, మన ప్రధానిని విమర్శించి, అమెరికా అధ్యక్షున్ని, ఇంగ్లాండు ప్రధానిని పొగిడితే అది జాతీయత క్రింద వస్తుందా?

వై. విద్యాసాగర్, వరంగల్

## మార్గదర్శకాలు

నవంబరు ఒకటవ తేదీన వారపత్రికలో ప్రచురింపబడిన లయబ్రహ్మ నారాయణ తీర్థులు వ్యాసం చదివి చాలా ఆనందించాను.

సంగీతానికి త్రిమూర్తులు శ్రీ త్యాగరాజు, దీక్షితరు, శ్యామశాస్త్రుల వారు. అలాగే కృష్ణ ప్రేమతత్వాన్ని గానం చేసి రచించిన ముగ్గురు మూర్తులు శ్రీ జయదేవ, నారాయణ తీర్థులు, క్షేత్రయ్యగారలు.

శృతిర్మాతా, లయఃపితః అన్న నానుడి ప్రకారం, యక్షగానాల లయ విన్యాసాలకూ, పదచాలనానికీ జీవం పోశారు నారాయణ తీర్థులు.

వ్యాసకర్త పేర్కొన్న వన్నీ సంగీతాభిమానులకూ, శాస్త్రజ్ఞులకూ అభిలషణీయములే.... అయితే ఆయన రచనలు సజీవములని చెప్పక తప్పదు. తరంగం కూచిపూడి నాట్యానికి ప్రాణం, ఇంక సంగీతంలో ఒక భాగం. డిప్లొమా పరీక్షల (సిలబసు)లో యూనివర్శిటీ వారు వాటిని చేర్చారు.

కాలగతిలో వీరి తరంగాలను ఎవరికి తోచిన రాగంలో వారు పాడు కుంటున్నారు. శ్రావ్యంగా పాడితే వీనుల విందు చేసే అందం ఉంది తరంగాల్లో.... ముఖ్యంగా నీలాంబరి రాగంలో "మాధవ మామవదేవా యాదవ కృష్ణా యదుకుల కృష్ణా" అన్న తరంగం బాగా వ్యాప్తిలో నుంది.

ఈయన జన్మస్థలం కృష్ణా జిల్లాలోని "కాజ" అన్నది నిజమే! ఈయన పండిత వంశానికి చెందినవారనీ, వీరి పూర్వీకులది విజయనగరమనీ చరిత్ర చెపోతుంది.

విద్వాంసుల, కళాకారుల జీవితాలేవి తరచినా, వారి వరమో, శాపమో గానీ ఇతర ప్రాంతాలలో తప్ప వారికి గుర్తింపు లేదు. అయినా ఆంధ్రుల చరిత్ర చాలా పటిష్టమైనది. స్వరాష్ట్రంలో గుర్తింపు లేకపోయినా వెనుకంజ వేయరు. మన రంగస్థలాలు, సంగీత సమితులు, పరిషత్తులు చిన్న చూపు చూసినా, ఇటువంటి మహనీయుల జీవిత చరిత్రలే వర్తమాన కళాకారులకు మార్గదర్శకాలని భావించాలి. అందుకోసమైనా వీరి చరిత్రలు, రచనలు సజీవంగా నిలవాలి.

కె. నాగేశ్వరి, పటమట, విజయవాడ ☐

Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao at
the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3, Editor : S. Radhakrishna
Phones :- Business : 61247, 61248, Editorial : 75667

ఇప్పుడు మీకోసం తెచ్చాం
కొత్తరుచులను మేళవించిన క్రీమ్‌బిస్కెట్లు

ఇలాచీ క్రీమ్ బిస్కెట్లు
ఆరెంజ్ క్రీమ్ బిస్కెట్లు
పైనేపిల్ క్రీమ్ బిస్కెట్లు
చాకలెట్ క్రీమ్ బిస్కెట్లు




అసోకా ®
బిస్కెట్లు



రుచి చూడండి ఆనందించండి అసోకా బిస్కెట్లతో కలిసి మెలిసి ఉండండి